Pydah Venkatachelapati Telugu Manuscript Print Fund Series No. 1.



శ్రీ ర స్తు.

# సాంబోపాఖ్యానము.



## రామరాజు రంగప్పరాజకవిప్రణీతము.



కా కి నా డ:

కాకినాడముద్రాక్షరశాలలో ముద్రింపఁబడి

శ్రీమదాంధ్రసాహిత్యపరిషత్తువారిచేఁ

బ్రకటింపఁబడినది.

వెల రు. 1—0—0.

అంగీరసనామసంవత్సరము.

1932.

# విషయసూచిక.

## చతుర్థాశ్వాసము.



## పంచమాశ్వాసము.

# సాంబోపాఖ్యానము.

## పీఠిక.

ఆంధ్రభాషాభివృద్ధియే పరమప్రాప్యంబుగ నవతరించిన యాంధ్రసాహిత్యపరిషత్తు పుట్టిననాఁటనుండియు శక్తివంచనము లేకుండ భాషాసేవ చేయుచుండుట యాంధ్రలోకమున కవిదితము గాదు. పరిషత్తువంటి సంఘము లనేకము లితరములు గూడ భాషాభివృద్ధికై పనిచేయుచున్నవి కలవు. పరిషత్తునకును నితరములకును గమ్య మొక్కటియే యైనను మార్గములు భిన్నములై వెలయుచున్నవి. ప్రాచీను లేర్పఱిచిన భాషాసౌష్ఠవముల విడనాడక నవీనము లగు విజ్ఞానములనెల్ల భాషయం దమర్చుట పరిషదుద్దేశ్యము. తనయభిమత మీడేర్చుకొనుపొంటె నింతవఱకు వివిధంబు లగు గ్రంథరాజములు పత్రికాముఖంబునను స్వతంత్రముగను పరిషత్తు ప్రకటించి యున్నది. ఏకైకమాతృకములై యనన్యజ్ఞాతపూర్వములై (కొన్ని శిథిలాతిశిథిలములై) బహుప్రయత్నలబ్ధములైన విప్రనారాయణచరిత్రము, జైమినిభారతము, చంపూరామాయణము, శివరాత్రిమాహాత్మ్యము, చంద్రభానుచరిత్రము, నారసింహపురాణము, కాళిందీకన్యాపరిణయము మొదలగు మహాగ్రంథములు పరిషత్తుచేఁ బ్రకటింపఁబడి యాంగ్లవాఙ్మయమున నతిలోక తేజంబున విలసిల్లుచున్నయవి.

పరిషత్తు తనకార్యములు నిర్విఘ్నముగను సత్వరముగను నిర్వహించుటకు ధన మత్యధికముగ నుండవలయునుగదా! ఆంధ్రమహాజనులు చూపవలసినంతగ నాదరాభిమానములు పరిషత్తునెడఁ జూపమిచేఁ బరిషత్తునకు ద్రవ్యలోపము సంభవించి తనకార్యములను బరిషత్తు చుఱుకుగ నిర్వర్తింపలేకయున్నది. అయినను బరిషత్సంకల్పితకార్యములం దతిముఖ్యమును బహుప్రయత్నసాధ్యము నగు నిఘంటు నిర్మాణమునకు శ్రీ శ్రీ శ్రీ పిఠాపురము మహారాజులుంగారు పూనుకొని మిగుల శ్రద్ధతోఁ బనిచేయించుచున్నారు. పరిషత్ప్రకటిత మగు జైమినిభారతముద్రణమునకైన ద్రవ్యమునంతను మధురజిల్లా వడగరై దొడ్డప్పనాయక్కనూరు జమీందారులు శ్రీ వి. రామభద్రనాయఁకుఁడుగారొసంగిరి. శివతత్త్వసారమును బ్రకటించుటకుఁగాను శ్రీ దేవిడి జమీందారులు శ్రీ ఇజ్జతాసార్ కందుకూరి బాలసూర్యప్రసాదరావుగారొసంగిరి. ఇపుడు నూతనముగాఁ బ్రకటింపఁబడు సాంబోపాఖ్యానాదులకై రావుబహద్దరు శ్రీ శ్రీ

పైండా వేంకటాచలపతిగారు ధనమొసంగుచు నాంధ్రభాషకు మహోపకృతిఁ గావించియున్నారు. పైమహోదారులయెడ నాంధ్రలోక మెల్లను గృతజ్ఞమై యుండును. ఇట్లే శ్రీమంతులు మహోదారులు జమీందారులును దమయాంధ్రాభిమానములఁ బ్రకటించి పరిషత్తును జిరస్థాయినిగాఁ జేసి తాము శాశ్వత ఖ్యాతి నొందెదరుగాక యని సవినయముగ మనవి చేయుచున్నాఁడను.

## — కవి కాలనిర్ణయము —

సాంబోపాఖ్యానమును రచించిన కవి రామరాజు రంగప్పరాజు. ఈతఁ డార్వీటి బుక్కరాయలవంశమున జనియించినవాఁ డగుటచే రాజకవియు నుత్తమ కవితాగౌరవమునఁ గవిరాజును నగుచున్నాఁడు. ఇక్కవి యాశ్వాసాంతగద్యములందుఁ దన్నుఁగూర్చి "శ్రీమత్తిరుమల శ్రీనివాసాచార్య కరుణాపారంపర్యప్రాప్తాత్రేయస గోత్రాపస్తంబసూత్ర సకలకళాభోజ రామరాజ రంగప్పరాజ" అని వ్రాసికొని యున్నాఁడు. ఆర్వీటి బుక్క రాజు కొడుకు రామరాజువలన నీకవికి రామరాజువారను నుపనామము కలిగినది. కవి తనకులగోత్రాది విషయమున విపులముగ వంశావతారమును జెప్పికొనినాఁడు, కాని, నివాసస్థలముగాని తనరాజ్యవిషయము గాని యేమియుం దెలిపి యుండలేదు. అయినను గవితండ్రి కృష్ణదేవరాయల పాలనమున నాతనికి సామంతుఁడై కొండవీటిపాలకుఁడుగా నుండుటచే నీతఁ డా కొండవీటిప్రాంతముననో లేక విజయనగరప్రాంతముననో యుండె నని యూహింపవచ్చును. ఈతని కగ్రజులు మువ్వు రుండుటచేతను, నందును జ్యేష్ఠుఁ డగు కోనేటి తిమ్మరాజు రాజ్యపాలనాది సమర్థుఁడై యుండుటచేతను నీతనికిఁ గవితాపరిశ్రమమునకు వలయునంత యవకాశము లభించియుండును. కవి తనపెద్దన్న యగు కోనేటి తిమ్మరాజును వర్ణించిన వర్ణనమును జూడ నీకృతిరచనాకాలమున నాతఁడు గూడ నేదో యొకమండలమునకుఁ బాలకుఁడుగా నుండె నని యే తోఁచుచున్నది. ఆమండలము కొండవీడో లేక మఱియొకటియో నిర్ణయింప నాధారము లేదు.

ఈకవి తనవంశావళి నీక్రింది విధమున వర్ణించుకొని యున్నాఁడు. చంద్రవంశమునం దాత్రేయసగోత్రులగు క్షత్రియులలో, ఆర్వీటి బుక్కరాజు జనియించెను. ఆతనికి రామయ్య యనుపుత్త్రుఁ డుదయించెను. ఆరామయ్యకు నలువురు భార్యలు. అందుఁ బెద్దభార్యయగు ఓబళక్కయందు రాయనరాజు గోపరాజు ననునిరువురు సుతులును రెండవభార్య లక్కమ్మయందు తిమ్మరాజు, కొండ్రాజు, శ్రీరంగరాజు, ననుమువ్వురు పుత్త్రులును మూఁడవసహధర్మిణి రంగ

మ్మయందు మూర్తిరాజు, రంగరాజు ననునిద్దఱు తనయులును నాలవయిల్లాలు అమలమ్మయందు జగ్గరాజు, చిననరసింగరాజు నను నిరువురు కుమారులును గలిగిరి. వీరిలో లక్కమ్మపుత్త్రులలో నగ్రజుం డగు తిమ్మరాజునకుఁ గూడ నలుగురు భార్య లుండిరి. అల తిమ్మరాజునకుఁ బ్రథమభార్యయందు, పినకొండ్రాజు, తిమ్మరాజు, అప్పలరాజు రామరాజు, నను నలువురు సూనులును, రెండవపత్నియగు లక్ష్మమ్మయందు, పినతిరుమలయ్య, పెద్దతిరుమలయ్య యను నిద్దఱు సుతులును, మూఁడవభార్యయగు గోపమాంబయందు నల్లతిరుమలరాజు, విఠలరాజు, చిన్నతిమ్మరాజు, పాపతిమ్మరాజు నను నలుగురు కుమారులును నాల్గవ భార్యయగు తిరుమలమ్మయందు తిమ్మప్ప, కోనప్ప, సింగరాజు నను మువ్వు రాత్మజులును నుద్భవించిరి. తిమ్మరాజు ననుజుఁ డగుపెద్దకొండ్రాజునకు, కొండమాంబ యను భార్యయందు కోనేటిరాజు, పెద్దతిమ్మరాజు, చిన్నతిమ్మరాజు, రామనృపతి యనునలువురు కొడుకులును శ్రీరంగమ్మ యనుభార్యయందు ఔబళరాజు, వేంకటేశుఁడు నను నిరువురు సూనులును జనించిరి. మూఁడవవాఁ డగు శ్రీరంగరాజునకు తిమ్మమాంబయందు కోనవిభుఁడు, తిమ్మభూపతి, రామనృపుఁడు, ఎఱ్ఱతిరుమలయ్య, వేంకటాద్రి యను నేవురు తనయులు జనించిరి. వీరిలో ఎఱ్ఱతిరుమలరాజునకు రంగరాజు వేంకటాద్రిరాజు నను నిరువురు సూను లుద్భవించిరి. బుక్కరాజు రామయ్య కుమారుఁడు తిమ్మరాజునకు జ్యేష్ఠపుత్త్రుఁ డగు పినకొండ్రాజునకు కోనమాంబయందు కోనేటి తిమ్మరాజు, చినతిమ్మరాజు, అప్పలరాజు, రంగప్పరాజు నను నలుగురు తనూజు లుద్భవించిరి. వీరిలోఁ గడపటివాఁ డగురంగప్పరాజే యీ సాంబోపాఖ్యానమును రచించినకవి.

ఈ వంశమునందు బుక్కరాజు రామయ్య కొడుకు తిమ్మరాజునకు గోపమాంబవలన జనించిన తనయులు నలువ్రరిలో నగ్రజుఁ డగు తిరుమలరాజునకు నల్లగా నుండుటచే నల్లతిరుమలరా జనియుఁ జిన్నతిమ్మరా జనియు నామాంతరములు గలవు. దోనూరి కోనేరుకవివలన *బాలభాగవతచంపువును గృతి నందిన దీతఁడే. (చూ. సాం. 1 ఆ. 23 వ. 4-5 పుటలు) బుక్కరాజు రామయ్యకొడుకు శ్రీరంగరాజు మూఁడవకుమారుఁడు రామరాజే శ్రీకృష్ణదేవరాయల యల్లుఁడై "అళియ"†రామరా జను ప్రఖ్యాతి నొందినవాఁడు. ఆతఁడు నల్లరాజు

---

* ఈబాలభాగవతము ద్విపద, కొంత ముద్రితము. ద్విపదకూడ చంపువుగా వాడుకలో నుండెనేమో. † అళియ=అల్లుఁడు. కన్నడము.

చినతిమ్మరాజును సంహరించినవాఁ డనియుఁ గర్ణాట వైశ్వర్యనిర్వహణావార్య భుజాధ్వజాయుధుఁడు ననియుఁ జెప్పఁబడియెను. అళియరామరాజు తమ్ముఁడగు తిరుమలయ్య గుత్తెతిమ్మరా జని వర్ణింపఁబడెను. ఈతనికిఁ బూర్వుఁడొక్కఁడు తిమ్మరాజు నల్లగా నుండుటచే నాతఁడు నల్లతిమ్మరా జనియు నీతఁడెఱ్ఱని తనుచ్ఛాయ గలవాఁ డగుట నెఱ్ఱతిమ్మరా జనియు వ్యవహరింపఁబడిరి. ఈయెఱ్ఱతిమ్మరాజే వసుచరిత్రము కృతి నొందినవాఁడు. ఈవంశావళిని బట్టి యీకవికాలనిర్ణయము గావింపవలసియున్నది. ఈకవి అళియరామరాజునకును, తిరుమలరాజునకును బాలభాగవతకృతిపతి యగునల్లతిరుమలరాజునకును సమకాలికుఁ డగుటంజేసి క్రీ. శ. 1550 ప్రాంతమం దుండెనని నిర్బాధముగాఁ జెప్పవచ్చును.

ఆంధ్రకవులచరిత్ర మీాతనివిషయమున "అళియరామరాజు పెద్దతండ్రి కొడుకగు కోనేటి తిమ్మరాజున కాశ్రితుఁడై యుండినవాఁడు" అని చెప్పుచున్నది. ఆవ్రాఁత ప్రమాదపతితము. కోనేటి తిమ్మరాజు అళియరామరాజునకుఁ బెద్దతండ్రి కుమారుఁ డగు పినకొండ్రాజునకుఁ గొడు కని యీగ్రంథమునందును, తెనాలి అన్నయచే రచియింపఁబడిన సుదక్షిణాపరిణయమునందును విస్పష్టముగఁ గలదు. మఱియు నీకవి కోనేటితిమ్మరాజున కనుజుఁ డై యుండఁగా నాశ్రితుఁడై యున్నవాఁ డనుట ప్రమాదమే. ఈకవి తన పెద్ద యన్న యగు కోనేటి తిమ్మరాజును విశేషించి వర్ణించి తరువాత నతనితమ్ము లగు చినతిమ్మరాజు నప్పలరాజును జెప్పి "తదనుసంభవుండ"నని వ్రాసికొని యున్నవాఁడు. (చూ. సాం. పు. 7.) మఱియు నేకారణముననో- తనతండ్రియగు పినకొండ్రాజు సంతానమును వర్ణించుచు—

క. కోనేటి తిమ్మరాజును, శ్రీనిధి చినతిమ్మరాజుసింహాంబును ల
క్ష్మీనిత్యుఁ డప్పలేంద్రుఁడు, దీనావనకల్పతరులు ధృతి మని రవనిన్.

అని తన యన్నలను మువ్వురను మాత్రమే చెప్పి తనపేరు విడిచియున్నాఁడు. దానంజేసియే కవులచరిత్రము భ్రమనొంద నవసరము కలిగినది. అయినను 1 ఆ. 46 పద్యమున "తదనుసంభవుండ" నని ప్రతిపదోక్తముగా వ్రాసికొనుటచే నీతఁడు కోనేటి తిమ్మరాజున కనుజుఁ డనియే నిశ్చయింపవలెను. తెనాలి అన్నయ్య సుదక్షిణాపరిణయమున నీతఁడు పినకొండ్రాజున కాత్మజుఁ డనియే వర్ణింపఁబడినది:—

చ. "కులనిధి యానృపాలకుఁడు కోనమదేవి వరించి కాంచెఁ జే
కొలఁది నరాతులం దునుము కోనెటి తిమ్మనరేంద్రు, భూమిభృ
త్తిలకము చిన్నతిమ్మ వసుధీరసుధానిధి నప్పరాజు ని
ర్దళితవిరోధిభూవరకురంగుని రంగనృపావతంసమున్."

ఈ గ్రంథము రంగప్పరాజు పెద్దయన్న యగు కోనెటి తిమ్మరాజు కొడుకు రామరాజునకు మంత్రి యగు పులిజాల సోమామాత్యున కంకితము గావింపఁబడినది. కావున నీతఁడు కోనేటి తిమ్మరాజునకుఁ దమ్ముఁడే కాని యాశ్రితుఁడు కాఁడని యెఱుఁగునది. ఇంతియకాక, కవి, తన సాంబోపాఖ్యానమునఁ దనతండ్రిని వర్ణించుసందర్భమున "ఇట్లాత్రేయ గోత్ర పవిత్రుండు నాపస్తంబసూత్రుండు నై రాజిల్లు రాజాధిరాజ రాజపరమేశ్వరాష్టదిగ్గ్రాజమనోభయంకర సమరాంగణ సాహిత్యసార్వభౌమ బిరుద నరస నరసవిభు కృష్ణరాయ రాజ్యలక్ష్మీనిరీక్షణ పక్ష్మంబగు కొండవీ డక్షిణకాక్షేయా......యగుపినకొండ్రాజును" అని వర్ణించియున్నాఁడు. ఈవచనమున గ్రంథపాతము విశేషముగఁ గలదు. దానిచే నన్వయము కుదుర లేదు. అయినను నీ పినకొండ్రాజు శ్రీకృష్ణదేవరాయల రాజ్యకాలమున నాతనికి సహాయుఁడై కొండవీటికిఁ బాలకుఁడుగా నుండి యాతనికి సామంతరాజుగా నుండె నని యూహించుట సమంజస మని తోఁచుచున్నది. మఱియుఁ దిరుమలదేవరాయలు గుత్తిఅతిమ్మరా జని వర్ణింపఁబడుటఁ జూడఁ దిరుమలదేవరాయలు కూడ శ్రీకృష్ణదేవరాయలకాలమునను నాతని యనంతర మళియరామరాజు కాలమునను గూడ గుత్తికిఁ బాలకుఁడుగా నుండిన సామంతరాజుగా నుండెనని నమ్మవచ్చును. ఈకవికాలమునాఁటికి, లేదా, యీకృతిరచనాకాలమునాఁటికి, నళియరామరాజు మృతినొందలే దనియు విజయనగర రాజ్యలక్ష్మి తురుష్కులకు వశపడలేదనియుఁ దలంపవచ్చును. తాళికోట యుద్ధానంతరము రాజ్యము తురుష్కులవశము కాఁగాఁ దిరుమలదేవరాయలు తురుష్కుల జయించి జీర్ణకర్ణాటకరాజ్యోద్ధారకుఁ డని ప్రఖ్యాతినందె ననుట చరిత్రప్రసిద్ధ విషయము గదా ! ఈ గ్రంథమందు, "కర్ణాటకైశ్వర్య నిర్వహణావార్య భుజధ్వజాయుధ పరీవారుండు రామప్పకున్" అని, యళియరామరాజే కర్ణాట రాజ్యమును నిర్వహించుచున్నట్లు వర్ణింపఁబడినది. కావున నీకవి శ్రీకృష్ణదేవరాయల కాలమునఁ జిన్నవాఁడుగా నుండినవాఁ డనియుఁ దరువాత నించుమించుగ నెనుబదిసంవత్సరములు జీవించి యున్నవాఁ డనియు నూహించుట కవకాశము కలదు. ఈకవికి మంత్రోపదేష్ట యగు శ్రీతిరుమల శ్రీని

వాసాచార్యులే కళాపూర్ణోదయ కృతిపతి యగు నంద్యాల కృష్ణరాజునకు గురువై యుండె నని కళాపూర్ణోదయమందలి—

క. విశ్రుత తిరుమల తాతా,ర్యశ్రేష్ఠాన్వయసుదర్శనాచార్యతనూ
జ శ్రీనివాసగురుచర, ణాశ్రయణఘమార్జితాఖిలాభ్యుదయునకుఁ.

అను పద్యమువలనఁ దేలుచున్నది. ఈకవికిని నంద్యాల కృష్ణరాజునకును మూలపురుషుఁ డగు నార్వీటి బుక్కరాజునుండి లెక్కింప నీకవి బుక్కరాజునకు నాలవతరమువాఁ డనియుఁ గళాపూర్ణోదయభర్త యైదవ తరమువాఁ డనియుఁ దేలుచున్నది.




పై వంశవృక్షమువలన నీరంగప్పరాజు కళాపూర్ణోదయకృతిపతికంటె నించుక పెద్దవయసువాఁ డనియు నీతఁడు శ్రీకృష్ణదేవరాయల కాలమునకుఁ జిన్నవయసున నున్నవాఁ డనియు నూహింపవచ్చును. కాఁబట్టి యీరాజకవి క్రీ. శ. 16 వ శతాబ్ద ప్రథమభాగమున జనియించి యించుమించుగ 80 సంవత్సరములు జీవించినవాఁ డని నమ్మవచ్చును.

—: కృతిరచనాకాలము :—

ఇఁక నీసాంబోపాఖ్యాన మేకాలమున రచియింపఁబడినదో విచారించి చూతము. ఈగ్రంథమందు, అళియరామరాజు "కర్ణాటకైశ్వర్యనిర్వహణావార్యభుజుం"డని వర్ణింపఁబడియెను. అతనితమ్ముఁ డగు నెఱతిరుమలయ్య గుత్తికిఁ బాలకుఁడుగా నున్నట్లు "గుత్తెఱ తిమ్మరా" అను పద్యమునఁ జేర్కొనఁబడియెను. తాళికోటయుద్ధమున రామరాజు మృతి నొందిన పిదప నెఱతిమ్మరాజు

తురుష్కహస్తంగతమగు జీర్ణకర్ణాటకరాజ్యలక్ష్మి నుద్ధరించి తిరుమలదేవరాయ లను పేర రాజ్యమును బాలించెను. మఱియుఁ దాళికోట యుద్ధానంతరము రాజధానిని బెనుగొండకు మార్చెను. పిదపఁ బెనుగొండలో నున్నప్పుడు సైతము మహమ్మదీయులతో యుద్ధము గావించి రాజధానిని జంద్రగిరికి మార్చెను. తాళికోటయుద్ధము క్రీ. శ. 1565 సంవత్సరమునను, బెనుగొండయుద్ధము క్రీ. శ. 1577 సంవత్సరమునను జరిగెను. ఈరెండుయుద్ధములఁ గూడ నీగ్రంథమునఁ బేర్కొనఁబడకుండుటచే నీయుద్ధములకు ముందే యీకృతి రచియింపఁబడియుండు నను నూహ జనియించుచున్నది. రామరాజభూషణుఁడు రచించిన కావ్యాలంకారసంగ్రహమునఁ గూడ నిట్లే తిరుమలదేవరాయలు, "ఎఱతిమ్మధరాజాని"యని సామాన్యుఁడుగానే వర్ణింపఁబడియెను. వసుచరిత్ర రచనా కాలమునకు నళియరామరాజు మృతి నొందుట యుఁ దిరుమలదేవరాయలు కర్ణాటకరాజ్యమును దురుష్కులనుండి స్వాధీనము గావించుకొని తాను సింహాసన మెక్కి రాజధానిని బెనుగొండకు మార్చుటయుఁ బెనుగొండయుద్ధానంతరమునఁ జంద్రగిరికి మార్చుటయు జరిగియుండుటచే వసుచరిత్రమున నావిషయము లెల్ల వర్ణింపఁబడియున్నవి. మఱియుఁ గావ్యాలంకారసంగ్రహమున నెఱతిమ్మధరాజాని యని పేర్కొనఁబడినయాతఁడు వసుచరిత్రమున రాజ్యాధిపత్యద్యోతక మగు దేవరాయపదముతో వర్ణింపఁబడినవాఁడు, కావుననే, అళియరామరాజు జీవించియుండఁగనే తళ్ళికోటయుద్ధమునకు ముందుగనే కావ్యాలంకారచూడామణి రచింపఁబడిన దనియుఁ దళ్ళికోట పెనుగొండయుద్ధములకుఁ బిదప వసుచరిత్రము రచింపఁబడిన దనియు సుప్రసిద్ధవిమర్శకు లంగీకరించియున్నారు. ఈసాంబోపాఖ్యానముగూడ ననేకకారణములచే నళియరామరాజు జీవించియుండఁగనే రచింపఁబడిన దని మనము నమ్మవచ్చును.

ఈగ్రంథకర్తకూడ రాజవంశమువాఁ డగుటచేఁ దనజ్ఞాతులను విశేషించి వర్ణించుటకుఁ గాని తమకు నపజయాపాదకము లైన తళ్ళికోటపెనుగొండ యుద్ధములను దెలుపుటకుఁ గాని యిష్టపడ లేదేమో యని యొకసంశయము దయింపవచ్చును. కాని పైయూహ సరికానేరదు. వసుచరిత్రమునందు, తళ్ళికోట పెనుగొండయుద్ధములు సూచింపఁబడినవి. విజయనగరరాజ్యపతనము సంభవించినను గవి యాయపజయముల వర్ణింపక కృతిపతి కుత్కర్షమునే వర్ణించి యున్నాఁడు. ఈకవికూడ నట్లే కావించి యుండును. అళియరామరాజును- "కర్ణాటకైశ్వర్యనిర్వహణావార్యభుజద్వజాయుధపరీవారుండు" అని

వర్ణించినయతఁడు జీర్ణకర్ణాటకరాజ్యస్థాపనాచార్యుఁ డని మహాప్రఖ్యాతిగాంచిన తిరుమలదేవరాయని పరాక్రమాదిక మించుకయు వర్ణింపక సామాన్యునిగా "ఎఱతిమ్మరా" జని వర్ణించియుండునా ? ఇంతియకాక తన కీతిరుమలరాయనితో నెంతచుట్టఱికము కలదో యంతచుట్టఱికమే కల నలతిమ్మరాజు బాలభాగవతచంపువును దోనురి కోనేటికవీంద్రునివలనఁ గృతినొందె నని గొప్పగా వర్ణించినకవి బాలభాగవతముకంటె నత్యధికరసవంతమును నుత్తమము నగు వసుచరిత్రమును రామరాజభూషణునివలన నెఱతిమ్మరాజు కృతి నొందె నని వర్ణింప మానుటకుఁ గారణ మేమియు నగపడదు. మఱియు సాంబోపాఖ్యాన రచనాకాలమునఁ దిరుమలదేవరాయలు విజయనగరరాజులకు సామంతుఁడుగా, గుత్తికి పాలకుఁడుగా నుండెనని "గుత్తెఱతిమ్మరాజు" అను పద్యమువలనఁ గంఠోక్తిగాఁ జెప్పియే యున్నాఁడు. పైవిషయము లన్నియుఁ బర్యాలోచింపఁగా సాంబోపాఖ్యానము కృష్ణరాయల మరణానంతరము, అళియరామరాజు రాజై యున్నకాలముననే రచింపఁబడిన దనియు వసుచరిత్రరచనముకంటెఁ బూర్వమే రచింపఁబడిన దనియు నిస్సంశయముగా నమ్మవచ్చును. వసుచరిత్రము, కళాపూర్ణోదయప్రభావతీప్రద్యుమ్నములు, చంద్రభానుచరిత్రము మొదలగు ప్రబంధములెల్ల దీనికిఁ దరువాత రచింపఁ బడినవే యని తెలియనగును.

## —॥ కథాసంవిధానము ॥—

సామాన్యముగాఁ బ్రబంధము లన్నిటియందును గథ యొక్కముఖ్యపాత్రమునకు సంబంధించియే యుండుట సంప్రదాయము. శృంగారప్రబంధము లగునెడ నాయికానాయకులయొక్కయు వీరరసప్రధానప్రబంధము లగుచో నాయకప్రతినాయకులయొక్కయుఁ జరిత్రములను బ్రధానముగాఁ గైకొని నడుమనడుమ నంగిరసపోషణమునకై యితరంబు లగురసంబులఁ బోషించుచుఁ గథాంశముల నారంభోపసంహారంబులం దేకపాత్రానులబ్ధములుగా వర్ణించుట యాలంకారికసమయము. ఈసమయము నుల్లంఘించి రచియింపఁబడిన ప్రబంధము లనేకములు గలవు. కాళిదాసుని రఘువంశము దిలీపునితో నారంభింపఁబడి యగ్నివర్ణునితో నుపసంహరింపఁబడినది. నడుమ నెన్నికథలో వర్ణింపఁబడినవి. అయినను నాకావ్యము రఘువంశజాతు లగురాజుల చరిత్రములను దెలుపుటయే పరమప్రయోజనముగాఁ గలది యగుట దాని కంతదోషము లేదు. కాని మనుచరిత్రమును దిలకింపుఁడు. ఆరంభము బ్రాహ్మణప్రవరుఁడు

వరూథినిని దిరస్కరించుటతో రెండాశ్వాసములు పూర్తియైనవి. తరువాత మాయాప్రవరునితో నొకయాశ్వాసము. తరువాత స్వరోచితో 4-5 ఆశ్వాసములు. పిదప నాఱవయాశ్వాసము మాత్రము స్వారోచిష మనువునకుఁ బంచఁబడెను. జరిగినకథ జరిగినదే కాని దాని కుత్తరకథతో సంబంధము లేనే లేదు. అట్లు కథైక్యము లేకుండుట ప్రబంధములకు దోషమే యనకతీఱదు. పురాణములం దున్న కథను మాతృకగాఁ గొని రచించిన ప్రబంధములం దీదోషము విశేషముగా సంభవించుచుండును. వసుచరిత్రాదికల్పిత ప్రబంధములం దుమాత్ర మీదోషమునకుఁ దావుండదు. ఈ సాంబోపాఖ్యానమునందుఁగూడ నీదోష మత్యధికముగాఁ గనఁబడుచున్నది.

ఇందలికథ మొదటి యాశ్వాసము 59 వ పద్యము మొదలు 132 వ పద్యమువఱకును శ్రీకృష్ణుని బాల్యక్రీడలును బరాక్రమమును వర్ణింపఁబడినవి. తరువాత ద్వారకాపురవర్ణనము, రుక్మిణీకృష్ణులశృంగారక్రీడలుఁ, బ్రద్యుమ్న జననమును 210 వ పద్యమువఱకు (ఆశ్వాసాంతము) ను వర్ణింపఁ బడినవి. పిదప సత్రాజిత్తు సూర్యునిగూర్చి తపం బొనరించుటయు నాతనికి సూర్యుఁడు స్యమంతకరత్న మిచ్చుటయు నారత్నప్రభావంబున నాతని కాతపోవనంబునం దె యతిలోకభోగంబులు సంభవించుటయు ననంతర మారాజు గంధకరి నెక్కి ద్వారకానగరంబున కరుగుదెంచి యారత్నమును బ్రసేనకుమారున కిచ్చుటయును నారతనంబుప్రభావం బెఱింగిన శ్రీకృష్ణుఁడు తనకు దాని నిమ్మని యుద్ధవునిచే నడిగించుటయు దానికి సత్రాజిత్తుం డంగీకరింపకుండుటయును, 92 పద్యములతో వర్ణింపఁబడినది. అనంతరము గ్రీష్మర్తువర్ణనము, ప్రసేనుఁడు రైవతకాద్రికి విహారార్థ మరుగుట, రైవతకవర్ణనము, ప్రసేనుఁడు స్త్రీలతో విహరించుట, ప్రసేనునికడకుఁ జెంచులు వచ్చుట, మృగయాప్రోత్సాహము నాశ్వాసాంతమువఱకు 120 పద్యములతో వర్ణింపఁబడినది. మూఁడవయాశ్వాసమున 204 పద్యములతోఁ బ్రసేనుని మృగయావిహారము నాతని సింహము వధించి మణిం గొనిపోవుట, యాసింహమును జాంబవంతుఁడు వధించుట, సత్రాజిత్తు కృష్ణుఁడే మాయచే నతనితమ్ముని వధించి మణి నపహరించె నని నిందించుట, యపవాదనిరాసబద్ధదీక్షుం డగు నరవిందాక్షుండు మణిప్రత్యానయనమునకై పాతాళంబున కరిగి జాంబవంతునితోఁ బోరుట, జాంబవంతుఁడు జాంబవతిని గృష్ణున కొసంగి వివాహము గావించుట, జాంబవతి తనయుని వాంఛించుట,

సుతోత్పత్తికై కృష్ణుఁడు కైలాసమున కేగి శివునిగూర్చి తపంబు గావించుట యు వర్ణింపఁబడినది. నాలవయాశ్వాసమునఁ గృష్ణుని తపశ్చర్యయు శివుఁడు ప్రత్యక్ష మగుటయు వరంబొసంగుటయుఁ గృష్ణుఁడు ద్వారకకు మరలివచ్చి సాల్వుని జయించుటయు, 68 పద్యములందు వర్ణింపఁబడినది పిమ్మట జాంబవ తికి సాంబుఁ డుదయించి ప్రరూఢ యౌవనుండై దుర్యోధనునికూఁతురు లక్షణ యం దనురక్తుఁడై యేరికిం దెలుపకుండ నేకాకియై హస్తిపురమున కరిగి లక్ష ణను రథారూఢం గావించుకొని వచ్చు నెడఁ గౌరవులతోడి యుద్ధమును బల రాముఁడు కరిపురమును గంగలోఁ ద్రోయనుంకించుటయు నాతనికిఁ గౌరవులు ప్రణతులై యనునయించి సాంబునకు లక్షణ నిచ్చి పరిణయము గావించుట, లక్షణాసాంబుల గృహప్రవేశము మొదలగు నంశములు నాలవయాశ్వాసమం దలి 162 పద్యములందును బంచమాశ్వాసము 366 పద్యములందును వర్ణిం పఁబడినది.

ఇందలికథ శ్రీకృష్ణునకుఁ బ్రద్యుమ్నుఁడు జనించువఱకు నొకభాగము గాను, బిదప సత్రాజిత్తు తపము నొనరించినది మొదలు ప్రసేనుని మరణము వఱకు రెండవభాగముగను, జాంబవతీకల్యాణ మాదిగ సాంబజననమువఱకు నొకభాగముగాను, మిగిలినకథ నొకభాగముగాను, నాలుగుభాగములుగా విభజింపవచ్చును. ఇందలి నాల్గవకథాభాగమువలననే యీప్రబంధమునకు సాంబోపాఖ్యాన మనుపేరు కవిచేఁ గల్పింపఁబడినది. సాంబుఁడు ప్రధాననా యకుఁడుగా నిర్దేశింపఁబడిన యీప్రబంధమున జాంబవతీకల్యాణము గాని సత్రాజిత్తు తపశ్చర్య గాని ప్రద్యుమ్నజననము గాని శ్రీకృష్ణరుక్మిణీవిహారములు గాని కథాప్రసారమున కుపకారకములుగావు. ఆయాభాగములు గొన్నికొన్ని పద్యములలో లఘువుగా వర్ణించి యుండిన నెంతమనోహరముగానో కథ నిర్వ హింపఁబడి యుండెడిది. అట్టితఱిఁ గవి యీకథల నెందుల కింత దీర్ఘముగా సంధానించెనో విచారింపవలసి యున్నది.

## —। కథామూలము ।—

కవి యీప్రబంధకథను స్వకపోలసాధితముగా సంధానింపలేదు. ఏదో యొక్కపురాణమునందలి కథను మూలముగాఁ గైకొనినదియైన నుండలేదు. భిన్న భిన్న గ్రంథములు రెంటిమూఁటినుండి కథలను గ్రహించి యన్నిటిని గూర్చి యొక్క ప్రబంధముగా రచించియున్నవాఁడు. ఈ ప్రబంధరచనమునందుఁ గవికి

ముఖ్యోద్దేశము రసప్రకటనమే గాని కథాసంవిధానము గాదు. అందును శృం గారరసమును యావచ్ఛక్తిని వర్ణించుట కవి కభిమత మై యుండెను. దానం జేసియే కథాసంవిధాన మంతగాఁ బాటింపఁ డయ్యెను. మొదటిభాగ మగు రుక్మిణీశ్రీకృష్ణవిహారములును శ్రీకృష్ణబాల్యచరితములును భాగవతాదిపురాణ ప్రసిద్ధములు. తరువాత సత్రాజిత్తుపశ్చర్యాదిగ జాంబవతీకళ్యాణాంతము గల గాథ భాగవతమున దిఙ్మాత్రముగ నున్నది. అది యిం దధికముగాఁ బెంచి శృంగార వీరభూయిష్ఠముగా వర్ణింపఁబడినది. జాంబవతీసుత ప్రార్థనమాదిగ సాల్వవరాజ యమువఱకుఁ గల కథ నాచనసోముని ఉత్తరహరివంశకథ నాదర్శముగాఁ గొని పెంచి వ్రాయఁబడినది. చివరి లక్షణాసాంబుల పరిణయము మొదలగు వంశములు గలకథ భాగవతము నాలంబముగాఁ గొని విస్తరించి రచింపఁబడి నది. ఇట్లు పెంచి వ్రాయుటకును భిన్నభిన్నకథల నేకత్ర సంధానించుటకును గవికిఁ గలతాత్పర్య మేమో యని విచారింప మహాకావ్యలక్షణములగు నష్టా దశవర్ణనములును సకలరసములు నయ్యెతావులఁ బ్రకటించుట యని తోఁచు చున్నది.

—। అష్టాదశవర్ణనములు ।—

పురవర్ణనము—ద్వారకాపురవర్ణనము ౧ వ ఆశ్వాసము. ప. ౧౩౩ మొ దలు ౧౭౫ వఱకు.

సింధువర్ణనము—౧ ఆ. ప. ౧౯౨ మొదలు ౨౦౧ వఱకు.

నగవర్ణనము—రైవతకము. ఆ. ౨ ప. ౧౧౫ మొ. ౧౩౪ వఱకు.

ఋతువర్ణనము—గ్రీష్మర్తువు. ఆ. ౨ ప. ౭౨ మొ. ౧౦౮ వఱకు.

సూర్యోదయవర్ణనము—ఆ. ౫ ప. ౩౪౩ మొదలు ౩౫౧ వఱకు.

చంద్రవర్ణనము—ఆ. ౫ ప. ౪౫—౪౮ వఱకు.

సరోవర్ణనము—ఆ. ౫ ప. ౫—౧౫ వఱకు.

వనవిహారము—ఆ. ౪ ప. ౨౧౦—౨౨౭ వఱకు.

మధుపానము—ఆ. ౨ ప. ౧౪౭—౧౬౧ వఱకు.

రతివర్ణనము—పెక్కుతావుల.

పరిణయము—జాంబవతీకృష్ణులకళ్యాణము. ఆ. ౩ ప. ౧౧౩ మొదలు ౧౪౫ వఱకు.

తనయోదయము—ప్రద్యుమ్నజననము. ఆ. ౧. ప. ౨౦౨.

సాంబజననము. ఆ. ౪ ప. ౯౧—౯౫.

నీతి—ఆ. ౧ ప. ౧౧—౭౮ వఱకు.

యాత్ర—ప్రసేనుని రైవతకయాత్ర. శ్రీకృష్ణుని పాతాళ కైలాసయాత్రలు. సిద్ధాంతదర్పణుని హస్తినాపురయాత్ర. కౌరవులు సాంబుని పైకెత్తివచ్చుట మున్నగునవి.

యుద్ధము—ప్రసేనునకు సింహమునకును--కృష్ణునకు జాంబవంతునికి--సాల్వునకు యాదవులకు- సాంబునకుఁ గౌరవులకు జరగినది.

దౌత్యము—సత్రాజిత్తుకడ కుద్ధవుఁడు స్యమంతక మణుగఁ జనుట.

నాయకవర్ణనము—సాంబవర్ణనము, శ్రీకృష్ణవర్ణనము, సత్రాజిద్వర్ణనము, ప్రసేనవర్ణనము, మొదలగునవి సాంగోపాంగముగ-సమగ్రముగ-వర్ణింపబడినవి.

ఇందు రసము లన్నియు నాయాయవసరముల ననుసరించి చక్కఁగఁ బరిపోషింపఁబడినవి. వీరభయానకాద్భుతాదిరసము లంగములుగను శృంగారమంగిగను వర్ణింపఁబడినది. అందును శృంగారము పరాకాష్ఠ నొందింపఁబడినది-శ్రీకృష్ణరుక్మిణీవిహారంబునను, జాంబవతీకళ్యాణావసరంబునను, శ్రీకృష్ణునకుఁ గైలాసంబున రుద్రకన్యలు పరిచర్య చేయుపట్టునను, లక్షణాసాంబుల పరిణయాదులయందును, ప్రసేనునిరైవతక విహారమునందును శృంగారమువిశేషించి కలదు. వీరము, ప్రసేనునకు సింహమునకు, జాంబవంతునకుఁ గృష్ణునకును, సాల్వునకు యాదవులకును, సాంబునకుఁ గౌరవులకును బ్రవర్తించిన యుద్ధాదులఁ బ్రకటింపఁబడినది. భక్తి తత్త్వవిచారము మొదలగునవి కూడ నాయాసందర్భములందుఁ జక్కగ వర్ణింపఁబడినవి. పైని బేర్కొనఁబడిన యీవిషయముల నెల్ల సమగ్రముగ వర్ణింపఁ దలఁచియే కవి గ్రంథమునఁ గథాపార్థక్యముం జొప్పించెను.

—॥ అనుకరణములు ॥—

ఇంక నేకథ నెంతవఱ కే గ్రంథమునుండి సంగ్రహించెనో మూలమునకును దీనికిని భేద మేమి కలదో విమర్శింతము. భాగవతాదిగ్రంథములనుండి కొన్నిభాగములును, నుత్తరహరివంశమునుండి కొంతభాగమును గ్రహించెనని యిదివఱకుఁ దెలిపి యుంటిని. అందు గ్రంథవిస్తర భీతిచే నోక్త యుత్తరహరివంశకథకును దీనికిని గలసంబంధమును మాత్ర మిట వివరింతును. ఉత్తరహరివంశకథ ననుసరించి శ్రీకృష్ణునకుఁ, బ్రద్యుమ్నునకుఁబూర్వము సంతానము లే కుండెను. ఒకనాఁడు కృష్ణుని రుక్మిణి తన కోర్క తనయుని దయచేయుమని ప్రార్థించెను. కృష్ణుఁడు వల్లెయని తపంబునఁగాని తనయుం డుద్భవింపఁడని

నిశ్చయించి కైలాసంబున కేగి శివు నుద్దేశించి పండ్రెండేఁడులు ఘోరతపంబు గావించెను. పరమేశ్వరుఁడు ప్రీతుండై తొల్లి తనకంటి మంటచే భస్మీభూతుండైన మన్మథుని ప్రద్యుమ్ననామంబున జనియింప వరం బొసంగెను. ఈ గ్రంథము ననుసరించి కృష్ణున కదివఱకే ప్రద్యుమ్నుఁడు జనియించియుండఁగా జాంబవతి తనకు సంతానము లే దనుకారణమున విచారించి కృష్ణుని దనయునిం బ్రసాదింపు మని కోరెను. కృష్ణుఁడు తపంబువలనఁ గాని సంతానము దుర్లభ మని యెంచి కైలాసమున కేగి తపం బొనరింప శివుండు ప్రీతుండై తనపేర సాంబుఁ డను తనయుఁ డుదయించు నని వర మొసఁగెను. చంద్రభానుచరిత్రమునఁ గూడ, తరిగొప్పుల మల్లన యీ ప్రబంధము నించుక యనుసరించెను, గాని, యాఁ దాతఁడు సందర్భము పూర్తిగా మార్చివేసినాఁడు. రుక్మిణి కొడుకును గన్న దన్నయాసున సత్యభామ కృష్ణుని దనయప్రాప్తి కై ప్రార్థించుటయుఁ గృష్ణుం డాయమకుఁ గుమారు ననుగ్రహించుటయుఁ జంద్రావదాతశరీరుఁ డగు నాకుమారునకుఁ జంద్రభానుం డనునామము గావించుటయు, నందుఁ గలవు. ఆపట్టున సాంబోపాఖ్యానమును మల్లన యనుకరించెనని తెలుపుటకుఁ జాలినన్ని యుదాహరణములు గలవు. గ్రంథవిస్తరభీతిచే విరమించితిని- ఉత్తరహరివంశమున :—

గీ. అఖిలలోకైకనాథ నీయట్టిరూప, విక్రమౌదార్యశౌర్యవివేకనిలయు
నొకకుమారుని దయచేసి యుర్విలోనఁ, గడుపుచల్లనికాంతలఁ గలుపునన్ను.

క. మును రుక్మిణి తన్నడిగిన, దనుజాంతకుఁ డేవరంబుఁ దప్పక యిచ్చెం
దనయుని నడిగిన నీఁడని, జనులాడఁగఁ జెవులు నేఁడు సంకటపడవే.

క. కాచికొని కొడుకు నడిగెన, టే చనవున నాలు మగఁడ టే వర మిచ్చెం
జూచెద మనుసవతులచే, నీచులుకఁదనంబు చేరనీకుము కృష్ణా!

అని రుక్మిణి ప్రార్థింపఁ గృష్ణుఁడు.—

క. తనవలచుకాంత యేపని, మనమునఁ దలఁచినను జేయుమగవానికి న
వ్వనిత బిగియారుకౌఁగిలి, దినదినమును మదనకామధేనువుగాదే.

క. పుత్త్రులకలిమియె శుద్ధక, ళత్త్రమునకు లక్షణంబు లక్షణవతులై
పుత్త్రవిహీనతఁ బొరసినఁ, బాత్త్రము లే సతులు పతులు పాటించుటకున్

క. మానిని వినవే "పున్నా,మ్నో నరకా త్త్రాయతే" యనుట పుత్త్రార్థం
బైనది నీకోరిక నా, మానస మలరించె వేదమార్గోచితమై.

అని ప్రత్యుత్తర మిచ్చి మఱునాఁడు కొలువున మంత్రిసామంతాదులతో నెల్ల పురరక్షణమునకు వలయు నుపాయములు తెల్పి తాను కైలాసమునకుఁ దప శ్చర్య కేగినట్లున్నది.

ఈగ్రంథమందు జాంబవతి తన యాభిజాత్యము నెల్ల నుగ్గడించి తన యలోప మింతిం తన రాని దనియుఁ గావున సంతానము ప్రసాదింపు మనియుఁ బ్రార్థించినది. జాంబవతీప్రార్థనమున నామెకు సంతానము సమకూర్పఁ దపం బున కరిగె ననియున్నది. పుత్రజననవిశేషమును శ్రీకృష్ణుఁడు వర్ణించిన ట్లుత్త రహరివంశమున నుండ దీనియందు జాంబవతియే వర్ణించినట్లున్నది. అయినను జాంబవతి వర్ణించిన పుత్రవర్ణనము పరమస్వాభావికమై యుత్తరహరివంశము కంటె నత్యధిక రమణీయత నొందినది. చూ. సాం. ఆ. 3. ప ౧౭౭-౧౮3. ఉత్తరహరివంశమునఁ గృష్ణుఁడు కైలాసమున కేగుచు ముందుగా, బదరికా వనమున కేగి యందలి మునులను సంభావించినట్లును ఘంటాకర్ణుఁ డనుపిశా చమునకు నాతనియనుజునకు వరము లొసఁగినట్లును వర్ణింపఁబడినది. సాంబో పాఖ్యానమున నీకథ విడువంబడినది, గాని, కైలాసమునందే ఋషులు ముందు గా శ్రీకృష్ణుని దర్శించినట్లు వర్ణింపఁబడి యం దుత్తరహరివంశమునందలి పద్య ము లనుకరింపఁబడినవి.

సీ. ఆకాశగంగ నీయడుగునఁ బొడమె నీకిట్లర్ఘ్యపాద్యంబు లిచ్చు టెంత
నిఖిలంబు రక్షింప నీరజోగుణమూర్తి వని నీకుఁ గుశలసంప్రశ్న మెంత
కమలంబు నీనాభిగన్నది నీకిట్లు పుష్పాంతరంబులపూజ యెంత
అమృతంబు నీచేత నమరులు గుడిచిరి నీకువన్యాహారనియతి యెంత
యెంచ మాభక్తి యెంత మా యెఱుక యెంత, మాతపోబల మెంత మా మనికి యెంత
యింతసంతోష మెసఁగ నీవిచట నునికి, కంటిమి దిమాకు భాగ్యంబు కలిమిగాదె.

ఉత్తరహరి-ఆ. ౨. ప. ౧౧౫.

సీ. కలశాంబునిధిలోలవలమానకల్లోలయుతకేలి కేసిటియర్ఘ్యమిాగి
సనకాదికస్వాంతజలజమధ్యనిశాంతవిహరణకృతికి నేవిరులపూజ
యఖిలవేదవిదీశయజ్ఞపురోడాశహారికి నేఫలాహారరచన
పద్మసంభవముఖ్యభజనలీలాసౌఖ్యశాలికి నేయుపచారక్లృప్తి
సంతతోల్లాసి నిగమనిశ్వాసభాసి, నెట్టిసూక్తులచే నుతియించువార
మాదిమధ్యాంతరహిత మాకతిథివైతి, వనుచుఁ బూజించి రచ్యుతు నాదిమునులు.

సాంబోపాఖ్యానము ఆ. 3. ప. ౧౯౯

క. నీవారము నీవిచ్చితి, నీవారము మాకు భోగనియతసుఖంబుల్
గావింపుము మా ప్రియములు, గావింపుము నీవు భక్తగమ్య మురారీ.
ఉత్తరహరి-ఆ. ౧. ప. ౧౧౬.

ఉత్తరహరివంశమున గల యీపద్యము మునులచేఁ గృష్ణునుద్దేశించి పలుకఁబడిన యుపచారవాక్యముగా నుండ సాంబోపాఖ్యానమునఁ గృష్ణుడు మునులసంభావించునవసరమున ననుకరింపఁబడినది.

శా. నీవారం బని యాదితత్త్వము మది న్నిత్యంబు భావించుచు
న్నీవారంబులు నీరము ల్ఫలదళానీకంబు లీకంబులన్
దైవాఱం గొని మీరు సేయు తపము ల్తత్ఫలప్రాపులుం
గైవారంబులు సేయఁగాఁ దగునె యీకైలాసవాసంబునన్.
సాంబోపా. ఆ. 3. ప. ౨౦౧.

ఉత్తరహరివంశమునఁ గృష్ణుండు తపం బాచరించుపట్టున —

గీ. పువ్వులు గోయుఁ జక్రంబు భుజగవైరి
నఱకు సిద్ధము ల్గుశములు నందకంబు
తెచ్చుఁ బాంచజన్యము గాచు దెసలు శార్ఙ్గి
యెదుర నిలుచుండ గదసేయు నెల్లపనులు.
ఉత్తరహరి. ఆ. ౨. ప. ౧౬౫.

అని కృష్ణుని వాహనంబు లాయుధంబులే యాతనికి వలయు నుపచారములు చేయుచున్నట్లు వర్ణింపఁబడిన యీపద్యము ననుకరించి మనోహరముగా నచ్చటి తరులతాదులు కృష్ణునకు సేవలుగావించినట్లు మార్చ్వగావించినాఁడు.

సీ. అభిషేకసమయమౌటరసి తీవలనుండి జోరునఁ బూఁదేనెసోనగురిసెఁ
గాషాయములు గట్టుకందువ పరికించి ప్రాఁకె సానుస్థలి రత్నరుచులు
భూతిఁ బూయఁగఁ బూనుపూనిక యారసి యలమె నేడాకుపొన్నలరజంబు
మానసబంధఁబు మదిలోపల నెఱింగి సారంగచర్మమై జలదమమరె
సకలలోకేశునకు గిరిస్థావరములు, జంగమంబులుఁదగుసేవనలుపఁడౌడఁగె
హరుఁగృతార్థుని జేయఁబుత్రాభిలాష, దంభమున శార్ఙ్గి మునివృత్తిఁదాల్చునపుడు.
సాంబోపా. ఆ. ౪. ప. 3.

ఉత్తరహరివంశమునఁ గృష్ణుఁడు పంద్రెండేం డ్లుగ్రతపం బొనరింప నింద్రాదిసురలు జాలియు భయము నొంది "అయ్యయో! కైలాసవాసు లగు

మునులు తపస్సైక్ష్ణ్యము చూచుచున్నారా లేదా! వారు శివున కీసంగతి యేల తెలుపరైరి, మనము చెప్పుదము రండు" అని కూడఁబలుకుకొని విమానారూఢులై కృష్ణుఁడు తపంబుసేయుకడకు వచ్చినట్లు వర్ణింపఁబడినది. శివునకుఁ గృష్ణతపశ్చరణ మెఱింగింపఁ దలఁచినవారు శివుని కడ కరుగక కృష్ణుని కడకు వచ్చుట యేపనికో! సాంబోపాఖ్యానమున నీయసందర్భము చక్కగాఁ బరిహరింపఁ బడినది. కృష్ణుని నియమోగ్రతకు భూతంబుల గతులు తప్పినవి. అంత నాతనితపంబు నివారింపఁ బ్రసన్నుండై శివుఁడు సన్నిధి యయ్యెను. శివునితోఁ గూడ నఖిల దేవతలు, మునులు, గృష్ణునికి సాక్షాత్కారము గావించిరి. అని సాంబోపాఖ్యానమునఁ గూర్పఁబడినది. ఉత్తరహరివంశమున హరిహరు లేకత్ర సమావిష్టులై యున్నతఱి వారిరువురను మునులు నుతించుసందర్భముననున్న—

సీ. "అభ్రంకషం బైన యాలపోతు నితండు త్రుంచినాఁ డీతండు పెంచినాఁడు
సాధుసమ్మతముగా సామజంబు నితండు గాచినాఁ డీతండు ద్రోచినాఁడు
బర్హిముఖార్థమై పర్వతేశు నితండు తాల్చినాఁ డీతండు వ్రాల్చినాఁడు
ఫణిపరంపరతోడి పన్నగేంద్రు నితండు మెట్టినాఁ డీతండు చుట్టినాఁడు"—

అను పద్య మిందుఁ జమత్కారముగా సంస్కృతమయముగా ననుకరింపఁ బడినయది.

సీ. వారణవల్లభావనసముత్సాహాయ వారణదైత్యనివారణాయ
గోరాజభంజనోదారప్రతాపాయ గోరాజవినుతసుగుణగణాయ
భోగీంద్రశోషణాద్భుతపదన్యాసాయ భోగీంద్రమణిమయభూషణాయ
పర్వతోద్ధరణనిర్భరబలోత్తంసాయ పర్వతావాసవైభవపరాయ
యాదవేంద్రాయ పారిషదాధిపాయ, బర్హభూషాయ తారకాపతిధరాయ
నమయటంచునచంచలప్రమదగరిమఁ, బొగడి రజముఖులద్దేవయుగముఁ జేరి.

సాంబోపా. ఆ. ౪. ౧౨.

ఇట్టి యనుకరణము లీపట్టున ననేకములు గలవు. జిజ్ఞాసువు లీగ్రంథముల రెంటిని బరిశీలింపఁ దగును. గ్రంథవిస్తరభీతిచే నీవిషయము విరమించి యింక నితర గ్రంథముల యనుకరణములు దిఙ్మాత్రముగఁ జూపెదను. భాగవతమునందలి పోలికలయుదాహరణము లిచ్చుటచే మిక్కిలి గ్రంథము పెరుఁగును. కావునఁ బాఠకులు వానిని దెలిసికొనఁ బ్రార్థించెదను.

"అసినాసి విచికిత్సాహేతుశాతోదరీ." శృంగార. నైష. ఆ. ౨. ప. ౨౩.

" సదసత్సంశయగోచరోదరి"—శృంగారనైష. ఆ. ౨. ప. ౨౦.

" అస్తిహ్వాదము మాన్పు నసదు నెన్నడుమును"—సాంబో. ఆ.౪. ప.౧౧౪.

శృంగారనైషధమున భీమనృపతి యల్లునకు, కత్తి, మాణిక్యములదండ, కటారి, కామగమన మగురథము, తెల్లనిగుఱ్ఱము, వస్త్రము, పీటికాపేటి, విషాపహార మగు గారుత్మతపాత్రమును వరుసగా వరదక్షిణగా నొసంగెను. చూ. శృంగారనైష- ఆ. ౬. ప- ౯౨-౯౯ వఱకు.

సాంబోపాఖ్యానమున జాంబవంతుఁడు కృష్ణునకు, వరుసగా- ఖడ్గము, హారము, గరుడాశ్మస్థగితపాత్రము, ముత్తెపుటద్దము, చిలుక, గుఱ్ఱము, భద్రేభము, దివ్యరథము, కవచము మొదలగునవి యొసంగెను. చూ. సాంబోపా. ఆ. 3. ప. ౧౪3-౧౫౯ వఱకు.

శృంగారనైషధమున భీమరాజు దమయంతి నత్తవారింటి కనుపుచు బుద్ధులు చెప్పుటయు, సాంబోపాఖ్యానమున జాంబవంతుఁడు జాంబవతికిఁ గఱపిన హితవచనములును జూడందగును. చూ. శృంగారనై. ఆ. ౭-ప. ౭-౧౦. సాంబో. ఆ-3. ప. ౧౫౭-౧౬౧.

శృంగారనైషధమునఁ బెండ్లిమేలములును భోజనములును సాంబోపాఖ్యానమునందలి మేలములును భోజనములు నొకదాని కొకటి తీసిపోక యున్నవి. చూ. శృంగార నై. ఆ-౬. ప. ౧౦౭-౧౪౦. సాంబోపాఖ్యా. ఆ. ౫. . ౨౯౭-3౦౪.

శృంగారనైషధమున నలుని వైతాళికులు మేల్కొలుపుటను సాంబోపాఖ్యానమున సాంబుని మేల్కొలుపుట యనుకరించుచున్నది. చూ. శృంగారనై. ఆ. ౮. ప ౧-౨3. సాంబోపా- ఆ. ౫. ప. 3౪౦-3౫3.

ఇంకను పైని గలగ్రంథ మంతయు నొకదాని నొకటి పోలియే యున్నది. చదువరు లారయుదురుగాక.

ఇంతియకాక కవి యందందుఁ గల కొన్ని సంస్కృతశ్లోకముల నాంధ్రీకరించి సాంబోపాఖ్యానమునం గూర్చినాఁడు, చిత్తగింపుఁడు.

3. తదాననం మృత్సురభి క్షితీశ్వరో రహ స్యుపాఘ్రాయ నతృప్తి మాయయౌ
కరీవ సిక్తంపృషతైః పయోముచాం శుచివ్యపాయే వనరాజిపల్వలమ్.
కాళిదాసుని రఘువంశము.

• ఏకాంతం బగువేళవచ్చి సతిమో మీక్షించి మృత్స్నాసుగం
ధాకీర్ణంబగు మోవి యాని మురదైత్యారాతి మోదించు న

మ్మాకందద్రుమపల్లవంబు కడుఁ బ్రేమం జంచునం జేర్చి యు
ల్లోకానందముఁ బొందు కోకిలము వర్గప్రక్రియం జూపుచున్.

సాంబోపా. ఆ ౪. ప. ౮౦.

పైశ్లోకము పూర్వార్థమును సరిగ నాంధ్రీకరించినాఁడు. ఉత్తరార్థము విడిచి తాఁ గ్రొత్తగాఁ గల్పించినదానిని గూర్చినాఁడు. ఆంధ్రీకరణమున నుత్తరార్థమున నుపమాచిత్యము చెడినది. మూలమున నౌచిత్య మెంతేని గలదు.

శ్లో. ఉర్వ్యాం కోపి మహీధరో లఘుతరో దోర్భ్యాం ధృతో లీలయా
తేన త్వం దివి భూతలేచ సతతం గోవర్ధనో గీయసే
త్వాం త్రైలోక్యధరం వహామి కుచయో రగ్రే న త ద్గణ్యతే
కింవా కేశవ భాషణేన బహునా పుణ్యై ర్యశో లభ్యతే.

శ్రీకృష్ణలీలామృతతరఙ్గిణీ.

మ. అలగోవర్ధన మెత్తినాఁడ నని గర్వాటోపముం జెందఁగా
వల దీకొండొక కొండ లెత్త నిను సత్త్వస్ఫూర్తిమన్మూర్తిగాఁ
బలుమాఱు న్నుతియింతు రంచు నొకశంపాగాత్రి వక్షోరుహం
చలము ల్రాయఁగఁ గౌఁగిలించె హరివక్షఃపీఠి సాపేక్షతన్.

సాంబోపా. ఆ. ౪ ప. ౪౩.

పైశ్లోకమునందలి భావము నించుక యనుకరించియు నాంధ్రీకరణమును స్వతంత్రకల్పితముగా నొనరించుట బాగుగా నున్నది.

శ్లో. కూపోదకం వటచ్ఛాయా తామ్బూలం తరుణీస్తనమ్
శీతకాలే భవే దుష్ణ ముష్ణకాలేతు శీతలమ్.

గీ. వటవిటపినీడనొకకొంత వామదృశల,కుచలికుచములనొకకొంత కూపవారి
యందునొకకొంతనిలిచెగ్రీష్మావశేష,మేమిసేయునొయెలుఁగరాదింతిమీఁద.

సాంబోపా. ఆ. ౨. ప. ౧౦౭.

పైశ్లోకమునందలి "శీతకాలే భవే దుష్ణ" మ్మనువాక్యమును మాత్రము ప్రకృతానుసారి యై విడిచినాఁడు. గ్రీష్మావశేష మన గ్రీష్మరాహిత్య మని యూహింపనగును.

మఱియు నిక్కవి పెక్కు మనుచరిత్రమునందలి పద్యముల ననుకరించియున్నవాఁడు. భట్టుమూర్తికవి కావ్యాలంకారసంగ్రహమునందునను, తరిగొప్పుల మల్లనకవి చంద్రభానుచరిత్రమునందు నీసాంబోపాఖ్యానమునందలి పద్యముల ననుకరించినారు. మల్లన యీతని ననుకరించుటయే కాదు తనగ్రంథమునందలి

వర్ణనములు మొదలగు వానినెల్ల నీసాంబోపాఖ్యానమును జూచియే రచించె నని చెప్పవచ్చును. ఈవిషయ మింక విడిచి స్థలాంతరము ప్రవేశింతము.

—: విశేషపద ప్రయోగము :—

ఈరంగప్పరాజకవి యీగ్రంథమున నపూర్వములగు కొన్నిపదములను బ్రయోగించియున్నాఁడు. పాఠకులకు వాని పరిచయ మించుక కలిగించెదను. "నన్నువలె"-ఆ-౧-౭౩. నేనువలె, నావలె, ననుటకు నన్నువలె నని ప్రయోగించెను. వ్యవహారమందుమాత్ర మిట్టి ప్రయోగము లగపడుచున్నవి. "దండోపదండములు" ఆ ౨-౬౨. తండోపతండము లనుపద మత్యధిక మనునర్థమున సంస్కృతమునఁ గలదు. ఈకవి యాయర్థముననే దండోపదండము లని ప్రయోగించినాఁడు. "కేడాలు" ఆ. ౨. ౧౧౦. కేడెము- లనుటకు, కేడాలు. "విదాహాహావ్యవహాము" ఆ. ౨. ౧౪౫. విదాహ మను పదమునకు వ్యావహారికముగ నధికపిపాస యని యర్థము. ఈయర్థము గ్రంథములయం దెందును గానరాదు. ఇక్కడఁ గవి "విరహాహావ్యవహా" మనిప్రయోగించెనేమో. ప్రత్యంతరము లేమింజేసి నిర్ణయింప ననువు గాకున్నది. "ముకుందు నిట్లని పలికెఁ" ఆ ౩. ౧౭౮. ముకుందున కిట్లని యని యుండవలయును. వచ్యర్థముల కర్థంబునకు షష్ఠియే గాని ద్వితీయ లాక్షణికము గాదు. "అచ్ఛభల్లుకస్వామి" ఆ. ౩. ౧౭౮. అచ్ఛభల్ల, భల్లుక, భల్లూక, భాలూకశబ్దములు పర్యాయపదములు, వీనికి నెలుఁగుగొడ్డని యర్థము. ఇక్కడఁ గవి యచ్ఛభల్లుకపదము నుపయోగించినవాఁడు. "సిద్ధిఁబొందెడ మనుచు నాశీర్వదించి"ఆ. ౪. ౧౫౬. ఆశీరర్థమునందు, ఎడువర్ణకము లాక్షణిక సమ్మతము. ఇందు, "ఎడము" అని యకారాంతముగా నున్నది. ప్రాచీనశిలాశాసనాదులందును దాళపత్రగ్రంథములందును "ఎడ" యని యకారాంత ప్రత్యయమే యగపడుచున్న దనియు నిటీవలి లక్షణగ్రంథకర్తలమతము ననుసరించి యీపాఠము దిద్దివేయఁబడిన దనియు వినియున్నాఁడను. ఈయెడము ప్రాచీన రూపమై యుండ నోపును. సాధారణముగా నధునాతను లెల్లరు నవధారణార్థంబున, "ఎ, ఏ" వర్ణంబులను క్వాచిత్కముగ "అ" వర్ణంబును బ్రయోగింతురు. ప్రాచీనగ్రంథములందు "అ" వర్ణము బహుళముగ నగపడుచున్నది. ఈకవి యవధారణార్థమున నపూర్వముగ రెండువర్ణంబుల నొకదాని పిదప నొకదానిని గూర్చి యడాగమము చేర్చి ప్రయోగించి యున్నవాఁడు. "పద్మినులయ" ఆ. ౧. ౧౬౮. "పుణ్యుల

కయ" ఆ. ౪. ౨౦౨. "కొంటినయ" "చూచితినయ" ఆ. ౪. ౨౦౫. "ఒక్కఁడయ" ఆ. ౫. ౮౩ ఇవిగాక ఏకాకారముతో 'కృష్ణుఁడ' 'నీవ' అనుమాదిరి ప్రయోగములు కూడఁ గావించియున్నాఁడు. ఈయకారద్వయ ప్రయోగసాధుత్వాసాధుత్వములు పండితులు నిర్ణయింపఁదగును. ఆకాలమునాఁటి కిట్టిప్రయోగము లుండెడి వేమో యని సంశయము జనించుచున్నయది. ఇంక నిట్టి విశేషము లందందుఁ గనఁబడినఁ బాఠకు లారసికొందురుగాక.

శృంగారరసము వర్ణించుపట్టున మొదట నాయికయొక్క యనురాగమును వర్ణించి పిదప నాయకుని యనురాగమును వర్ణింప నగు నని సంస్కృతాలంకారికులమతము. "ఆదౌ వాచ్యః స్త్రియారాగః పుంసః పశ్చాత్తదింగితైః" సాహిత్యదర్పణము. సంస్కృతకావ్యనాటకాదులం దీనియమము బాగుగఁ బాటింపఁబడి యున్నది. ఆంధ్రప్రబంధంబులందుఁ గూడఁ గొన్నింట నీనియమమే యవలంబింపఁబడినది. కాని యీగ్రంథమునందు నింక నితరప్రబంధము లనేకములందును దొలుత నాయకానురాగమే వర్ణింపఁబడినది. దానికిఁ గారణ మేమో తెలియదు. ఇట్లు వర్ణించుట వలన నాయకుని కించుక చేలతనము ప్రకటితము కాక తీఱదు. తొలుతఁ బురుషానురాగమే సంభవించినను దానిని దొలుత వర్ణించుట కంటె వనితానురాగమే మొదట వర్ణించుట విశేషరసపోషక మగు నని యాలంకారికులమతము.

—: కవిప్రశంస :—

పీఠిక ముగించుసందర్భమున నీకవిప్రతిభాతిశయముం గూర్చి కొంచెము నివేదింపక విడువఁ జాలను. ఈరాజకవి యఖండ మగు విద్యాపరిశ్రమము గావించి కవితావైభవమును నాధ్యాత్మికగ్రంథపరిజ్ఞానమును గూడ బాగుగ నార్జించినవాఁడు. సిద్ధాంతదర్పణగురుప్రస్తావమునఁ గావించిన వర్ణన మీతని విశిష్టాద్వైతమతజ్ఞానమును వేనోళ్ళఁ జాటుచున్నది. ద్వితీయాశ్వాసమునందలి నూటమూఁడవపద్య మీకవికిఁ గల మహమ్మదీయ మతసంబంధ జ్ఞానమును బ్రకటించుచున్నది. సిద్ధాంతిదర్పణునిచేఁ జెప్పించిన నీతి యానాఁటిరాజుల బలపౌరుషాదుల రీతిని వెల్లడించుచున్నది. అనర్గళ కవితాధార యు నద్భుతభావప్రకటనమును ననల్పకల్పనావైచిత్రియు నలంకారప్రయోగనైపుణియు నీరాజకవికిఁ గవిరాజపట్టాభిషేకము గావించుచున్నవి.

విద్యానగరాపరనామము గల విజయనగరము తొలుతటి నుండియు విద్యల కాకరంబై యలరారెడిది. వేదవ్యాఖ్యానంబు లందే యుద్భవించినవి.

సర్వజ్ఞబిరుదాంచితుఁ డయిన నాచనసోముఁడు విజయనగరరాజాస్థానమునఁ బ్రబలినవాఁడే. శ్రీనాథకవి కనకాభిషేకమును గాంచినది విజయనగరముననే. అష్టదిగ్గజములు మహోత్తమాంధ్రప్రబంధములరచించుట విజయనగరముననే. సాహితీసమరాంగణసార్వభౌముఁడై యాంధ్రనాయకున కాముక్తమాల్యద నర్పించిన కృష్ణదేవరాయ లేయాంధ్రునకు మఱపుఁచ్చును! జీర్ణకర్ణాటక రాజ్యలక్ష్మీపునస్థాపనాచార్యుఁడై వసుచరిత్రమును గృతి నొందిన తిరుమలదేవరాయలు విజయనగరసింహాసనాసీనుఁడైన పిదపనే గీతగోవిందవ్యాఖ్యానము రచియించె నని ప్రతీతి కలదు. తిరుమలదేవరాయని పెద్దతండ్రికొడు కగు నల్లతిరుమలరాజు బాలభాగవతమును గృతినొందెను చంద్రభానుచరిత్రము, కళాపూర్ణోదయ ప్రభావతీప్రద్యుమ్నములును విద్యానగరప్రాంతమున విజయనగరరాజుల యాదరాభిమానములచేతనే వెలసినవి. అట్టివిద్యానగరరాజన్యులకు బంధువును సామంతుఁడు నగు నీకవిరా జుత్తమప్రబంధ నిర్మాణము గావించుటలో వింత యే ముండును. పద్మరాగముల గనిలో రత్నము లుదయించుటాశ్చర్యకారణ మగునా? అందును నీకవి విశిష్టాద్వైతమతమునను బరమతసహిష్ణుత్వమందు ను గవిత్వవైభవమునను శ్రీకృష్ణదేవరాయలఁ బోలి వెలుంగుచున్నవాఁడు. ఇట్టిమహాకవిగ్రంథరాజము దురదృష్టమున నేకైకమాతృకతో మూఁడుశతాబ్దము లజ్ఞాతవాసము గావించుచుండ ననేకవ్యయప్రయాసముల ననుభవించి దానిని లోకమునఁ బ్రకటించిన యాంధ్రసాహిత్యపరిషత్తునకు నేతద్గ్రంథాది ప్రకటనమునకై యధికౌదార్యము జూపిన శ్రీపైడా వేంకటాచలపతిగారికిని శాశ్వతకీర్తి లభించు ననుట నిక్కము. ఆంధ్రలోక మీయుభయుల యెడ మిగులఁ గృతజ్ఞమై యుండఁగలదు.

ఇచ్ఛాపురము.
24-10-32.

ఇట్లు బుధవిధేయుఁడు,
కట్టి సాంబమూర్తిశాస్త్రి.

# సాంబోపాఖ్యానము.

---

ఈసాంబోపాఖ్యానము ప్రతి తంజావూరు సరస్వతీమహాలు పుస్తకాలయములో 241 సంఖ్యగా నున్నది. దానికి బ్ర॥ మానవల్లి రామకృష్ణకవి, ఎం. ఏ. గారు ప్రతి వ్రాయించి తెచ్చిరి. దానిని వారు మాకు దయచేసిరి. మేము వారి ప్రతినిబట్టి యింకొక్కప్రతిని వ్రాసితిమి. మాతృకలో వ్రాఁతతప్పులు, బహువిధములుగా నున్నవి. సవరించుటకుఁ గష్ట మనిపించినది. చెన్నపురి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున నొక్క కాగితపుఁ బ్రతి యున్న దని యక్కడికి మాపుస్తకమును బెట్టి కొత్తపల్లి సూర్యరావుగారిని బంపితిమి. ఆపుస్తకము బ్ర॥ రామకృష్ణకవిగారి ప్రతినిబట్టి వ్రాయఁబడినదియే నఁట. విశేషించి దానిలేఖకులు మాకీగ్రంథమునకుఁ బీఠిక వ్రాసియిచ్చిన విద్వాన్ కట్టి సాంబమూర్తిశాస్త్రిగారే. కాని వా రక్షరలోపములు, పదలోపములు, పద్యలోపములు, పత్రములలోపములును సవరించుటకుఁ గడఁగ లేదు. సంపూర్ణగ్రంథము గల తంజావూరుమహాలు పుస్తకాలయమునకు సూర్యరావుగారినే పంపితిమి. ఎక్కడెక్కడ సందర్భహీనత, గ్రంథపాతములు, వ్రాఁతతప్పులు, గలవో యట్టితావుల నిచ్చట నే గుర్తులు పెట్టుకొని చని సంప్రతింపఁబోఁగాఁ దంజావూరునందలి తాళపత్రగ్రంథములోని మొదటి 141 పత్రములు లేవఁట. అవి యెట్లు మాయమైనవో తెలియదు. అందున్న భాగమునుండి యే సాధ్యమైనంతవఱకు సంప్రతించి తప్పులు సవరించుకొని లేనిభాగములు వ్రాసికొని యెట్లో కష్టపడి వచ్చిరి. కొన్నిసందేహములు మాతృకలోను నట్లేయున్నవి. తీఱలేదు. అందును వ్రాఁతపొరపాట్లు విశేషించి కలవు. మైసూరుదొరతనమువారి పుస్తకాలయములో నొకప్రతి యున్నట్లు తెలిసి సూర్యరావుగారు మైసూరున కేగి విచారింపఁగా నది పుస్తకాలయమునకు సంబంధించినది కా దనియు, నెవ్వరియొద్దనుండియో వచ్చినదనియు ఆంధ్రగ్రంథమగుట ననవసరమని దానిని మరల వారికిం బంపివైచి రనియు నక్కడివారివలనఁ దెలిసినది. తుద కది, యిటీవల, బెంగుళూరుతాలూకా ముళువాగిలులో నొకపుస్తకాలయమువారి దని, యొకయాగడ, మైసూరుదొరతనమువారి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారపండితులలో నొకరగు బ్ర॥శ్రీ జి. నరసింహశాస్త్రిగారు తెల్పిరి. దానికై ముళువాగిలు వ్రాసితిమి, కాని ప్రత్యుత్తరము వ్రాయరైరి. అభావముచే విరక్తినొంది యది

యీసాంబోపాఖ్యాన మగునో, కాదో, దానిం దెల్పినవారు కవిపేరు తెల్ప లేదని కాలవిలంబమునకు సహింపక యున్నదానితోనే ముద్రణము ప్రారంభించి యొట్టకేల కీరూపమున నాంధ్రలోకమున కున్నంతవఱకు సమర్పింపఁగలిగితిమి. మేము పడుటయేగాక మాకంటె కగపడిన పండితుల నెల్ల నీగ్రంథ విషయములోఁ బాధపడఁజేసితిమి. ఆబాధ వర్ణనాతీత మైనది. ఏపాఠ మెట్లు, తాళపత్రప్రతిలోను, దానిపుత్రికలోను, నర్థము తెలియక వ్రాసిన వారి వలన తాఱుమాఱై యెంతెంత బాధ కలిగించినదో మనవి చేయఁజాలము. మానవల్లి రామకృష్ణకవిగారిప్రతిని బట్టి పరిషత్తులో వ్రాయించిన ప్రతియును దానిలోనే చెన్నపురిప్రతితోను, దంజావూరుప్రతితోను సంప్రతించిన పాఠభేదములు సూచింపఁబడియున్నవి. వ్రాయసకాండ్రవలన ముద్రణసమయమున, మేము పడినశ్రమకు రెండుదాహరణములు:—

1 ఆ. 156 పద్యమును జిత్తగింపుఁడు. "చంద్రుతేరుసూతువిశమ*" అని యున్నది. ఈవిశమశబ్దవిచారమునకై చాలమంది పండితులు శ్రమపడిరి. "సూతువశమ" అని దిద్దఁజెప్పిరి.

కాని యిటీవల నింతకంటె "సూతు వినమ" యని సూతుని వినము గదా యనియుండిన బాగుగ నుండునేమో యని తోఁచినది."వికస్వరస్వరతునీవహావ్రజరుచిచ్ఛలఁబునక" అను తప్పును బండితు లెంతశ్రమపడిన సరియైనయర్థము తేఁజాలిరో పద్య మంతయుఁ జదివి వేత్తలు తెలిసికొనఁగలరు.

5 ఆశ్వాసము - 281 పద్యములో - రెండవభాగమున—

"జుట్టివచ్చు విధఁబున సుదతిఁగూడి, ప్రదక్షిణంబొనరించెను బావకునకు" నాల్గవపాదము మొదటను బ్రదక్షిణంబొనరించె ననుచో గణదోషము కుదురక 'క్షి'లఘువుగాఁ గవి ప్రయోగించినాఁడని లేనిపోని యనుమానములకుఁ బండితులు లోనైరి. తుదకు వ్రాఁతకాఁడు ప్రలు రెండుండుట యనవసరమని యొక్కదాని నెత్తివేసి చరణము కుదుర్చుటకై కొన్నియక్షరములు గురులఘువులు మార్చినట్లు తెలిసికొనఁగలిగిరి.

మేము ప్రతి వ్రాయించుటలోఁ బడిన శ్రమను బాఠకులకు విశదపఱుచుటకై యీమాతృకలోని యొక్కపుటను ఛాయాపటము దీయించి చూప నెంచితిమి, గాని, కాలవిలంబమునకు సైఁపఁజాలక యప్పని విరమించితిమి.

* సవర్ణము శవర్ణమువం బోలునట్లు వ్రాయుటచేఁ గల్గినకష్టము.

మేము సవరించిన సవరణలు, పాఠభేదములు మొదలైనవి గ్రంథము చదువు వారికిఁ దెలియుటకై యందందు సూచించియున్నారము. కొన్ని పద్యములు దొరకలేదు. కొన్ని పద్యములలోని పదములు దొరకలేదు. కొన్ని పదముల లోని యక్షరములు తెలియలేదు. ఆయాస్థలముల......నిట్టిరీతిగా విడిచియు న్నారము. దీనిప్రతి యెవ్వరియొద్దనైన నున్నచోఁ బంపుదురేని ద్వితీయము ద్రణమున నింతకంటె నిర్దుష్టముగఁ బ్రకటింప యత్నించెదము.

ఇట్టి యద్భుతగ్రంథ మింతవఱకు ముద్రింపఁబడకుండుట శోచ్యము. ముందే, బ్ర రామకృష్ణకవిగారిద్దానికిఁ బ్రతి వ్రాయింపకుండిరేని సగముగ్రంథ మాంధ్రలోకము పోఁగొట్టుకొన్నదై యుండును. వసుచరిత్ర కళాపూర్ణోద యములకంటెఁ బూర్వమే రచియింపఁబడినను బ్రకటింపఁబడకుండుట మనపరి షత్తునకుఁ బ్రశస్తిఁ దెచ్చుటకే యని నమ్ముచున్నారము. దీనికిఁ గారణము రామకృష్ణకవిగారే యనకతప్పదు.

రావుబహద్దరు శ్రీపైడా వేంకటాచలపతిగారు తమషష్టిపూర్తి మహో త్సవసందర్భమున నాంధ్రగ్రంథప్రకటనమునకై, ఆంధ్రసాహిత్యపరిషత్తున కొ సంగిన ధనములోనుండి యిది ప్రథమగ్రంథముగాఁ బ్రకటింపఁబడినది. వారు పరిషత్తునందు, నాంధ్రభాషయందు గలయభిమానముచేఁ జూపిన యౌదా ర్యమునకు వారికి మాకృతజ్ఞతావందనముల నొసంగుచున్నారము. పరమేశ్వ రుఁడు వారికి దీర్ఘాయువు నితోధికైశ్వర్యము నొసంగుఁగాక. ముం దిట్టియు త్కృష్టగ్రంథములే దీని కనుబంధముగాఁ బ్రకటింపఁబడుచుండును. ఆంధ్రలో కము దీనిం జదివి యానందించుటయే పరిషత్తు పరిశ్రమకు ఫలము కాఁగలదు.

ఈగ్రంథమును సాంతముగాఁ జదివి చక్కని పీఠిక యచిరకాలములో వ్రాసియిచ్చిన బ్రః శ్రీ విద్వాన్ కట్టి సాంబమూర్తిశాస్త్రిగారికి మేమెంతయుఁ గృతజ్ఞులము.

ఆంధ్రసాహిత్యపరిషత్కార్యదర్శులు.

శ్రీరస్తు.

# సాంబోపాఖ్యానము.

---

## ప్రథమాశ్వాసము.

---

—కృతిప్రారంభము—


రంగంబున శేషతల్పముపయిం జెన్నొంది శుభ్రాబ్జపీ
ధీరాజద్భ్రమరంబులీల సుమనోదృక్పర్వముం జేయు శ్రీరం
గారాధీశ్వరు విశ్వతోముఖతపఃకళ్యాణరూపంబుఁ గా
వేరీమధ్యతటీమరాళముఁ ద్రయీవేద్యుం బ్రశంసించెదన్. ౧

సీ. నీలాలమేడ యేలీలావతికిఁ బక్షిరథభుజాశాఖాంతరాళసరణి
చరణలాక్షారసస్ఫురణ మేయింతికి వేల్పుటింతులకొప్పువిరులతేనె
భాజనంబులు భక్తభవనంబు లేభామకరుణాకటాక్షవీక్షణములకును
నోలగం బుండు నేయువిద సంఫుల్లనీరజతల్లజాటవీరాజవీథి
మనుచుచేటిక లేదేవికిని నిధాన, దేవతాకోటి యాజగత్త్రితయజనని
రంగమందిరపదకాగ్రరత్నకలిక, దుగ్ధసాగరతనయఁ బ్రస్తుతులఁ దెలుతు. ౨

ఉ. శాంతు నుదాత్తవైభవనిశాంతు ధరాభరణానుభావదు
ర్దాంతు సుధీవిధేయగుణదాంతు ఫణామణిరుగ్వినూతభా
స్వాంతు ననంతుఁ గాంతిధనవంతు నుతింతు లతాంతసాయక
ప్రాంతచరిష్ణుగంధవహబంధురగంధవచోమచర్చికన్. ౩

౬. సురతాంతతాంతసాగరశయానునకును గొదమచట్టుపలు పైగోవసురటు
లచలభీమము లైనహస్తికచ్ఛపముల కానబిలము మహానసాగ్ర్య
మంబకు నైనదాస్యగ్లాని యుడిపింప నౌషధం బాత్మబాహావలేప
మఖిలద్విజాధీశతావృత్త ముత్తాలతరనిజప్రాభవధైర్యచర్య
గాఁగఁ గకుబంతదంతిముఖప్రఘూణ, తరుణసిందూరభక్తివిధానకారి
భూరితనురోహణప్రభాహారియైన,గరుడియొనరించు మాకు నుత్తటశుభంబు.

మ. అవితాశేషసుదర్శనాయుధజయాహంభావసంభారు సూ
త్రవతీపత్త్రలతాలతాంతనిజహారస్థూలముక్తామణి
చ్ఛవిఁ గార్తస్వరవేత్రవల్లి నమితస్వారాజముఖ్యామర
ప్రవరప్రాంశుకిరీటకూటతటు విష్వక్సేనుఁ గీర్తించెదన్. ౫

ఉ. వెన్నునిబొడ్డుతెల్లవిరి వెల్వడువేళల మేన నంటెనో
ప్రన్ననిపుప్పొడూళి యనఁ బాటిలవిద్రుమకందళద్రుకాం
తి న్నలువొందు నల్వ వినుతింతు వచోరచనాచమత్క్రియా
సన్నహనాభిముఖ్యశుభసంపదవాప్తికలాభిలాషి నై. ౬

సీ. నిజశిరస్సింధుసీరజరాజగంధసంభారంబుఁ దలపించుపరిమళంబు
నిజశేఖరసుధాంశునిస్సరద్ధారాళసుధఁ బిసాళించుమెచ్చులరసంబు
నిజశరీరార్ధమానితమానినీతనూబంధబంధురపదబంధరచన
నిజపాణికటకాహినేతృస్ఫుటోక్తుల శాసించుశబ్దానుశాసనంబుఁ
గలుగ హరిభక్తిఘనమైనఘనులకవిత,తనుఁదలంచినయంతమాత్రనెఘటింపఁ
జేయు శ్రీవైష్ణవాన్వయశేఖరంబు,శివుఁడుమత్కృతిఁగొనసాఁగఁజేయుఁగాత.

క. లలితాధరవిద్రుమదే, హాళులును దంతంపుఁదలుపు లమరిన పతిమో
ములు చుట్టుంగొల్లారపు,టిలుగా వర్తించువాణి నేఁ బ్రణుతింతున్. ౭

చ. కలుషవిదూరుఁ డౌసుకవి కావ్యము (భవ్య) లొనర్చుచోట నం
దలిగుణవైభవంబు చెవిదార్చి విను న్మది మెచ్చుఁ గాని త
ప్పులు పరికింపఁ డించుకయుఁ బూర్ణసుధాకరసాంద్రచంద్రికా
గుళికలు గ్రోలుఁగా కలచకోరము తత్తనుచిహ్న మెన్నునే. ౮

క. నూతనకావ్యరసోదయ, చూతారామంబు కుకవి చొచ్చియుఁ జెవి క
ప్రీతిగఁ బలుకుఁ గపోతక, పోతము చేతోజగీతములు వాడు క్రియన్. ౧౦

వ. అని ప్రధానదేవతావందనంబును దదుచితేతరామరాభినందనంబును సుకవి పురస్కృతి యుఁ గుకవితిరస్కృతి యుం గావించి మదీయసూక్తిప్రపంచకాంచనకమలమాలికం గమలాకళత్రుం గావేరీమధ్యక్షేత్రగృహమేధి వేధస్తపోధనంబు రంగపతిం బూజింప నభిలషించితి, మదీయవంశక్రమం బెట్టిదనిన.

—కవివంశావళి—

సీ. కలశపాథోరాశి వెలసె నెవ్వాఁ డతిస్వచ్ఛముక్తాఫలస్ఫటికలీల
నవతంసమాణిక్య మయ్యె నెవ్వాఁ డష్టమూర్తికి నాకాశమూర్ధజునకు
వైశ్వానరాదిదేవతలకు నెవ్వాఁడు పొసఁగించు నమృతాన్నభోజనంబు
బలుకరంబుల హాళాహళి సేయు నెవ్వాఁడు కార్కొన్నగాఢాంధకారధారఁ
గట్టె నెవ్వాఁడు రోహిణీకామినికినిఁ
దాళి గళకంబువున మహోత్సవము మెఱసి

యట్టి హిమధామువంశంబునందుఁ గొనలు
సాఁగె నాత్రేయగోత్రసత్క్షత్త్రియాళి. ౧౩

గీ. వెలసెఁ దద్వంశమున నారెవీటిబుక్క, రాజురామయ్య రాజాధిరాజపూజి
తాంఘ్రిజలజాతనఖరప్రభాంకురాగ్ర, జనితనతవైరిఫాలచందనుఁడు ఘనుఁడు.

ఉ. పోరుల నారెవీటిపురబుక్కయరామనృపాలుఁ డాగ్రహో
దారత వాలు పూనిన సదాగతికంపితజీర్ణపర్ణలీ
లారభటి న్విరోధిమహిళాంగవిభూషణరాజి రాలు నై
వాఱుఁ బ్రతాపపల్లవశుభప్రభ వర్ధిలుఁ గీర్తిపుష్పముల్. ౧౪

సీ. శ్రీబుద్ధిధృతిమతిప్రాబల్యములయిక్క శాబసారంగాక్షి యోబళక్క
యక్కమలాదేవి నిక్క మీసతి యనఁ జొక్క మైనసుశీల లక్కను యును
గంగాతరంగసారంగభృన్నిభకీర్తిశృంగారితదిగంత రంగమాంబ
పతిదేవతాముఖ్యబంధురనయసౌఖ్య హరిసేవనావ్యాఖ్య యమలమాఖ్య
యనఁగ నలువురు దేవులు నారెవీటి, బుక్కనరపాలురామభూభుజునిసతులు
వెలసి రాచంద్రతారార్కవిభవశుభవ,శంవదోద్ధారికలు ధర్మసరణి ధరణి.

ఆ. ఓబలాంబకుఁ బుత్త్రులుడురాజనిభులు రాయనరాజు గోపరాజాహ్వయుండు
లక్కమసుతులు లీలావసంతులు తిమ్మరాజుఁ గొండ్రాజు శ్రీరంగరాజు
రంగాంబతనయులు సంగరోగ్రులు మూర్తిరాజును సింగరిరాజవరుఁడు
అమలక్కనందను లమలకీర్తులు జగ్గరాజు చినసిరంగరాజమణియు
ననఁగ నెగడిరి రాజసింహావతారు, లానతారాతికోటీరహారిహారోప
లాంశుసాంద్రాంశుచంచరీకాంచితప్ర, మోదకృత్పాదపద్మప్రసాదు లగుచు.

ఉత్సాహ. బుక్కవిభునిరామరాజుపొలఁతి యైనలక్కమా
దిక్కరీంద్రయానసుతుఁడు తిమ్మరాజు వెలయు భూ
భుక్కిరీటతటవిటంకపుష్యరాగమాలికా
రుక్కలాపనవపరాగరుచిరచరణజలజుఁ డై. ౧౬

. సత్యవాక్యుల హరిశ్చంద్రుఁ డొక్కఁడె కాఁడు కుంతీమహాదేవికొడుకుఁగుఱ్ఱ
యాహవోద్ధతి రావణారి యొక్కఁడె కాఁడు వేగేలురాగాంగవీరవరుఁడు
హరిభక్తియుక్తిఁ బ్రహ్లాదుఁ డొక్కరుఁడె కాఁ డంచబాబా వేల్పనుఁగుఁబట్టి
వితరణంబున విత్తవిభుఁ డొక్కఁడే కాఁడు హైడింబుగెడపినయట్టిజెట్టి

యీాడుజో డైన ప్రతి యగునితనికనఁగఁ, బరఁగెహారగాంగ ఫేన ప్రభా ప్రభావ
విభవభారసభాస్తారవిశదకీర్తి,మండలుఁడు రామరాజుతిమ్మప్రభుండు. ౧౮

ఉ. చేరిక వీరబాహుని భజించుటచే గజబొంకు బొంకుటన్
సారము దూలె మున్నని త్రిశంకుతనూజుఁడు ధర్మపుత్త్రుఁడుం
గారణజన్ము లై కలియుగంబునఁ బుట్టిరొ యేకమూర్తి నా
ధీరుఁడు రామరాజమణి తిమ్మనృపాగ్రణి సత్య మారయన్. ౧౯

వ. ఇట్లాత్రేయగోత్రపవిత్త్రుండును నాపస్తంబసూత్త్రుండును నై రాజిల్లు రాజాధిరాజరాజపరమేశ్వరాష్టదిగ్రాజమనోభయంకర సమరాంగణసాహిత్యసార్వభౌమబిరుద సరస నరసవిభుకృష్ణరాయరాజ్యలక్ష్మీనిరీక్షణపక్ష్మం బగుకొండవీడక్షీణకౌక్షేయా ...గు పినకొండ్రాజును గమ్మతెమ్మెరలఁగ్రుమ్మరించు ... తిమ్మరాజును గప్పురంపులప్పలం గుప్పళించు కీర్తులం బ్రవర్తించు నప్పలరాజును నుద్దామాభిరామశ్రీమంతుం డగు రామరాజవరుండునుం బ్రభవించి విభవప్రభావప్రియంభావుకు లై తేవ మించిరి మఱియు నాలక్ష్మణాగ్రజనిభప్రభావు ద్వితీయభార్య యగు లక్ష్మమ్మకు ఘనతరప్రకాశశయ్యా యగు పినతిరుమలయ్యయు శరధితూణీరోపమప్రతాపధాయ్యా యగు పెదతిరుమలయ్యయు నుదయించి రాపంచాస్యపరాక్రము తృతీయదేవి యై రూపవతి యగుగోపమాంబకు నలతిరుమల విఠ్ఠల చినతిమ్మ పాపతిమ్మాహ్వయు లై యంహస్తిమిరగభస్తిమాలిశాలు లగు నలువు రుదయించి రాకాంచనాచలధీరు నాలవమగువ యగు తిరుమలమ్మకుఁ దిమ్మప్ప కోనప్ప సింగరాజులనుపుత్త్రపుంగవు లంగీకృతప్రతాపపతంగసన్నిభు లై యిన్నిఖిలావనీతలంబు నేకాతపవారణంబుగా నేలుచుందు రె ట్లనిన. ౨౦

ఉ. సుప్రతిభాచతుర్ముఖులు సూరిజనావనకామధేనువుల్
దీప్రతరప్రతాపు లవధిక్షితిభృత్తటసంచరిష్ణుదృ
ప్తప్రతిపక్షు లక్షయవిభావిభవాఢ్యులు రామరాజుతి
మ్మప్రభుపుత్త్రు లెల్లరును మానసుయోధను లాజిఫల్గునుల్. ౨౧

క. నలతిమ్మరాజు నీలో,త్పలరుచి యగుఖడ్గపుత్త్రి పాంసుయశఃశ్రీ
గలిగించు ప్రాజ్ఞప్రీతా, ళి వెకలించు క్రియన్. ౨౨

చ. సరసము బాలభాగవతచంపువు దోనురి కోనసత్కవీ
శ్వరరచితంబు రామనృపచంద్రునితిమ్మయచిన్నతిమ్మభూ

వరుఁ డఖిలావనీజనశివంకరముం గయికొంట యొప్పు శం
కరుఁడు శశాంకరేఖయును గౌస్తుభ మంబుజనాభుఁడుఁ బలెన్. ౨౩

చ. స్థిరమతి రామరాజమణితిమ్మయవిఠ్ఠలరాజపుంగవుం
డరివధ మాచరించుతఱి నాజుల వాజుల నెక్కి యాడఁ ద
త్ఖురరజ మంబుదంబుల నిగుడ్చు వరింపఁగ నిర్జరాంగనా
కరధృతపుష్పమాల్యకలికాగళదచ్ఛపరాగరాగ మై. ౨౪

క. ఆవిఠ్ఠలేశ్వరానుజుఁ, డై వెలసినచిన్నతిమ్మయనృపతి వెలయున్
దేవేంద్రానుజుఁ డై మను,గోవిందుఁడు పోలె భువనకుశలప్రదుఁ డై. ౨౫

గీ. పాపతిమ్మరాజు భాసిల్లు నిత్యప్ర,సన్న వేంకటేశచరణజలజ
చంచరీక మగుచుఁ జండ్రాతపాటోప, విభ్రమాభిరామవిశదకీర్తి. ౨౬

ఉత్సాహ. రామరాజుతిమ్మరాజరత్నమునకు ననుజుఁ డౌ
రామవిభునిపెద్దకొండరాజు ప్రథమపత్ని సు
త్రామయువతిసమత మమత దాల్చు కొండమాంబరున్
శ్రీమనోజ్ఞ లైనసుతవరేణ్యు లమరి రుర్వరన్. ౨౭

వ. వారెవ్వ రంటేని. ౨౮

సీ. ధాటీముఖాటోపపాటితారాతిహృ,త్పాటిత(గ)దుఁడు కోనేటిరాజు
క్రొమ్మించుటలుఁగులఁ గ్రమ్మించు రిపుసేన గ్రుమ్మించుదొర పెద్దతిమ్మరాజు
అనిమొనఁ బగఱఁ గన్గొని పెండ్లికిని బోలెఁ జనుచిన్నతిమ్మరాజన్యవరుఁడు
భీమాహితస్తోమసామజేంద్రగ్రామసామజాహితమూర్తి రామనృపతి
నాల్గుపురుషార్థములలీల నలువనాల్గు, వదనములభాతి నిర్జరేశ్వరుగజంబు
నాల్గుకొమ్ములక్రియఁ బద్మనాభునాల్గు,భుజములవిధానఁబొల్చిరద్భుతవిభూతి.

క. పెదకొండవిభుని రెండవ,సుదతికి శ్రీరంగమకును సుతు లిరువురు పెం
పొదవిరి యౌబళరాజును, హృదయంగమమూర్తి వేంకటేశుఁడుఁ బరఁగన్.

గీ. రామరాజుతిమ్మరాజుసోదరుఁడు శ్రీ,రంగరాజుదేవి రాజవదన
తిమ్మమాంబ వెలయు దేవేంద్రునిల్లాలిఁ, బోలి నిత్యలక్ష్మి నేలి వాలి. ౩౦

గీ. కోనవిభుని తిమ్మభూనాథుఁడును రామ,నృపుఁడుఁ దిరుమలయ్య విపులకీర్తి
ఘనుఁడు వేంకటాద్రియునుమించిరవని శ్రీ,రంగరాజుసుతులురంగహితులు.

మ. దివిజేంద్రాభుఁడు కృష్ణరాయధరణీదేవేంద్రుజామాత శ్రీ
ధవపాదాంబుజభంభరం బమరు మేధావేధ రామప్ప శా

త్రవకంఠాంతరరక్తశీకరసరిద్ధారోర్మినిర్ధౌతఖ
డ్గవనీకీర్తిలతాంతగంధిలహరిత్ప్రాంతాకచాభోగుఁ డై. 33

మ. మహి నెవ్వా రెన సల్వరాజుచినతిమ్మక్ష్మాపకంఠారుణాం
బుహావిశ్చుర్వణతర్పితాసిశిఖికిం బుష్పాయుధస్నిగ్ధవి
గ్రహసౌభాగ్యపరంపరాపరిధికిం గర్ణాటకైశ్వర్యని
ర్వహణాహార్యభుజాధ్వజాయుధపరీవారుండు రామప్పకున్. 34

క. శ్రీరంగరాజురామ,క్ష్మారమణునికీర్తి జలధిజాలము దాఁట
న్నేరిచియును నేరదు రిపు,నారీనయనాశ్రుపూరనదిఁ దరియింపన్. 35

సీ. ముసలిమా నని కాని ముదిరాశ్వభూజంబు వాతర ట్టని కాని వారిదంబు
వీచివా టని కాని వేలామనోభర్త రాకొట్టు నని కాని నాకమణియుఁ
బశుబుద్ధి యని కాని పర్జన్యధేనువు నరదాత యని కాని యచలధన్వి
పాదదా తని కాని పాండురాంశుండును బ్రతి వేఁడు నని కాని భానుసూతి
మహిమ శ్రీరంగరాజురామక్షితీశుఁ,బోల్పఁగాఁ దగువితరణంబుననటంచు
నారభటిఁ బ్రస్తుతింపుదు రంగవంగ,చోళమాళవనేపాళసుకవివరులు. 36

ఉ. గుత్తిఅతిమ్మరాజు పరఁగున్ హరగాంగసితాబ్జకాంతులన్
గుత్త లొనర్చుకీర్తులఁ జకోరదృగాశయపుష్పధన్వుఁ డై
యత్తొగవిందువంగడము నందలిభర్తకు సంభవించి రా
మెత్తున కెత్తు వచ్చు సిరియింపుల శౌర్యధనంబు సొంపులన్. 37

ఉత్సాహ. రంగరాజువేంకటాద్రిరాజు వెలయుఁ గావ్యసా
రంగరాజు రంగరాజు రాజితప్రతిజ్ఞ సా
రంగరాజు ప్రజ్ఞ హరితురంగరాజు వీఁక సా
రంగరాజు రంగరాజు రాజభావుకార్చనన్. 38

వ. ఇట్లు నానావర్ణమండలీకరగండండు ను జాళుక్యనారాయణుండు ను బిరుద
మన్నియవిభాళుండు ను ముత్తెంబరగండండు ను నురిగొలసురత్రాణి యు
నైన రామరాజుతిమ్మవిభునివంశంబు శశిబిందుసౌభరిసంతానసరణిం దామ
రతంపంబై పెంపు మెఱసె నతనితనయవతంసం బగు పినకొండ్రాజాఖండల
పుండరీకాక్షుకుండలిమండలేశ్వరఖండపరశుచండకిరణనిభప్రభావుం డై శ్రీ
వహించె నాపంచశరమూర్తికిఁ గీర్తితచరిత్రపవిత్ర యగుకోనమాంబకుం
గుమారరత్నంబులు. 39

క. కోనేటితిమ్మరాజును, శ్రీనిధి చినతిమ్మరాజసింహంబును ల
క్ష్మీనిత్యుఁ డప్పలేంద్రుఁడు, దీనావనకల్పతరులు ధృతి మని రవనిన్. ౪౦

సీ. ధారాసమన్వితోద్ధతిఁ జాల మెఱుఁగెక్కి యభిమన్యువశవృత్తి ననుసరించి
భానుమండలసదాపరిచయంబునఁబొల్చి సకలాస్యగురుభావజయముగాంచి
స్వామికరగ్రహసౌశీల్యము వహించి భీమవిక్రమమునఁ బెంపు మెఱసి
కువలయచ్ఛాయానుకూలశైత్యము నొంది బహుముఖవిలసనప్రౌఢి నలరి
చెనకు మందోదరిని రోహిణిని హిడింబ, దేవసేననుఁ గృపిఁ దిగ్మదీప్తితరుణి
నుత్తరఁదటిత్తుఁదనమహోదాత్తహేతి, యెనయఁగోనేటితిమ్మరాజేంద్రుఁడలరు.*

సీ. గురుభక్తికాంతిసద్గుణదీప్తిబలముల రామచంద్రామిత్రరచనవాఁడు
శరశౌర్యజవమహోజ్జ్వల్యపావనతల నరసింహవిగ్రహనటనవాఁడు
జయగానమతిభూతిసఫలకోపంబుల గురురాజగురుభవస్ఫురణవాఁడు
దర్పభోగక్షాంతిదానోన్నతస్ఫూర్తి వృషభేంద్రభూధారివిధమువాఁడు
రాజమాత్రుండె శ్రీరామరాజుతిమ్మ, రాజుపినకొండనృపసుధారాశివిధుఁడు
పరమవైష్ణవసిద్ధాంతపారదృశ్వ,దీప్తిదినరాజు కోనేటితిమ్మరాజు. ౪౨

సీ. సేవించు శ్రీకాంచికావాసు వరదరాజుల వసాగంధగంధిలముఖాబ్జు
నగ్రహారము లిచ్చు నవనిదేవతలకుఁ గూర్చు రామానుజకూటకోటి
ధట్టించు నుద్దండతరవిపక్షాఖండమండలాధీశులమదభరంబు
విక్రమార్కునిలీల వెలి పెఱుఁగఁడు సత్యసంధమహాకీర్తి హరిశ్చంద్రుకరణిఁ
జటులనాసీరతుక్ఖారసంప్రసార, కటుశఫాంచలవిదళితక్ష్మాతలోద్ధ
ధూళిచుళుకితసప్తపాథోధిరాజు, తెలివి నుడురాజు కోనేటితిమ్మరాజు. ౪౩

మ. కులపాథోనిధి పూర్ణచంద్రుఁ డగునాకోనేటితిమ్మక్షమా
తలనాథుం డొనరించుసీవుల యశోధన్యాత్ము లై మాన్యు లై
బలవిభ్రాజితు లై కళాభరితు లై భాసిల్లు శ్రీవైష్ణవేం
ద్రులు వర్తింతురు దివ్యభోగనిధులై దుర్వారనిర్వైఖరిన్. ౪౪

గీ. అతనితమ్ములు చిన్నతిమ్మాధిపతియు, నప్పలక్ష్మాతలేంద్రుండు నమరి రవని
హరిహరులలీల మాద్రేయులట్ల విష్ణు, శంఖచక్రయుగం బన జగమువొగడ.

గీ. తదనుసంభవుండ ధర్మార్థమర్మవి, చారచతురమతిఁ బ్రసన్నకీర్తి
చంద్రికావిధూతచరమాద్రికందరాం, తరఘనాంధకారతతిని గృతిని. ౪౬

* ఇందు క్రమము విలోమముగానున్నది.

క. రంగప్పరాజ వైష్ణవ, పుంగవపూజావిధానపూతాత్ముఁడ శ్రీ
రంగపతికి నొనరించెద, మాంగలికతరప్రచారమణిహారంబుల్. ౪౭

— షష్ఠ్యంతములు. —

క. శ్రీపతికిఁ జరణశరణగ, గోపతికిఁ ద్రయీవతంసకువలయమునకుఁ
క్ష్మాపతికిఁ బూర్ణిమాశశి, రూపతిరస్కరణనిపుణరుచిరాస్యునకున్. ౪౮

క. ఇక్ష్వాకువరదునకును ద, రక్ష్వసురరిపుస్తుతాభిరామునకును బుం
డ్రేక్షువిష్వాసనగురునకు, భిక్ష్వంతఃకరణసరణిబింబితరుచికిన్. ౪౯

క. శ్రీమంతునకును గావే, రీమధ్యద్వీపగృహికి ధృతగతమహికిన్
భీమోద్దామనిజాంశు, స్తోమస్తబకాస్తసకలసురతేజునకున్. ౫౦

క. కలికలుషవిషమషీహర, కలితలలితనిజగుణప్రకరవిధువునకున్
ఖలమాపావిలకోపా, తులఖేటాహిప్రతాపధూమాంకునకున్. ౫౧

క. సాత్యవతేయస్తుతునకు, సత్యవచఃప్రత్యయప్రసన్నాత్మునకున్
నిత్యానిత్యవివేక, స్నాత్యాయతపస్వినిధికి శమసేవధికిన్. ౫౨

క. ఆముక్తమాల్యదాకబ, రాముక్తప్రసవమాలికార్చితునకు స
త్యామానసవల్లభునకు, మామావాగ్గోపయువతిమానాహృతికిన్. ౫౩

క. యజ్ఞేశ్వరునకు నిఖిల, ప్రజ్ఞేశ్వరునకును నిగమపాటచ్చరదో
రాజ్ఞావజ్ఞాకరునకు, సుజ్ఞానిమనస్త్రికూటశుకరూపునకున్. ౫౪

క. చరణనతిశమితరాధా, తరుణీపరిణాహరోషతరణికి వినమ
న్నరతాపహరణచరణాం, బురుహచ్ఛత్రునకు నమితబుధగోత్రునకున్. ౫౫

క. శ్రీరంగరాజునకు ధృత, సారంగదినాధినాథచక్షూరుచికిం
గారణకారణమునకును, నీరధిగేహునకు నీలనిభదేహునకున్. ౫౬

సీ. అభివందనసహస్ర మమరించి నన్నయభట్టుమార్గము కొంత పరిఢవిల్లఁ
దిక్కనమఖిసూక్తిఫక్కిక యొకకొంత పెనుపొంద నెఱ్ఱనప్రెగడఫణితి
యొకకొంత తిలకింప నొకకొంత నాచనసోముగీర్విభవంబు సొగసుమీఱఁ
ద్రిపురాంతకునివచఃస్థేమంబు నొకకొంత కొఱల శ్రీనాథోక్తి కొంతనిగుడ
మఱియుఁ దక్కినసుకవుల మధురవచన, రచనలును గొంతరాణింప రసనిబంధ
బంధురముగాఁగ నేనిచ్చుభవ్యకావ్య, హారమునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

వ. అని సాంబోపాఖ్యానచంపూకావ్యంబు శ్రీరంగపతికి నంకితంబు గావించితిఁ
దత్కథానిగమవిధానంబునకు నోంకారంబుగాఁ బరీక్షిన్నరేంద్రుండు శుక
యోగీంద్రున కిట్లనియె. ౫౭

—కథాప్రారంభము—

గీ. సాధునతబుద్ధి హరికథాశ్రవణసిద్ధిఁ,దనివినొందకయున్నాఁడ ననిన మఱియుఁ
జిత్తమలరంగ నాపరీక్షిత్తుఁగాంచి, యూహ గొనసాఁగియాశుకయోగివలికె.

శా. శ్రీలక్ష్మికుచశాతకుంభకలశీశృంగారహారంబు ధా
త్రీలావణ్యసరోమరాళము శ్రుతిశ్రేణీరహస్యంబు గో
పాలత్వంబు వహించె శిష్టజనులం బాలింప దుష్టాసుర
వ్యాళప్రేక్షణతార్క్ష్యమూర్తి యగుచు న్బృందారుమందార మై. ౬౦

సీ. దేవకీవసుదేవపావనప్రాగ్జన్మసుకృతౌఘపుష్పలావికవరుండు
లాటనాకద్రుమూలంబున నంకూర్తి ప్రబలఁజేయుటయును బాహువిటప
శాలియై యంగుళిచ్ఛవిపల్లవశ్రీలఁ దగుపాంచజన్యసౌందర్యలక్ష్మి
నవిచి నాభీసరోవనజాతగుచ్ఛమై శ్రీవత్సషట్పదస్థితిఁ దనర్చి
చరణసింధుమరందనిష్యందధార, గాఁ గౌస్తుభఫలితమై కానఁదగిన
కృష్ణసంతాన మాభీరకిసలయోష్ఠి,పాల మను నందమందిరావాలపరిధి.౬౧

క. పూతనఁ గృతనిఖిలార్భక,శాతన మాయాభ్రపిహితశత్రుమహాప్ర
ద్యోతనఁ గంపితదివిష,చ్చేతనఁ గృష్ణుం డపూర్వచేతనఁ జేసెన్. ౬౨

క. శకటము నాసురకర్మ,ప్రకటము నిజఘోరఘోషభగ్నాభముజా
నికటముఁ గంసప్రియకృతి,నికటము వికటముగ విఱిచె నిసువతఁ డలుకన్.

గీ. గేలిం బయికొనుబలుసుర,గాలిం బటువిటపకేలిఁ గంపితనగనా
గాలి నకాలోదితలయు,కాలి న్వనమాలి తూలికాగతిఁ దూల్చెన్. ౬౪

క. ఆర్యకుఁ గవివర్ణితనిజ,చర్యకు గుణధుర్య కవనిసమధైర్య కురు
సైర్యకు నందునిభార్యా,వర్యకు జగ మతఁడు వదనవనధిం జూపెన్. ౬౫

సీ. ఈబిడ్డనిపదాబ్జ మీశానకోటీరహీరకోరకమైన యేటఁ గనియె
నీపసిబాలకుఁ డిసుమంతనునుబొజ్జ ముజ్జగంబుల నొక్కమూల దాఁచె
నీడింభకునినాభి నింతకుఁ దాతయౌ ధాత నీనినతెల్లదమ్మి పుట్టె
నీపాపనికిఁ గన్ను లై పెంపువడసిన రవిచంద్రు లుత్తమగ్రహము లైరి
యని యదుపురోహితుం డైన ఘనుఁడు గర్గుఁ
డెఱుక సేయంగ మందకు నెఱుకపఱిచె
నందనందనుఁ డైనగోవిందుఁ డఖిల
వేదములు గానలేని నిజోదయంబు. ౬౬

క. సీరికి నాశ్రితభయపరి, హారికి హారికిఁ బదానతారికి వినమ
త్సూరికి నంద వ్రజసం,చారికి నత్యుజ్జ్వల ప్రచారికిఁ దద్వేకిన్. ౧౭

క. హరివంశుఁ డయ్యెఁ గావున, హరి తెఱఁగున నఖిలజనులు నానతు లై రా
హరిసీరులకును నోర్వని, హరిహయరిపులిండ్ల మొలచు హరితతృణంబుల్.

మ. పెరుఁగు న్వెన్నలుఁ బాలు నేతులును దృప్తిం బొందఁగాఁ గ్రోలి బి
ట్టరుగు న్వేఱు గృహాంతరంబులకుఁ జంద్రాస్య ల్గదుర్ దూఱినం
బెరుఁగుం గల్లకు నోర్వనట్టికరణిం బెంప్రోవఁ దప్పించి వే
తిరుగున్ దుర్గమ మైనమార్గమున నిందీభర్త ధూర్తోద్ధతిన్. ౧౯

సీ. కమ్మఁగెమ్మోవికి గమకించు గమకించి కినిసి జంకింప గ్రుక్కిళ్లు మ్రింగు
నురుకుచాద్రుల నంట నూహించు నూహించి క్రేళ్లుమలంగిన డిల్లపోవు
ముద్దుఁజెక్కులు నొక్క ఖద్దించు ఖద్దించి తారసింపమిఁ దహతహఁ జలించు
జఘనంబుఁ బైకొన సమకట్టు సమకట్టి చేయూఁక తారినఁ జిన్నవోవుఁ
దలఁపుగలిగియుఁగులశీలములకులొంగి,వలవమినటించునాభీరవనజముఖులఁ
జేరి హరి చిట్టకంబులు సేయునపుడు,దిట్టతన మప్పటికి గడిదేఱకునికి. ౨౦

క. హారములు తాన దొంగిలి, హారాపహుఁ గంటి వీఁడె యని వే ఱొకనిన్
వారిజవదనలకడ నిడి, వారికి వారికిని శౌరి వాదొనరించున్. ౨౧

క. భామలకొప్పుల మైనపుఁ,బాముల నిడి హరు వెఱచి పరువిడఁ గృష్ణుం
డేమియు లేదని వెస న, ప్పాములఁగనుమూపి యభయపాణి యొసంగున్.

క. జలకంబులాడు చెలువల, వలువలు హరియించి నన్నువలె నైతిరి యో
కలకంఠులార యని హరి, కలకల నగు బొజ్జగదల గంటలు వొదలన్. ౨౩

చ. జలదళవాయుభక్షు లయి శాంతియు దాంతియుఁ బూని కానల
న్నిలిచి భజించుబోధరమణీయులు చుట్టెడు ధ్యానరజ్జుల
న్నిలువక జాఱి జాఱి చను నిర్గుణుఁ డౌర యశోదచే నులూ
ఖలమునఁ గట్టఁగాఁ బడియెఁ గల్గనె మేర ప్రభుత్వశాలికిన్. ౨౪

చ. పరమజ్ఞానిహృదంతరాళమణిదీపంబుల్ నమన్నాగకి
న్నరనక్తంచరనాకనాయకశిరోనాళీకరాగ ప్రభాం
కురనీరాజితము ల్నిజాంఘ్రితలము ల్గోపాలబాలుండు ని
ల్పె రటద్గోఖురధూళిధోరణుల నాబృందావనక్షోణులన్. ౨౫

మత్సముఁ గన ననుదానవ,వత్సము జగదంతర ప్రవర్ధితహింసా
కుత్సముఁ గఠినోపలదృఢ,వత్సము శ్రీవత్సధరుఁడు వ్రాల్చెం బెల్చన్. ౭౬

అసురమన్మథతాడితుండగుచుఁగృష్ణు, ముష్టికినిజీవధనమిచ్చిమోహియయ్యె
నహహ స్త్రీలింగమాత్రమే యంతచేసెఁ, గేవలస్త్రీమహిమవితర్కింపనేల.

చంచువిదళితభువనప్రపంచమైన,క్రౌంచముఁబయోదవర్ణుండు చించియొప్పె
నహివిభూషణనారాయణాస్త్రధార, త్రిపురసౌధతలమ్ము భేదించినట్లు. ౭౮

మానసౌకములీల మలయు యోగీశ్వరమానసమానసమందిరంబు
కీరంబుకై వడిఁ గెరలు వేదాంతసంకేతపంజరవసతీరభర్త
పికముచందంబునఁ బ్రేలు నిర్జరవరానీకపల్లవితామ్రకోకిలంబు
మొకరితేఁటియుఁబోలె మొరయు దుగ్ధాంభోధికన్యకావదనపంకజమదాళి
ప్రేమబలరాముఁడనుపూర్ణసోమురాకఁ, గూరిమివహించు గోపచకోరకంబు
ద్విజవినోదంబు చూపుట తేజమతని, కాచరితసద్విజానందుఁ డగుటకతన.

సహజజ్ఞాననిధానసాధుజనయజ్ఞక్షోణులందు న్హవి
ర్గ్రహణంబుం బొనరించుకృష్ణునకు సౌఖ్యంబిచ్చు రాధాముహు
ర్ముహురుద్గారితభావరాగరససమ్మూర్ఛత్కటాక్షేక్షణ
స్పృహ చల్దుల్భుజియించుచో రుచులు దేర్చెం గాన నక్కాననలోన్. ౮౦

ప్రజ గరము సంతసిల్లఁగ, నజగరము నశేషలోకహారణగుణోద్య
న్నిజగరము నిర్దళించె, న్భుజగారిధ్వజుఁడు విబుధబుధసన్నుతుఁడై. ౮౧

కాళియఫణిఫణఫలకో, త్తాలమణిస్థగితరంగతలనర్తనలీ
లాలసితమున యశోదా,బాలకుఁడు వినమ్రలోకపాలకుఁ డమరెన్. ౮౨

కాళియాహిస్ఫటోపలఘట్టవీథిఁ, బంచతాళప్రబంధప్రపంచమెట్లు
గానియొనొక్కొ శిరీషాగ్రకోమలంబు,లడుగుఁదమ్ములుదనుకునందార్భకుండు.

కలిగి తిన శౌరి తాళీ, ఫలసహితం బహితగర్దభదనుజదాయా
దులతల లిలపయి రాలిచె, బలయుతులకుఁ జేయరాని పనియుం గలదే.

కల మయ్యు మేటియేకల మయ్యు విలయాబ్ధిఁ గ్రీడింప నేర్చినజాడవాని
ధన మయ్యు మోక్షసాధన మయ్యు నిజభక్తజనములఁబోషింపఁజాలువాని
సవ మయ్యు విధులతాసవ మయ్యు యాయజూకాచారఫలదాతయైనవాని
ఘనమయ్యుసూక్ష్మాపఘనమయ్యునలరునెయ్యదియామహిమతానయైనవాని

వాసుదేవుఁ బదానతవారిదేవు, నసదుగాఁ జూచి వత్సాపహరణ మజుఁడు
చేసియూరకతనుదానమోసపోయెఁ, దఱచి వెఱపింపఁగాఁబోయి వెఱచినట్లు.

మ. నలముం బోలెఁ జరాచరాకృతులఁ బూనం బైపడం జేసెఁ గా
నల మున్నిట్టిది గానఁ బోల దని మంద ల్గొందలింపన్ దవా
నలముం గ్రోలె నఘాసురాంతకుఁడు లోనం గ్కార్యవిశ్వంబు పై
నలము న్నాక య దట్టి*లేల యగు ధర్మాయత్తసద్వృత్తముల్. ౨౬

పృథ్వి. చలంబు ప్రబలంబుగాఁ జటులవిక్రమాలంబునిం
బ్రలంబు హలపాణి పాల్పడ నొనర్చె నానామరు
త్ఫలంబు విరిసోన పైఁ గురియఁ దన్మరందాంబుపం
కిలం బగునిజాకృతిం గృతకబాలుఁ డొప్పుం గడున్. ౨౭

చ. పల్లవవల్లభుండు చెలువల్ జలమాడఁగ దత్తటీతటీ
పల్లవముల్ హరించి తనుఁ బ్రార్థనచేసిన నీక నవ్వ, నా
పల్లతికాలవిత్ర మయి పాండవపత్నికి నెట్టు లిచ్చెనో
చుల్లరవెట్టు ప్రల్లదపుజూదరి సిగ్గువడం బటావలుల్. ౨౮

సీ. శమనసహోదరీసలిలకేళికఁ దేలి కలశాబ్ధినీఁదుపోకడలు మఱచెఁ
దోడిబాలుర నెక్కియాడువేడుకఁ గూడి గరుడాధిరోహణోత్కంఠ మఱచె
నలుచుట్టు నాలమందలుగ్రమ్ముకొనియున్కి జగము లొనర్చునోలగము మఱచె
రాధాపరీరంభరసపరవశుఁ డౌట మరుఁగన్నతల్లిపై మమత మఱచె
మఱచుఁగా కేమి దొరలకు మఱపు లేదె
మఱవఁ డొకటియు యామేటిమాయలాఁడు
కాందిశీకాశ్రితానేకగాఢశోక -
పరిహరణపౌరుషారంభపాటవంబు. ౨౯

గీ. మంద గొందల మందఁ బురందరుండు, ఱాల బలువాన గురియఁ గరాళలీల
నడరిగోవర్ధననగంబుగిడుగుచేసె, మడుఁగుచూలాలియడుగుపెన్మాయవడుగు.

సీ. పసిగాపుఁబూఁబోండ్లపాలిండ్లపంచలు మరగెఁబో వేదాంతమందిరుండు
మఱుఁగంగఁ గ్రాఁగినతఱిపియావులపాలఁ దనిసెఁబో హవిరన్నతర్పితుండు
వ్రేలులీలనొనర్చువేణునాదములకు మోహించెఁబో జగన్మోహనుండు
ధేనుసాంగత్యవిధేయుఁడై దినములు గడపెఁబో ముక్తసంగస్పృహుండు

* నలముంగానకదట్టు- మూ.

విప్రభార్యల నార్యల వేఁడి కనిన, భోజ్యముల నారగించెఁబో పూర్ణకాముఁ
డాగరుఁజిగురాకుసెజ్జలనొత్తగిల్లి, ప్రోదివహియించెఁబోయాదిభోగిశాయి.

మ. స్థిరవంశోద్భవ మై మహావివరి యై చేపట్టఁగా యోగ్య మై
పరితఃపర్వసమగ్ర మై నిజముఖప్రాదుర్భవద్రాగ మై
పరమాప్తుండనుబోనివంశలత సంభావించె ఘోషాంగనా
స్మరదాహౌషధి యా నిజాధరముచేఁ జక్రాయుధుం డాక్రియన్. ౯౨

వ. చిత్తజగురుం డాభీరమత్తకాశినుల చిత్తంబులు నిజాయత్తంబు లగుట
యెఱింగి యామెఱుంగుఁబోడుల తెఱం గఖిలంబును సఫలంబు చేయం గ
డంగి బెడంగుమెఱసి సరసచతుర్విధశృంగారాంగీకారమనోహరాకారుం డై
తోరంపుసజ్జకంపుపూవునీటి యేటిక్రీయాటల చలువఁజెలువంబులగు పరు
వంపు మరువంపుఁబొదలఁ బొదలు ప్రాచీనంబుల గోచరితలోచనోత్సవం బై
సమర్పితదర్పసారగంధధురంధరంబులును... నైనయతిసౌరభకుంజపుంజం
బుల నుదంచితం బై పంచమస్వరప్రపంచవంచిత వియచ్చరచమరవాలక
చానిచయ గేయంబులగు కోకిలనికాయంబులకు నావాసంబు లై మాసరం
బు లైన కురవకతరువకులకులంబుల దలం బై శంబరవిమతవిజయతోరణ
మాలికాడంబరవశంవదంబు లగు నసమశరతురగపరికరంబు కోలాహలం
బుల నాచరితవిరహిణీహృదయహాలాహలంబు లైన నిస్తులగోస్తనీకాయ
మానంబులఁ బ్రస్తుతం బై పున్నమరేయునుం బోలె నతిశీతలచంద్రకాం
తంబును నక్షత్రవీథియునుం బోలె నదూష్యపుష్యరాగంబును బలవిరోధి
కరస్థలంబునుం బోలె నుజ్జృంభితవజ్రంబును వసంతసమయంబునుం బోలె
నుదీర్ణప్రవాళజాలంబును, రఘుపతిసైన్యంబునుంబోలె నుత్తాలనీలప్రకాశ
ప్రకంపితంబును మేరుకుధరంబునుంబోలె భూరివిభవభాసమానంబును నైన
యొక్క కృతకకుధరకందరామందిరప్రఘాణంబున సుఖావహం బగు పచ్చ
లం గట్టిన కుట్టిమస్థలంబున ననల్పకల్పతరుచ్ఛాయామండలమధ్యంబున
నభంగురత్రిభంగిసౌభాగ్యం బొనగూడఁ బ్రోడతనంబు మెఱసి పరస్పరపల్ల
వితపురాణస్థాణువగు వేణువుపూరించుటయు నాచల్లగాడ్పునం గ్రేళ్లుదాఁటి
పాళికి హాళికింబడి మాళవికి ప్రేళ విరిసి లలితకుఁ గళితనీవిక లై రామక్రి
యకుఁ బ్రేమక్రియ నెఱపి బహుళికిం దహతహ నెరపి వరాళి విరాళిగొని
మహాయోగినీజనంబునుం బోలెఁ బరిత్యక్తేతరవిషయవ్యాపారంబుగ ఘో

ప యోషిత్సమూహంబు సమూహంబుగాఁ బఱతెంచి యుదంచితంబు లగు నఖరరత్నకిరణ కిసలయంబులు చరణాంబుజ హంసక చంచుపుట రుచినిచయంబులపగిదిఁ జిగురుకొనఁ గనకకఙ్కణకార కేసర పిశంగం బగు మెఱుంగుటొల్లియ యుత్ఫుల్లనాభినళినగళితపరాగపటలంబుబటువునఁ గటితటిసంఘటిల్ల నుల్లక్షిత శ్రీవత్సమేఘంబును నుదారకౌస్తుభగభస్తిమాలియు నగు నురస్స్థలనభఃస్థలంబున నతిస్థూలవిమలముక్తాఫలలలంతికాసంతానంబు మందాకినీసౌందర్యంబు నందింప దరహాసుధాసారనిలయంబగు వదనవలయంబునం గాఁపురంబున్న కైరవగృహమేధులుంబోలె విమలవిశాలవిలోచనంబు లనుగ్రహాతిథ్యంబున భక్తజననిగ్రహంబును బరిహరింప వలరాజు బలిగృహమహీతలంబులు మొదలగెలిచి పిదప సురపురంబుగుఱిసేసి తలవింటనంటించి తెగనిండఁ దిగిచిన కలువపువ్వు ములికియునుం బోలె నదభ్రవిభ్రమ విరాజిత భ్రూయుగమధ్య సంధానిత మార్గమదోర్ధ్వపుండ్రంబు దీండ్రింపఁ గరంచి పోసిన సునాసీరశరాసనంబు నీలశైలశిరోభాగంబున ఘనీభవించు మించునం బింబంబు గొంచెంబుగాని డాలున మాళి ప్రమోదంబున భాసిల్ల శ్రుతిజనకంబగు నాసాముకుళంబునం బొడమిన ప్రణవంబునుం బోలె ముక్కుఱముత్తియం బక్కుఱపఱుప నవలావణ్యసుధాజలధిఁ దలచూపు మకరశిశువులపసిమిగల చిలుకతెక్కలకు మక్కువదెలుపు కిరీటిపచ్చలపొంగళ్లు చెక్కిళ్లఁ జెలంగఁ గంకణక్రేంకారభ్రమరఝంకారసంకులంబును దరుణాధరారుణ్యప్రవాళ లావణ్యలలితంబు ను నంగరాగపరాగపరభాగశోభితంబును బుజాభుజావిటపపటుతరంబు నైన దివ్యవిగ్రహంబు భావికాలంబున నవనికి నవతరింపఁగల పారిజాతంబురీతి సత్యభామా ప్రియకరం బై చెన్నొందంగ నున్నయవ్వెన్నునిం గదిసి వివిధవిలాసంబులు పచరించి రప్పుడు. ౯౩

క. జలనిధిశయనుం డొకసతి, యలకావళిఁ బెడమరల్చి యధరము గ్రోలెన్
వలరాచయాఁకమామిడి, సెలగొమ్మను బండుఁగ్రోలు చిలుకయు పోలెన్. ౯౪

క. లలితకుచకుట్మలోదయ, కలిత నొకపురంధ్రి నతఁడు కౌఁగిటఁ జేర్చెన్
వలిదమ్మిపువ్వుమొగ్గలు, గలనలినిం బొదువు నసితకలహంస మనన్. ౯౫

క. సరసీసరోజరేణూ, త్కరములచేఁ గప్పఁబడిన కలభము వోలెన్
హరి యొకసతిచనుమిట్టల, నెరసిన గందవొడి తనదునెమ్మే నంటన్. ౯౬

గీ. అపరపక్షంబు చంద్రునియందు నంత, కంతకును గాళిమము దెచ్చునట్లపోలెఁ
గృష్ణుఁడొకయింతిచెక్కులఁగీలుకొలిపెఁ, జిత్రతరనూత్నమృగమదపత్రలతలు.

గీ. శ్యామలాంగి నొక్కకామినిఁ గృష్ణుండు, ప్రిదిలిసనక పట్టి పెనఁగు టొప్పె
జంభవిమతనీలశకలమ్ము దూర్వాద,ళమ్ముఁ గమిచి విడనిలాగు వోడము. ౯౮

క. భృంగము లతికామధువున, నంగము దడియంగఁ జేయుననువున నొకఘో
షాంగనమైఁ జెమరునఁ దోఁ,గెం గుహనామనుజమూర్తి కేళీపరుఁడై.

క. నవనఖపదముకుళము లొక, ధవళేక్షణమేన నునిచెఁ దామరసాక్షుం
డు విపినలక్ష్మికి మాధవుఁ, డవిరళగతిఁ గింశుకములు హత్తించు క్రియన్.

క. వెన్నునినఖరేఖం దగు, వెన్నున నొకనీలనీలవేణిక దనరెన్
మిన్నున డాసినసురచా,పోన్నతి నుతివడయు వర్షయోయిది యనఁగన్.

సీ. పడఁతులఁ గుదియించి పైచేలఁ రాఁ దివ్వ నలయికఁ బొందె వస్త్రాపహారి
కలయిక నలయు నింతులయూర్పు వడఁగసుగందె వాత్యాదైత్యఘాతుకుండు
పొలఁతులు దక్కింపఁ బొడము వియోగాగ్నిఁ గ్రాఁగె దావానలగ్రాసకాంక్షి
మోహినీస్తనచక్రములకు లోనై చిక్కె విఘటితానశ్చక్రవిక్రముండు
వనిత లధరామృతౌఘసర్వస్వమెడరు, వేచి కొనిపోవనగుచుండె వెన్నముచ్చు
భోగమునఁ గాని యూరకపోవ దహహ, ధరణినరులాచరించు చేఁతలఫలంబు.

మ. భవపద్మప్రభవాదిభాగవతులు న్భావింపఁగారాని నై
భవ మాభీరకురంగలోచనలతో భాషించుచు న్నవ్వుచుం
గవయం గోరుచు మోవితేనియల కాకాంక్షించుచు న్లోచనో
త్సవము ల్సేయుచునుండెఁ దత్సుకృతము ల్చర్చింపఁగా శక్యమే. ౧౦౩

శా. ఆబృందావనవీథికావిహరణం బావాంశికావాదనం
బాబంధుప్రియకార్యనిర్వహణ మాహంసోద్భవాఖేలనం
బాబిబ్బోకవతీసతీక్షణతరనేత్రాగ్రప్రసూనార్చనం
బాబాల్యోచితచర్య లీశ్వరునకాహా యెంత యిష్టంబులే! ౧౦౪

వ. ఇట్లు శరత్సమయసముదితం బగుపున్నమవడురేయి వెన్నుండు వివిధరూపంబులం జూపట్టి రాసక్రీడావిశేషంబున నశేషభువనమోహనుండై బృందావనంబు నిజచరణారవిందవిన్యాసపావనంబుగఁ జేయుచుండె వెండియు నవ్విభుండు. ౧౦౫

క. పాపమతి నందుఁ బొదివిన, యాపెనుఁబామును నఘారి యటుసేయఁడయే
నాపగఁ దీర్పఁగఁ దలపై,నాపగ గలయతఁడు నోపునా మఱి యవలన్.

శా. ఆవిద్యాధరశాపమోచకుఁడు బృందారణ్యమార్గంబునం
బూవుంబోఁడుల నాహరించి చను నల్వు న్గుహ్యకుం గిట్టి త
జ్జీవగ్రాహపురస్సరంబుగ హరించె న్మౌళిమాణిక్య మే
త్రోవన్ దుష్టవిమర్ది యైనదొరఁ జెందు న్భద్ర మచ్ఛిద్ర మై. ౧౦౭

సీ. మీన మై వివిధాపదాన మై మునుమిన్కు తెరువాటుకాని రోధించి త్రుంచి
కూర్మ మై పాలితధర్మ మై యమృతంబుఁ బుట్టించి వేల్పులఁ బొంకపఱిచి
కోల మై యుద్వేలలీల మై విలయాబ్ధి యసురునఁ గ్రుంగినపుడమి యెత్తి
సింహ మై రోషాగ్రరంహ మై సై తేయపట్టబద్ధునిఁగిట్టి పొట్టచీరి
వామనంబును నతసుధా జేమనంబు, నై నరూపున నడుగింట నవనిఁ గొల్చి
యలరె నేదివ్యతరతేజ మామహంబు, కేశిమాయాపయోరాశి గెల్చుటరుదె.

సీ. శేషమస్తకమణుల్చిందువందుగఁ జేయులీలమై ముంగాల నేల ద్రవ్వఁ
గెరలి మూఁపురము నిక్కించి రపీందునక్షత్రలోకంబు లొక్కటగ నెత్తు
వెస ఖణిల్లని అంకె వేసి కల్పాంతసంవలదశనశ్రేణి మొలవఁబెట్టఁ
దోఁక యల్లార్చి వాతూలంబు లేడింటిఁ బిలిపించిదిక్కులు గెలువఁబనుచుఁ
జూపు లడరించి కాలాగ్నికోపు లెత్తు, మేటికొమ్ముల బలుమేని తీఁటవాపి
శింశుమారంబునలరంగఁజేయునట్టి, కడిఁదియాఁబోతుఁజుఱవుచ్చెఁగైటభారి.

క. అలశంఖచూడుతలమణి, తలగొని మణిఘటితభోగతతిఁ గలశేషుం
దలపించు రోహిణీసుతుఁ, గలసి తిరుగు హరి సగంధకస్తూరిక్రియన్. ౧౧౦

—రామకృష్ణుల మథురాపురగమనము.—

క. అక్రూరుం డరుదెంచెం, జక్రిం గొనిపోవఁ గంసజనపతిసభ కా
చక్రి కటఁ గలుగు శాత్రవ, చక్రేశ్వరజీవపవనచయచర్వణముల్. ౧౧౧

క. మథురాపట్టణమునకు, న్మధురాకాచంద్రనిభులు మాధవసీరుల్
మథురాకృతు లై చనుటయు, మధురాగానక్తహృదయమధుకరలీలన్.

వ. సమస్తజనంబులు మనంబునం బొదలుమదంబునం బొదలి గంధసారకాల
స్కంధద్రుమంబులు నుం గైలాసనీలశైలశిఖరంబులు నుం గర్పూరకస్తూరి
కారాసులును గంగాకాళిందీతరంగంబులును గైరవేందీవరకళికావిర్భావం
బులుం గా నాగోపార్భకులం దలంచిరందు, మఱియును. ౧౧౩

సీ. పరివాదినీలత ల్పలికించి పలికించి * చిలుకకుఁ బద్యంబుఁ జెప్పి చెప్పి
వలరాచరేఖలు వ్రాయించి వ్రాయించి గోస్తనీస్తబకముల్ గ్రుచ్చిగ్రుచ్చి

* పలికించి పలికించి-మూ.

విరులదండలు గట్టఁ బరికించి పరికించి గందాఁ గస్తూరి కలిపి కలిపి
లీలఁ జిత్తరువులు లిఖియించి లిఖియించి యలరఁదీవలకు నీరార్చి యార్చి
మదనశాస్త్రరహస్యము ల్చదివి చదివి
యనుఁగుగమిఁ గూడి యేకాంత మాడి యాడి
విడిచి వచ్చిరి బలకృష్ణవీక్షణాధి
కాంక్ష మధురాపురములోనికాంత లెల్ల. ౧౧౪

గీ. జలదపదవినుండి ఝంఝూనిలాహతి, వ్రాలుచంద్రరేఖవోలె నోర్తు
కప్పువేల్పుఁ జూడ దెప్పరంబునఁ బోవ, మూల వీడి రాలె మొగలిరేకు.

గీ. సామిఘటితహారదామంబు తనయంఘ్రి, యుంగుటమునఁ జేర నోర్తు జరిగె
మదనపట్టదంతి మదమెత్తి బలువెండి,సరిపణిని బెకల్చి చనువిధమున. ౧౧౬

శా. శ్రీదక్షోత్త మొగంబున న్నొసలిపైఁ జెల్వారఁ గస్తూరికా
శాదారోపము కీలుగం టురిలి పశ్చాద్భాగముం గప్పికోఁ
గా దంతావళయాన యొక్కతె హరిం గన్గోఁ జనుం జంద్రమః
పాదగ్రాసలసద్విధుంతుదనభఃపద్యాసమద్యోతయై. ౧౧౭

చ. అనుపమభక్తితోఁ జిగురుటాకులఁ గప్పి లతాంతమంజరుల్
కనకకటార శాటికను గానుక యీఁ జనుదెంచులీల నొ
క్కనలిననేత్ర వచ్చె వలిగబ్బిచనుంగవఁ గేలనూఁది య
ల్లనఁ దను మీఱిపోవు నబలాజనముం బలుమాఱు దూఱుచున్. ౧౧౮

సీ. అఱజాఱునెఱివేణికటిపాఁపకొమ్మకు వెడలుగ్రుడ్లు వోలె విరులు రాల
నమృతార్ద్రశశిమీఁదనడరుచిహ్నమురీతిఁ జెమటమోమునఁబత్రకములు నెరయ
ముఖపద్మదళమున మొకరితేఁటి నటించుసూటి వాతెఱఁ బలుసోఁకు దనరఁ
గ్రొక్కారునిల నింద్రగోపంబు లెలసినగతి మేన నవనఖాంకములు వొడమఁ
గోరికకుమున్న మనసు దాఁకొనఁగ మనసు
కంటెఁ దహతహ పెన్నాటకముగ నోర్తు
దర్పకరణాంతతాంత మాతనువు నులియ
వేడుక నఘాసురారాతిఁ జూడవచ్చె. ౧౧౯

సీ. పురుటింటిలోఁ గ్రోలెఁ బూతనాస్తన్యంబు ప్రతిపాకముగఁ బ్రాణపంచకంబు
శైశవోచిత మైన చరణాభినయమున నెఱిచూపి బలుబండి విఱుగఁ దన్నెఁ
గనికరం బెడలి ప్రేఁకన రాఁగ మెడ నెక్కి యసువులు గ్రక్కించె ననిలధనుజుఁ

గటిభాగవలదులూఖలసామజముఁ గొల్చి యవనిఁ జాఁగిలఁ జేసె నర్జునములఁ
గేళిఁ గాళింది వెడలించెఁ గాళియాహి, గోపికామానధనములు గొల్లలాడె
నిష్ఠురదవాగ్ని పారణ నైష్ఠికునకు, నీబలానుజునకు నెవ్వ రీడు పుడమి. ౧౨౧

క. అస్మద్భాగ్యోన్నతిఁ గలి, ఘస్మరుఁ బొడగంటి మనుచుఁ గలకంఠులు శా
తస్మరశరతాడిత లై, విస్మితమతు లైరి వివిధవిలసనములతోన్. ౧౨౨

సీ. సప్రాణముగ రాచచాకిచేఁ గైకొన్న పటవిశేషములు సిబ్బములు గాఁగ
వాయకదత్తభూషాయోజితేంద్రనీలములు దానార్ద్రభృంగములు గాఁగ
నాసుదాముని పువ్వులందలిపుప్పొడి గమియు ధరాపరాగంబు గాఁగఁ
గుబ్జాసమర్పితకుంకుమామోదసంపద మదగంధవిభవము గాఁగ
నుఱక బృందావనంబుననుండి వచ్చె, రామకేశవనామకసామజములు
కంసమానసముద్విగ్నగతిఁ గలంగఁ, జొచ్చి క్రీడించు టెంతయుఁ జోద్యమయ్యె.

మత్తకోకిల. యాగభోక్తయు ధర్మవక్తయు నైనదేవుఁ డొనర్చె నే
యాగధర్మవిభంజనం బది యద్భుతక్రమమంచు నా
నాగతుల్ దివినుండి పల్కఁగ యాదవాధిపుఁ డాధను
ర్యాగముం దెరలించె వంచకు లైనక్రించులు బెగ్గిలన్. ౧౨౩

సీ. ఇవి పాదములు గావు భువి నాల్గుచెఱఁగులఁ గీలుకొల్పిన యెల్లకంబాలు గాని
యిది వాలవల్లి గా దిల మోవలేక రూపాంతరం బైనశేషాహి గాని
యివి దంతములు గా వహితఖాదన మొనర్చు చిరరోషశమనదంష్ట్రికలు గాని
యివి కుంభములు గావు వివిధాద్రిసంతతి యెలసి వర్ధిలు పుట్టినిండ్లు గాని
బృంహితమ్ములు గా వివి పృథులవిలయ, దీర్ఘనిర్ఘాతఘోషోపదేష్ట లైన
గురువరులుగానియన నెదుర్కొని పెనంగు, కువలయాపీడకరిహరిగూల్చెటొప్పు.

క. ఆకరిదంతము మూఁపునఁ, గైకొని శ్రీకృష్ణుఁ డమరుఁ గంసచ్యుతి కై
తూకొన్న శ్వేతధనువుం, జేకొన్నసభంబు కరణిఁ జిరవిక్రముఁ డై. ౧౨౪

మ. ప్రకటక్రోధవిధేయబుద్ధు లగుచు న్రాముండుఁ గృష్ణుండు ము
ష్టికచాణూరుల గీటడంచి దివిషచ్చిత్తంబు లానందకం
చుకముం బూన్చిరి ద్వాపరంబు గలిఁ* బ్రక్షోభంబు నొందించి ధ
ర్మకలాపంబుఁ బాదల్చు బోధమతుల న్రాణించుచందంబునన్. ౧౨౫

చ. మణిమయ మున్నతంబు నగు మంచక మెక్కి వెలుంగుభోజరా
ణ్మణిఁ గబళించె యాదవకుమారకుభూరిభుజంబు తన్నభో

* గతి- మూ.

మణిఁ గని క్రుంగు రాహుగ్రస్తంబున నాగ్రహణంబువేళ వాః
కణములఁ దీర్ఘమూర్ఛ రిపుకాంతలకన్ను లనంజనస్థితిన్. ౧౨౭

క. తనుఁ దలఁచినవారలబా, ధనముల విడఁజేయుచక్రి తలిదండ్రులబం
ధనములఁ దలఁగుట చిత్రమె, జనులకుఁ బుత్రోదయంబు సౌఖ్యదము గదే.

చ. నడుఁకక కంసుకారణమునం దనుఁబొందినశోకవహ్నితుం
దుడు కపు డుగ్రసేనుఁ డవధూతము చేసె మృగేంద్రపీఠికిం
దోడ వయి రత్నకుంభభృతతోయముచే నభిషేకమాడి ప్రాఁ
దోడుసులు మాన కే లుడుగుఁ దోయజనాభునికూర్చువారికిన్. ౧౨౯

మ. చటులాటోపముతో నెదిర్చినజరాసంధప్రవృద్ధధ్వజి
న్యటవిం గ్రోధదవాగ్నిచే నడఁచెఁ గంసారాతి తద్ధూమ ము
త్కటమై యుప్పతుఁ బర్వెడిం జలదసంఘం బై తదంగారక
చ్ఛట లౌఁ గావొ తటిల్లతాముకుళముల్ జాంబూనదస్నిగ్ధముల్. ౧౩౦

సీ. వైకుంఠగృహమేధి వటువె గర్గప్రోక్తమంత్రమార్గాయతమాణవకత
నిగమనిశ్వాసుండు నేరిచె సాందీపునొద్ద శ్రుతిప్రకాండోత్కరంబు
లస్తంగతజగత్త్రయపునర్వినిర్మాత జరగినగురుపుత్రు మరలఁ దెచ్చెఁ
గాలస్వరూపుఁడై గమనించు జంఘాలుఁ డలయవనుండు వెన్నాడఁ బఱచెఁ
గూర్చు బ్రహ్మాదులను మేలుకొల్పుబోధ, జాలిము చికుందునొక్కని మేలుకొల్పె
నితని లెవ్వారుఁ దెలియంగ నెంతవారు, తాన తెలియునుదనచర్యదానవారి.

వ. ఇట్లు దుష్టనిగ్రహశిష్టప్రతిపాలనపర్యాయపరిబృంహితజగత్త్రయకళ్యాణుం
డగుకలశజలనిధిశయనునకు నాదివిష్ణునకు వైకుంఠపురంబునుంబోలె ద్వార
కానగరం బధిష్ఠానం బయ్యె నెట్టి దనిన. ౧౩౨

— ద్వారకాపురవర్ణనము. —

ఉ. ద్వారక యొప్పు నిప్పుడమి వారక తారకవాదివల్లరీ
కోరక సౌధపోషితచకోరక దర్శనకాంక్షిభక్తని
స్తారక తారకాంతిసముదాయమయోదయరత్నకీలిత
ద్వారకవాటకుడ్యగృహవారక శ్రీరకథానిధాన మై. ౧౩౩

సీ. అబ్ధితోఁ జెలికార మంది మైనాకంబు రచియించె నిజపక్షరక్షణంబు
మహిధేనువత్సమై మహిమహౌషధితతిచే వైన్యు నలరించె శీతశిఖరి

కలశపాథోరాశి గిలకొట్టి యమృతంబు బృందారకుల కిచ్చె మందరంబు
రాజమౌళికిని విల్లై జయం బొదవించెఁ బసిమి దప్పకయుండఁ బసిఁడికొండ

కొండ నై యుండియును వృథా యుండ నేల
నేలప్రోయాలిమగవారిప్రోలు చుట్టి
వాసి వహియింతు నని యున్న వలయనగము
కరణిఁ జూపట్టు ద్వారకాపురము కోట. ౧౩౪

గీ. సరసజలకేళిలాలసామరపురంధ్రి, కఠినవక్షోరుహస్రస్తగంధసార
మిళితసురసింధుఫేనంబు లలమికొనఁగ, వలదుసున్నంబు కోటకొమ్మలకు వీట.

మ. అరవిందాక్షు నివాసమండలము తారాధీశబింబంబు ది
క్పరిపూర్ణం బగు తత్ప్రభోత్కర మదభ్రజ్యోత్స్న పర్యంతమం
దిరము ల్చుక్కలు వారిరాశి గగనోద్దేశంబుగా నప్పురిం
బరిధిశ్రీఁ బరిఖాలవాల మమరుం బ్రత్యగ్రజాగ్రద్రుచిన్. ౧౩౬

మ. సమదేభేంద్రకఠోరకుంభములతో సయ్యాటము ల్చూపు న
బ్జముఖీపీనపయోధరంబులు గలంపం దోన తల్లిప్తకుం
కుమ మవ్వీటి యగడ్తనీటికి నొసంగుం బంకిలత్వంబు ని
త్యముఁ బానార్థ్యలఘుప్రచారులకు నన్యాక్షేపము ల్గల్గవే. ౧౩౭

క. అప్పురము పుడమిపడఁతికిఁ, గప్పురమొదవించు మేనికలపంబులకున్
గొప్ప లగు వెలఁదిసున్నపు, టుప్పరిగల నుప్పతిలుసుధోజ్జ్వలరుచులన్.

మ. తనయంశంబున నుద్భవిల్లిన యశోదానందనజ్యేష్ఠుఁ గాం
చి నిజోర్వీభర మస్మహామహలు భుజాసీమం బ్రతిష్ఠించి చు
ల్కన వర్తింతు నటంచు శేషుఁ డురుభోగశ్రేణి నిక్కించెనో
యన నొప్పుం బురి రత్నకుంభయుతరమ్యస్నిగ్ధ హర్మ్యావళుల్. ౧౩౯

మ. తలుపు ల్గప్పుట విప్పుటల్ నయనము ల్దల్గా వఘూపాలరే
ఖలు చూడాశశిలక్ష్మిగా నవసుధాగౌరద్యుతుల్ భూతిపూఁ
తలుగాఁ దద్భవనేశ్వరావళి కృతార్థత్వంబునం బొందు లో
పల శ్రీవైష్ణవయోగసిద్ధి పరమోపాయంబుగాఁ జేయుచున్. ౧౪౦

శా. ఇందుప్రస్తరకుట్టిమస్థలులపై నింటింటఁ జంద్రాననా
సందోహంబు చరింపఁ దచ్చరణలాక్షాచిహ్నము ల్లెట్టి కెం

పుందమ్ములన్నవి కేలిహంసపృథుకంబుల్ క్రేంక్రియల్సేయ నా
నందింపం బురలక్ష్మి నవ్వుఁ గలవీణాక్వాణదంభంబునన్. ౧౪౧

శా. హేమాంభోరుహకర్ణికానిభవిభాహృద్యానవద్యాకృతుల్
భామారత్నము లభ్రచుంబిశిఖరప్రాసాదకూటంబులం
దాము న్నాథులుఁ గ్రీడలాడి రతితాంతస్వాంతతం బొంద రా
కామాద్యద్విధుతాలవృంతము మెలంగం బాయుఁ దత్ఖేదముల్. ౧౪౨

మ. నయనాచ్ఛాదనపుష్పరేణుకణకీర్ణత్వంబు నంబొంది తే
నియనూనె న్నెఱిఁ గ్రక్కి నూత్నకళికానిర్వ్యాజముగ్ధద్విజో
చ్ఛయ మొక్కించుక దోఁప భృంగరవభాషల్బ్బాపు వాతస్తనం
ధయము ల్రాఁ గని యెత్తుకొంద్రు సురతాంతక్లాంతకాంతామణుల్. ౧౪౩

క. అన్నగరివాసనాథూ, పొన్నయ మంబరము వోదువ నుర్వీజనులు "నీ
లన్నభ" యని యాడిరి గా, కున్నదె మిన్నునకు రూప మొకనాఁ డైనన్.

ఉ. మారునిపోరుపీఁకఁ బలుమాఱును ద్రెవ్విన సారసాననా
హారమణు ల్బుజిష్యలు నిశాంతమున న్వెడలింప శౌరిసే
వారతి వచ్చువారమదవారణయానల పాదపద్మముల్
జీరుకు వాఱ నవ్వుదురు చేతులు వ్రేయుచుఁ బ్రాఁతపల్లవుల్. ౧౪౪

సీ. మరులుఁ జూపులె చాలు మరుఁ గృతార్థుని జేయ బోమపొల్పమె పని పూనునొక్కొ
వెకలిమాటలె చాలు విటులకోర్కులు దీర్ప నవ్వు లేకెలసంబు నడుపునొక్కొ
జవ్వనంబే చాలుఁ జక్షుఃప్రియము సూప నెలచెయ్వులే కార్య మెన్నునొక్కొ
సహజగంధమె చాలు జగము మోహింపింపఁ దనుకాంతియే చేఁత పెనుచునొక్కొ
పటిమ మీఱంగ నొక్కటొక్కటియె చాలు, నేతదర్థంబు మఱి వింతరీతులెల్ల
నరసి చూడంగ ననవస్థలనఁగ ద్వార,వతిఁ బ్రకాశింతు రుత్ఫుల్లవనజముఖులు.

సీ. కుటిలాలకములఁ జీఁకటులు రాల్పఁగ వచ్చు నుదురులఁ గ్రొన్నెలల్ పిదుమవచ్చు
ముద్దుమోములఁ గళ ల్లుంచి యెత్తఁగవచ్చు నూర్పులఁ గస్తూరి యూర్పవచ్చుఁ
గెమ్మోవి నమృతంబు గిలకొట్టఁగా వచ్చుఁ జన్నుల సకినలఁ బన్నవచ్చు
సరసభాషలఁ దేనె పెరలు రేఁపఁగవచ్చు మేచాయఁ బసిఁడి గమ్మింపవచ్చు*
జఘనముల సైకతశ్రీల సాఁకవచ్చు, నలినసౌభాగ్య మడుగులఁ దెలుపవచ్చు
ననఁగ నవ్వీట వర్తింతు రతనువహ్ని, వీజనము లగువారనారీజనములు.

* గ్రమ్మింపవచ్చు-మూ, కమ్మించు=కమ్మి సాఁగఁదీయు.

శా. దూరోదంచితమేఘసంఘములఁ బోఁద్రోలు న్నభోరత్నఘో
టీరాజిం గెరలించుఁ దారలకు నుద్దీనత్వ మొందించు నౌ
రా రాజీవదళాక్షరక్షితపురప్రాసాదరాట్కేతుపుల్
హోరాహోరిఁ బ్రచార మిట్టిది గదా యుద్ధండు దౌవారికిన్. ౧౪౯

సీ. త్రవ్వి పోసిరో కాక ధనదావసథవసన్నవ్యనానానిధానంబు లెల్ల
గ్రొచ్చి తెచ్చిరో కాక కుందనంపునగంబు వప్రస్థలులఁ గల్గు వజ్రవితతిఁ
గుప్పసేసిరో కాక కుంభినీగర్భసంభవవసురత్నసంభార మొకట
రూఢి నాకర్షించిరో కాక సప్తార్ణవీపదార్థవిశేషవిభవలక్ష్మి
నౌర వారిరుహాసనుం డైన వాని, కొలఁది లెక్కింపఁ దా నంత తెలివి గలఁడె
యనఁ బ్రకాశించుఁ బురి ననేకార్థసార్థ, రూపకాకోపణము లైనయాపణములు.

శా. వేదస్వాధ్యాయవిచారు లాగమశిఖావేశాంతహంసంబు లు
ద్బోధోంచద్ద్యుతిచిత్తలాశయులు సంపూర్ణానుభావు ల్జిత
క్రోధు ల్సాధితసత్యసంధులు హుతాగ్ను ల్పొల్తు రత్యున్నమ
న్మేధామాధురి సాధురీతిఁ బురి భూమీదేవతాపుంగవుల్. ౧౫౦

శా. భూభృద్భావముఁ జూపు రత్నకటకంబు ల్సానురాగాదృతిన్
శోభిల్లన్ ధ్వజకూటకోటి చటులస్ఫూర్తుల్ ప్రసర్పిల్లఁ దే
జోభానూదయకీర్తిచంచ్చలు పయిం జూపట్టఁ గాక్షీరచ
ర్యాభక్తిప్రభ ధాతుభాతిఁ దనరన్ సత్క్షత్రియవ్రాతముల్. ౧౫౧

మ. తనరున్ వైశ్యనివాసభూముల ముకుందశ్రీ మహాపద్మలో
చన పద్మానన శంఖకంఠి మకరచ్ఛన్నస్తనాభోగ కుం
దనిభస్వచ్ఛరదాళి నీలకచ నందచ్ఛాపసచ్ఛపా
దనమల్లోక వరప్రదాత్రి యనుచుం దాదృఙ్నిధానాకృతిన్. ౧౫౨

సీ. తారకాహారచంద్రముకురాలంకృతగగనలక్ష్మినవక్షౌమలతిక
యాశుశుక్షణిశిక్షణాక్షీణతరజటాజూటకోటీమాల్యశోభనంబు
కపిలర్షి నృషభభీకరకోపశిఖిలీఢతనుసాగరోర్ధ్వగమనవిధాన
ముక్తనేతరనదీయోగానురాగాబ్ధిపరిణాహపరిపూర్ణభాగధేయ
మిందిరేశపదాబ్జమరందధార
నలినసంభవకరకమండలుసలిలము
నైన మిన్నేటితోఁబుట్టు వైనపాద్ర
జాతిమహిమంబుఁ గొనియాడఁ జదుర మగునె. ౧౫౩

సీ. కర్ణచాలనలీల గలుగుట చిత్రమే దంతాఘనస్ఫూర్తి దశింకుచూప
ఘణఘణధ్వనిఘంటికాగర్జలు ప్రబలవే మేఘసంపదపాదమేదురముగఁ
దలకెక్కకున్నె యుద్ధతరజఃకాళిమ హరిచింత గలలోన నైనఁ గనమిఁ
దగువారి నిలుచుట దనరదే నిలువెల్లఁ గర్ణకకుంభిభవిభ్రమము గమియ
స్ఫూర్తిస్మృతులు సేయు టుచితంబు భూరినాగ
శబ్దవాచ్యతకలిమి నీజాతి కనఁగ
వెలయు నవ్వీట సంగ్రామవిజయభూమ
ధామమూర్తులు గంధాంధసామజములు. ౧౫౦

సీ. వడినేర్పుటకుఁ గాళ్ళఁ బడు గాడుపులమనంబులలీల ఖురరజఃపుంజ మడర
ధారాధరము లౌటఁ దళుకొత్తు మెఱపులచాడ్పున నపరంజిసగతు లమర

*    *    *    *    *

వఱలును వినీతములు సాధునాహు లతిరు
లీనములు శస్త్రపాతాచలితహృదయము
లాచరితచిత్రభంజళిసూచితాజ
నాటకంబులు బహువర్ణఘోటకములు. ౧౫౫

చ. రవిరథవేగ మంతయును రాక్షసకృత్యము చంద్రు తేరు సూ
తువశము*శూలిచక్రియును దున్నలు త్తున్నలు మాకు సీడుగా
వవి యని నవ్వు నప్పురమునం దరదంబులు కేతుకింకిణీ
నివహ†వికస్వరస్వనితనిహ్నవవజ్రరుచిచ్ఛలంబులన్. ౧౫౬

క. వడిగలిగి ప్రాససంపద, నడరి పదన్యాసలీల నతిచిత్రగతుల్
గడలుకొని సత్కవిత్వము, వడువున భటకోటి వీట వాలుం జాలన్. ౧౫౭

చ. శుకనిభు లద్రితుల్యములు సూనసమానలు నిర్భయుల్ జవా
ధికము లురుప్రతాపులు రతిప్రియమూర్తులు శ్రీయుతు ల్బహూ
దకపరిపూరితంబులు సుధాధవళంబులు తత్పురంబు వి
ప్రకరివధూభటాశ్వనృపపల్లవచైత్యతటాకహర్మ్యముల్. ౧౫౮

గీ. ఆదిమూలసమానసక్తమయ్యెద్విజకు, లమునిజచ్ఛాయఁదన్నవలంతియయ్యె
నుపవనావళి వెలిమోచియుండుఁబురికి, మధుపసంగతిఁగలమలీమసత నొక్కొ.

---

* తువిశమ-మూ-†వికస్వరస్వరతునీవహవజ్రరుచిచ్ఛలంబునన్-మూ.

సీ. మాకందములు చైత్రమాకందములు కొన్ని క్రమ్మి పుష్పాడిదః మారమ్ము వీవ
నారంగములు వాసనారంగములు కొన్ని పూఁదేనె వాసన ల్పొసరింప
గేసరంబులు దళత్కేసరంబులు కొన్ని కడివోని ఘుమఘుమల్ గ్రమ్ములింపఁ
పాటలంబులు సామిపాటలంబులు కొన్ని విడియు తుమ్మెదలకు విందులొసఁగ
మఱియుఁ దక్షిన తరులతామండలములు
మదనశిబిరసమావేశమహిమఁ బెనుప
నుపవనమ్ములు సంచరత్సుపవనములు
గములు గొనియుండుఁ బురబహిష్కటకవాటి. ౧౬౦

ఉ. కేసరిమధ్యమల్ గరుడకేతనువీటిసరోవరంబులన్
వేసవిఁ గ్రీడలాడ నరవిందసమృద్ధిఁ దదాస్యచంద్రికో
ల్లాసమున న్నగిడ్చినఁ గెలంకులఁ గైరవలక్ష్మి నవ్వుఁ ద
ద్వాసరనాథకృత్యము స్వవక్త్రవిలాసకళాచ్ఛలంబునన్. ౧౬౧

వ. మఱియును. ౧౬౨

చ. వనితలమేని కస్తురియె వాలెరువై హిమవాలుకాతతుల్
మునుఁగఁగఁ జేయుచు న్విరులమొగ్గలె బుగ్గలుగాఁగఁ బర్వనూ
తనమకరందకుల్యలన తన్నువహించి ఫలించు నప్పురం
బున వివిధాభిధానభృతిభూషితశాలిశరీరవల్లికల్. ౧౬౩

సీ. కురువేరు గొనవచ్చి కుంతలస్తబకనిస్తులవిలాసశ్రీలఁ దొట్రుకొనుచుఁ
గప్పుఁగల్వలఁ గొనంగావచ్చి నీలాంజనాంచితక్షణలక్ష్మి నలఁతపడుచుఁ
గుసుమకందుకములుగొనవచ్చి మొనవాఁడికుదురుచన్గుబ్బలమదటఁగొనుచుఁ
గనకాబ్జములు గొనఁగావచ్చి నెమ్మోముఁదామరసోగపులఁ దల్లడిలుచుఁ
జత్తములు విల్వఁదెచ్చినవిత్తములును
నుఱకపోనాడి లోనాడు చెఱకువిల్తు
తూపులకుఁ గాఁపులై చరింతురు పురమునఁ
బుష్పలావీవశంవదు ల్భోగిజనులు. ౧౬౪

ఉ. భ్రమిగొను తావియూరుపులు ఘాలగళన్నవఘర్మబిందుజా
లము స్వవిమర్దనిక్వణమిళత్కుచకుంభభరంబుఁ బాణిర
క్తిమయును నుప్పతిల్ల నిజదేహలతల్బడలించు గట్టివా
లు మగువపింఁడఁ గాంచి మతిలోనఁ గరఁగుదు రెట్టిముగ్ధులున్. ౧౬౫

మ. హరితాళాంకపరిష్కృతాస్యతతవంశార్హాక్రియానద్ధరా
గరసావేశవశాంగచాలనపతాకారమ్య తద్ద్వారకా
పురిసేనానటి యుద్ధరంగమునఁ గోపు ల్చూప మత్తారు లి
త్తురు సత్కీర్తిదుకూలమానధనపంక్తుల్ జీవరత్నంబులున్. ౧౬౬

సీ. కమలినీముకుళపాకంబులఁ బసుపార్చు సారకాసారానుషంగవేళ
విస్మేరకాశ్మీరవిభవంబు ప్రభవింపఁజేయు గంధాపణశ్రేణులందు
బాలప్రవాళసౌభాగ్యంబు గల్పించు మందిరోద్యానక్షమారుహముల
భద్రవిద్రుమలతాచ్ఛిద్రముద్ర యొనర్చుఁ బరిఖీభవద్వార్ధిపరిసరముల
సాంధ్యసవితృప్రభాభరౌజ్జ్వల్య మబ్జ, లోచనాలోచనాళిందగోచరమధు
మదవికాసంబు సమయనీరదనికాయ, చంచలాచ్ఛాయ కందర్పజనకనగరి.

ఉ. శ్రీకమలాక్షువక్షము విచిత్రకళాకలనాకలాపనా
ళీకభవాస్యచక్ర మనళీకమహావిభవావళీమరు
ల్లోక మనాకులార్థబుధలోకమిళిందరసాలసాలశా
ఖాకటకంబుఁ దత్పురశిఖామణిఁ బ్రస్తుతిసేయశక్యమే. ౧౬౭

క. రేలెల్లఁ బూర్ణిమలు ఋతు, జాలము సర్వము వసంతసమయము నిఖిల
స్త్రీలును బద్మినుల యపాం, చాలురు నరు లెల్లవారుఁ జక్రధరుపురిన్.

సీ. వారణవారణవారణగ్రాహారి ధృతగాష్ట్రధృతరాష్ట్రధృతిహరుండు
కువలయకువలయకువలయప్రియమూర్తి పద్మినీపద్మినీపద్మహితుఁడు
బలభద్రబలభద్రబలభద్రకకుదంబు గోపాలగోపాలగోపనంబు
హరిసూనుహరిసూనుహరిసూనుహితకారి గోత్రారిగోత్రారిగోత్రశంబ
మంబునిధిశాయి శాంబరీడంబరాభి, రామయదురాజమూర్తి గారాముసేయ
ద్వారవతిసారవతియుశ్శృంగారవతియు, శూరవతియును నై నిత్యశుభములొందు.

మ. దనుజాంతఃపురతారహారలతికాదాత్రంబు గోత్రారిము
ఖ్యనిలింపప్రమదాకపోలమకరీకల్యాణకల్యంబు భూ
వనితాభారవిదాహభేషజము నై వర్ధిల్లు తాదృక్సుద
ర్శనముం దాల్చు సుదర్శనుండు జగదధ్యక్షుండు రక్షింపఁగన్. ౧౭౧

. ద్వారవతి యొప్పు లక్ష్మీ, గౌరవతిలకితము లైన కలుములకలిమిం

ర్భారుం డై సుఖియించు విష్ణుఁడు సుధాపాథోధికల్లోలడో
లారంగత్ఫణిపుంగవాపఘనలీలాతల్పసంసుప్తుఁ డై. ౧౭౩

మ. రణరంగాభిముఖారివీరవరశీర్షశ్రేణి వేతాళవా
రణయానాకుచశైలకూటముల హారశ్రీఁ బ్రతిష్ఠింప రు
క్మిణి నస్త్రార్ద్రకృపాణధార జయలక్ష్మీదత్తహస్తాంబుజా
ర్పణఁ గృష్ణుండయ నేర్చుఁగాక నడిపింప న్శక్యమే యేరికిన్. ౧౭౪

స్రగ్ధర. కమలాక్షిం గంబుకంఠిం గరివరగమనం గచ్ఛపస్వచ్ఛపాదన్
హిమహాసన్ హీరదంతిన్ హిమకరవదనన్ హేమగౌరాంగయష్టి
న్విమల న్విద్యానిధిన్ శ్రీవినిమయసుషమ న్వీరలక్ష్మీసహాయ
ప్రమియించు న్రుక్మిణి న్వారణవరదుఁడు గారాన ధీరానురక్తిన్. ౧౭౫

— శ్రీకృష్ణరుక్మిణీవిహారము —

వ. ఇట్లనన్యసామాన్యసౌజన్యలావణ్యప్రముఖనిఖిలగుణగణధన్య యగుభీష్మక కన్యయందునమందరాగుండై మందరాగధరుండుతరుణతరతరంగతురంగారోహణరేఖాచతురమరుదంకురాలంకృత హరిదవధిపుంజంబు లగు వేలావనలతాకుంజంబులయందును నంజనశ్యామలకోమలహరినీలశకలశలాకికాకిరణకిసలయ కల్పితకుహనాకువలయతల్ప యోగంబు లగు రైవతగిరికందరాగర్భభాగంబులయందు ను బరభాగపరిబృంహితపరాగపరంపరా విరచిత వనదేవతావసన వాసనాచూర్ణవర్ణోద్దేశంబు లగు నుపవనప్రదేశంబులయందు ను గాశకుసుమసమవిమలడిండీరధారా దుకూలవేల్లితపులినమూలంబు లగుసరిత్కూలంబులయందు ను బ్రాలేయశైలవిశాలరూపచంద్రశాలా నిరూపణసంగ్రహంబు లగుగృహంబులయందు ను బ్రసవశరమహోత్సవసామ్రాజ్యసౌభాగ్యంబు లనుభవించుచు గడియలు గడపి ముహూర్తంబు లుత్తరించి జాములు వోవిూటి దినంబులు చనంద్రోచి పక్షంబులు విక్షిప్తంబులు చేసి మాసంబు లోసరించి ఋతువులు కృతపఱిచి యయనంబులకుం బయనంబులు గావించి శరత్తులు ప్రవర్తించుకాలంబు నిమేషలీలంబుగాఁ గడపుచు నుండియుండి యొక్కనాఁడు. ౧౭౬

సీ. గురివెందపూఁదీఁగ కొదమ లల్లినచోటఁ గపురంపుటనఁటులు గమియుచోటఁ
దరుణరసాలము లుఖ్ఖుగొట్టెడుచోట సురపొన్నపుప్పొడి గురియుచోట
ద్రాక్షపందిరులుసందడిగ్రందుకొనుచోటఁ బాటలామోదంబు ప్రబలుచోటఁ
బసిఁడిగేదఁగిపూవు పసిమిగ్రమ్మెడిచోట వఱలుఁ రక్తాశోకవనికచోటఁ

దొలఁకుగొజ్జంగపూనీటికొలఁకులందుఁ
గొదమరాయంచపదువులు పొదలుచోటఁ
జిలుకజవరాలుగమి గజ్జుగెలసి మరుని
మర్మ ముద్ఘాటనముసేసి మలయుచోట. ౧౭౭

సీ. ముంగారుకుంకుమమొఱపఱా నేలల నలుచుట్టుముట్టిన నలదలతల
ప్రాఁకుడు క్రిందటి పఱపుటాకులదళ్ళ మరువంపుటోవరి మరకతములఁ
గేళిశైలముచక్కిఁ బ్రాలేయశైలాగ్రశకలకల్పిత మైన జగతిమీఁద
సాంకవమృగనాభిచందనకర్దమవిరచిత ప్రత్యగ్రవేదియందుఁ
జిన్నిచెంగల్వబటువులు సన్నజాజి
తలగడలుఁ దప్పితూఁడులతలిమతలము
వెలయఁ గొలువుండె రుక్మిణీవిభుఁడు తత్స
మయము వేసవి యగుట హృత్ప్రియ మెలర్ప. ౧౭౮

క. కర మరవిందం బని చా,మరహంసిక యిడిన గ్రుడ్డుమ్రాఁకి నమరు దం
తరచిత మగుసంకుమదపు, బరణి యొకతె తాల్చి నిల్చెఁ బద్మాక్షుకడన్.

క. వెలిగుంచె దాల్చె నొకసతి, కలిభంజను నెదుట నైజగమనస్పర్థా
విలమతి మీఁటినపద్మజు, కలహంసముఁ బట్టుకొనిన క్రమ మేర్పడఁగన్.

క. కాళాంజి పూనె నొకసతి, నాళీకదళాక్షుమ్రోల నన తేనియలన్
ధూళించుపుష్పగుచ్ఛము, దాలుచునుద్యానదేవతయునుంబోలెన్. ౧౮౧

క. అసురగ్రాసకృతాంతక,రసనన్ దసనా ధరించె రమణి యొకతె సా
రసనేత్రుమ్రోల దంభో,ళిసహితవర్షాసమానలీలావహ యై. ౧౮౨

క. గందవొడిబరణి యొక్కతె, కందర్పునికన్నతండ్రికడ వహియించెన్
మందారలతిక పుష్పాఢి, చిందుగుచ్ఛంబుఁ బూనుచెలువం బెసఁగన్.

క. యావకరసఘుసృణం బగు, పావడ ధరియించె నొక్కభామిని జలధిం
ద్రావాసదిశ ప్రవాళల,తావర్ణ దినాంతలక్ష్మిఁ దాలుచులీలన్. ౧౮౪

క. రజనికరకలితరాకా, రజనియునుం బోలె నొక్కరమణీమణి యం
బుజనాభుఁ గొలిచె ముకురము,నిజకరపుష్కరమునకును నెయ్యముచూపన్.

క. సురటి రవళించె నపు డొక, కరటిప్రతిమానయాన కమలాక్షుకడన్
సరళరుచి దక్షిణాయన,తరణిం బ్రకటించుదండధరదిశవోలెన్. ౧౮౬

గీ. కనకరచిత మైన కనకాలుక వహించి, సనకజనకజనకుఁ గనకగౌరి
యొర్తు గొలిచెఁ దేనెలొలుకు తెమ్మెరతోడి, నలినినలినమిత్త్రుఁగొలుచుకరణి.

ఉ. కీరము నేత్రపల్లియును గిన్నెరవీణయు వీడియంపుఁ గ
ర్పూరపుఁబెట్టెయుం బడపము న్వహియించి మిటారి గుబ్బెతల్
చేరి భజించి రాకొలుపు చెన్నుసఁగెం ద్రిజగద్విహారిశృం
గారరసం బశేషమును గ్రక్కున నక్కడ నిల్చెనో యనన్. ౧౮౮

మ. మృదుకర్పూరపరాగరాజిసుషమోన్మేషంబు దూషించుచే
ల దళత్పంకజకర్ణికాగ్ర సమశీలం బైన నెమ్మేన శా
రదచంద్రప్రభ పుష్యరాగశిలఁ జేరంగ్గు సౌభాగ్యసం
పద గల్పింపఁగఁ గప్పు లేని క్రియఁ బైపై హారముల్గ్రోఁపఁగన్. ౧౮౯

క. ఒకమెఱుఁ గొక తెఱఁ గొక చెలు, వొకలా గొక బాగు నొకముఖోల్లాసశ్రీ
యొకచందం బొకయందం, బొకవినయము నొకనయము నుల్లము దెలుపన్.

క. తను డాసియున్న కుక్షిం, గనుఁగొని చేసన్నఁ బిలిచి గర్భోక్తుల నె
మ్మనము గిలిగింత లార్పఁగఁ, బనిగొని యొంజెప్పరానిపనిఁ బ్రియుఁ డెలమిన్.

* * * *

వ. ఇవ్విధంబున నమ్మధుమథనుండు వివిధవినోదంబులం బ్రొద్దు గడపి యప్ప
డంతికి నుప్పుఁగడలిఁ జూపి యిట్లనియె. ౧౯౨

ఉ. తామరసాక్షి చూడు తిమిధామము సామజనీలనీరద
స్తోమ మనారతార్ద్రిరవిసోమము గర్భవసన్మహీధర
గ్రామము రత్నసంపదభిరామము కల్పితదైత్యరాట్కుల
క్షేమము నిమ్నభావపరిసీమ మిలామణికాంచిదామమున్. ౧౯3

మ. వనితా నీ వలనాఁడు పంచిన సుధీవర్యుండు నన్గాంచి కాం
చనపీఠంబున నిల్పి నామదికి నుత్సాహంబుగాఁ బల్కు మా
ర్కిని వీచీగతి నొక్కక్రౌంచ మిదె కంటే యాతమాలద్రుమం
బునకుం బోయి సమీపహేమపులినంబు న్మెట్టి గగ్గిల్లెడున్. ౧౯౪

శా. నీకై నే నలనాఁడు మున్ను చనుచో నీతి న్విచారించి సే
నాకీర్ణంబుగ సీరపాణి నను డాయ న్వచ్చు మర్యాద శు
భ్రాకారం బగు మేఘు మొక్కటి వినీలాభంబు వెన్నాడెఁ గం
టే కోకస్తని యుల్లలల్లహరికోటీయుక్తి నివ్వారిధిన్. ౧౯౫

చ. పవడపుఁ దీవ చూడు మిదె భామిని కోమలనీలపల్లవ
చ్ఛవియుత శైవలస్తబకసంగతి నింపు వహించెఁ గాళికా

భవనము నిర్గమించి పురపద్ధతి కున్ముఖ మైన సిన్ను డా
సి విపుల బాహుమధ్యమునఁ జేర్చిన మామకమూర్తిఁ బోలెడున్. ౧౯౬
గీ. లవణజలధిలహరిఁ దవిలినక్రొక్కారు, మెఱుఁగుఁదీవఁజూడు మెఱుఁగుఁబోఁడి
నీలరత్నశకలనిర్మితమద్రథా,రూఢ మైననీదురూపుఁ జూపె. ౧౯౭
ఉ. వాలుగమీలపిల్ల లనివారణ గ్రొచ్చిన నుచ్ఛలించు నిం
తీలవణాబ్ధివీచికలు దృష్టిముదం బొదవింపఁ జూడు న
న్నాలములోనఁ దాఁకు మగధాధిపవీరుల వాజిరాజి ను
ద్వేలతఁ జించి ముంచిన మదీయశిలీముఖరేఖఁ బోలెడున్. ౧౯౮
గీ. శైవలచ్ఛన్నముఖముతోఁ జౌకళించి, పవనహతిచేతనన్నాచు బయలువడిన
నీరుమానిసిఁ జూడు మన్నిశితశరవి, రూపితుండగురుక్మిపౌరుషముఁ దెలిపె.
ఉ. భామిని చూడు మిజ్జలధి పై నెదనాటి నటించు నంబర
శ్యామిక ఫాలలోచనుమహోనస మాట యెఱుఁగఁజేయుఁ ద
ద్ధూమముఁబోలి యొప్పె నిది ధూమము గల్గినచోటఁ గల్గుఁబో
ధూమపతాకునుప్పి యనుమందుప్ర నౌర్వశిఖిచ్ఛలంబునన్. ౨౦౦
సీ. భుజియింపఁ గల్గె వేల్పులకుమృష్టాన్నంబు ధరియింపఁగలిగె రత్నంబుహరికి
నెక్కంగఁ గల్గె మత్తేభ మింద్రునకును నిరవొందఁ గలిగె వాహినులకెల్ల
శరణంబుచొరఁ గల్గె సురవిరోధులకుఁ బ్రాణమునిల్పఁగలిగెమైనాకమునకుఁ
జెరువంగఁగలిగెఁ గ్రొవ్విరి పురారాతికి నలపట్టపుట్టంబు గలిగె నిలకు
నీపయోరాశికతమున నేతదమిత, వైభవోదీర్ణకీర్తి సర్వస్వలక్ష్మిఁ
దెలుపు చున్నవిచూడుమోకలువకంటి, పాండుడిండీరమండలీపిండనములు.

— ప్రద్యుమ్నజననము. —

వ. అని యన్నలిననయనుండు నయనసుధావర్తి యగు నుదధిచక్రవర్తి విక్రమం బాచక్రస్తనికి నెఱింగించి నిజమందిరంబుఁ బ్రవేశించి యుచితగతిఁ గృతకృత్యుం డై యుండె నప్పుండరీకనాభువలన నవ్వేదండయానకు ఖండపరశుపరుషతరలలాటకృపీటభవజ్వాలావలీఘతనుం డగు నతనుండు ప్రద్యుమ్నాభిధానంబునఁ బ్రభవించి యభినవలావణ్యమణిగణపణ్యవీథి యగునగణ్యవిలాససౌభాగ్యంబునం దేజరిల్లుచుండె వెండి యు నతండు.
సీ. చెలువల మొగముతోఁ జెలికార మొనరించుకలువ నెచ్చెలిపొందుగలుగువాఁడుఁ
మగువలబామలతో మైత్రి సంపాదించు వెలఁదిచక్కెరతీఁగవింటివాఁడు

నెలఁతలయూర్పుతో నెయ్యంబువచరించు మలయానిలపుసూతుమనుచువాఁడు
తెఱవలకురులతో నెఱచుట్టఱికమందు కొదమతుమ్మెదనారి గూర్చువాఁడు
సొగపుటింతుల ముయ్యంచుచూపుగమికి
విందులగు తూపు లొగి గారవించువాఁడు
కాముఁ డనవధిసుషమాభిరాముఁ డొప్పు
ఘటితశంబరమథనసంగ్రామసీమ. ౨౦౩

క. కమలాంబకుండు ఖగరథ, కమనీయుఁ డనన్యజుండుఁ గన్జియునై శ్రీ
కమనసమానాకృతి రతి, రమణుఁడు శృంగారమునకు రాజై వెలసెన్.

సీ. సటము గానీకఁ బొసటమువెట్టుఁ గటారి కజ్జపిచ్ఛిల మరందాన్వయమున
డిగనిచ్చు నిచ్చు వాఁడిగనూఱు శరపంక్తి సారసాహితబింబశాణకమున
నుసిసోఁకనీక పూను సితేక్షుచాపంబుఁ బాంథవైశసనవపంకలిప్తిఁ
బురివివ్వనీక డాఁపు రిరంస లుడిగించి బిగితావిచవిచూపి భృంగగణము
ఫాలలోచనఫాలాక్షికీలికీలఁ, దనువు విడనాడియును యశోదాకుమార
సరళకరుణామృతంబున మరల బ్రతికి, శంబరారి జితారి నై జయము చేరె.

చ. జలధి మథింప వేలకును సర్వజనస్పృహణీయకాంతిచే
నలరి యనర్ఘరత్న ముదయం బగులీల మురారి కాదిల
క్ష్మిలసితమైన రుక్మిణికి మీనపతాకుఁడు పుట్టి క్రీడి
క్తిలకముగా నొనర్చె వలదే యిల దేహికి నిట్టి వర్ధలన్. ౨౦౬

సీ. గోవృషభంజనకుశలన్తనుఁ డయ్యు గోవృషరంజనగుణము గలిగి
మాతులశోషణమహిమాన్వితుం డయ్యు మాతులపోషణఖ్యాతిఁ దనరి
పంచజనాప్రియప్రారంభుఁ డయ్యును బంచజనప్రియప్రాప్తి మెఱసి
కువలయాపీడగౌరవహర్త యయ్యును గువలయాపీడవైభవము నొంది
యరివిదూరుఁ డయ్యు నరిధారియై యసు,నాతిమిత్రుఁడయ్యు నర్జునాహి
తమ్మొనర్చు శార్ఙ్గి తముఁబ్రోవఁ బ్రజలెల్లఁ, దల్లిమఱుఁగు ప్రజల తనుపుగనిరి.

సీ. అల పార్పుటయకానియనిలంబునింతులసంవ్యానము చెఱఁగుజఱియ వెఱచుఁ
బాకమాత్రముకాని పవనసారథియును బడిమీఱి తనయిచ్చఁ బ్రబల వెఱచు
నడిగి కొంటయకాని యలబ్రహ్మకొడుకైనఁ బరధనం బణువేనిఁ బట్ట వెఱచు
మర్యాదనే కాని మారిసంకటముఖక్షుద్రబాధలు నిక్కి చూడ వెఱచు

నిగ్రహానుగ్రహక్రియానిపుణుండైన, ధర్మమర్మవినిర్మాణకర్మఠుండు
హస్తగతచక్రుండైనబలానుజుండు, ప్రాజ్యభుజశక్తిం బ్రోచుసామ్రాజ్యమునను.

— ఆశ్వాసాంతము. —

శా. తారామండలబింబమధ్యవిధుకాంతగ్రావవేదీతటీ
స్వైరక్రీడనలోలవిశ్వభువనస్వామీ త్రయీకామినీ
హారాలంకృతినీలనాయకమణీ హంసోపవాహ్యార్చనా
పారంపర్యవిధేయచర్య వినమద్భక్తాపవర్గప్రదా. ౧౦౯

క. సకలసురేశ్వర హిమకర, శకలకిరీటాంగనారసజ్ఞాస్పద పూ
ర్ణకలముఖాంభోరుహ సా, యకలలితాకార శార్ఙ్గహారిభుజాగ్రా. ౧౧౦

స్రగ్విణి. అండజాధీశవాహా జగద్దేహ వే, దండరక్షా గుణాధ్యక్ష పాదానతా
ఖండలా గండరింఖన్మణీకుండలా, పుండరీకేక్షణా పుణ్యకృద్వీక్షణా.

గద్యము. ఇది శ్రీమత్తిరుమల శ్రీనివాసాచార్యకరుణాపారంపర్యపాత్రాత్రేయ
గోత్రాపస్తంబసూత్ర పవిత్ర సకలకళాభోజ రామరాజరంగప్పరాజప్రణీ
తంబైన సాంబోపాఖ్యానంబునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

# సాంబోపాఖ్యానము.

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీమత్కౌస్తుభతరణి, వ్యామిశ్రభుజాంతరాళవనధరపథ నీ
లామానసహంసక లక్ష్మీసుందర రంగధామ మేచకధామా. ౧

వ. దేవా భావికథాక్రమంబు నీదివ్యచిత్తంబున నవధరింపుము. ౨

### — సత్రాజిత్తుచరిత్రము. —

శా. గోత్రాభృన్నిభధైర్యుఁ డాగమశిఖాగుచ్ఛద్విరేఫంబు ధ
ర్మత్రాణప్రవణుం డశేషజనతామాన్యుం డనన్యాతిథి
క్షాత్రక్షాంతివితీర్ణినిర్ణయకళాగణ్యుండు నై ద్వారకన్
సత్రాజిత్తుఁడు వృత్తశాలి మనుఁ గృష్ణస్పర్థిసంపత్ప్రభన్. 3

సీ. హరుబండికంటికి హరికుడికంటికి మనువిచ్చు నేవేల్పుమండలంబు
తిమిరశృంగము నాది తేయాద్రిశృంగంబుఁ గరగతం బేవేల్పుగాఢగతికిఁ
బదిరెండురాసుల బహుళార్థరాసుల ఫలమీగి యే వేల్పు తెలియఁబఱుచుఁ
దొంగలవాకట్టు సాధువులవాకట్టును వర్థింప నేవేల్పు వలఁతియయ్యె
ననవెలయు హేళి పద్మినీవనితతాళి, తుహినభూధరదంభోళి మహిమశాలి
నర్యముభజించుసత్రాజిదాహ్వయుండు, పరమకళ్యాణపరిపాకబాంధవమున.

సీ. దరిఁబట్టఁజిఱుమీలఁ దమచంచువులఁబట్టియెచటఁగ్రొంచలునించు*నేటినీటి
కీని కన్నులు గుట్టఁ గాన మందులు దెచ్చు వ్యాఘ్రికి నెచ్చట హరిణగృహిణి
జరఠసింహమునకుఁ గరదండ మెచ్చటఁ గైదండసవరించుఁ గరికలభము
పోఁగగాడుపుఁబాలు సానుపు నెచ్చట నెమ్మి యపుడప్పుడవ్వనినహిశిశువులఁ
గదుపుఁ బెడఁబాయు ప్లవగపాకముల నెచటఁ
నిండుమదిఁ బ్రోచుఁ దలియె కొండగొఱియ
యట్టిపుణ్యాశ్రమస్థలి నర్కుఁ గొలుచు
నాశ్రమ మొనర్చి సత్రాజిదవనిభర్త.

గీ.

* గ్రొచ్చులనిచ్చు-మూ.

లయగ్రాహి.

సూర్యుఁ డిమిరౌఘరిపుశౌర్యుఁ డ్రిజగద్వ్యాహృతిధుర్యునమరప్రణుతచర్యునతర త్నా,హార్యుయమవచ్చిదుపకార్యు శ్రుతిసంపదుపహార్యుసకలోపకృతికార్యు గ్ర హరాజి,వర్యు సుఖదాయి పరివర్యు నవిభావ్యనిజధైర్యు జయసంప దనివార్యు నురుతేజః,స్థైర్యు నతఁడుత్తమసపర్యలభజించె గతపర్యటన మైన మన సార్యులు నుతింపన్. ౮

ఉ. ఆనియమంబు నాయమము నాదమ మాశమ మానిరంతర
ధ్యానవిధాన మాబహువిధాసనబంధవిదగ్ధభావ మా
మానస మెందునుం జనని మట్టును గట్టును మాను లౌ ననం
గా నతఁ డొప్పు భక్తికలికాకిలికించితబోధమాధురిన్. ౭

గీ. దేవిగాయత్రి సవ్యాహృతియునుసశిఖ,యునుఁదనరసజ్ఞయనునింటనోలగింపఁ
గెంపుఁగరములవేల్పుఁ బూజింపనేర్చె,ద్వారకావాసిమునులలోవాసివడసి.

శా. రాజీవాప్తుఁ డహర్నిశంబును విని ద్రస్ఫూర్తి మన్మూర్తి స
త్రాజిన్మానసమానసౌకమయి రారజ్యద్గతిం బొల్చియున్
రాజీవాసనశాసనం బగుటఁ బోరామి న్నభోమధ్యర
ధ్యాజాంఘాలికమైన త్రిమ్మట నలంతం బొందు డెందంబునన్. ౯

ఉ. లేసినవీఁక సద్భటవరేణ్యులు యోగవిదగ్రగణ్యులున్
గాసిగ నిచ్చఁ దూలి చనఁగాఁ జనఁగాఁ బెనుగాయమైన య
వ్వాసరనాథుపేరురము వ్రయ్యయు న్రొయ్యన మానవచ్చె ది
గ్వాసితవృత్తియా నతనిభక్తి సుధారసవర్తి యయ్యెనో. ౧౦

ఉ. ఈగరిమం దపంబు రచియించుచు వంచితరాగుఁడైన య
య్యోగివతంసునేమమున నుల్లము వెన్నవలెం గరంగె ఛా
యాగజగామినీస్తనయుగార్పితగోస్తనపద్మరాగరా
గాగమకారిబింబసుమమాధికశాలికి నంశుమాలికిన్. ౧౧

—సత్రాజిత్తునకు సూర్యుఁడు ప్రత్యక్షమై స్యమంతకమిచ్చుట.—

సీ. ఇంద్రునివిలుప్రాయ మెకస్కకైముగఁ జేయఁగలచాయఁ గోటీరకాంతిదనరఁ
జిలుకతెక్కలడాలుగిలుబాడఁగాఁజాలు లలినేలు మకరకుండలము లమరఁ
జలువవెన్నెల వెల్లిగొలుపుతేటఘటిల్లి.........హారవల్లులు దనర్ప
నెఱమిన్నుగమినాదు మఱపింప నెఱవాదు లగుపాదుకలరవ లార్భటింప

జిలుఁగునపరంజిలేనిగ్గుసిగ్గువఱుచు, తఱచుతనుకాంతి క్రొక్కారుమెఱుఁగులీన
శంఖచక్రధరుం డార్కచక్రనయ్యు, యవతరణమొందె సత్రాజిదగ్రవీథి. ౧౩
గీ. అర్కుఁ డుద్బుద్ధతారకుం డమృతవర్తి, ఘనవిహారంబు ధ్రువసిద్ధికిని నెలవును
నగుచు రెండవగగనంబాయనఁగఁబొలుచు, నమ్మహశ్రమవాటంబునధిగమింప.
క. సత్రాజిత్తు నిజోటజ, ధాత్రీసవిధమున వెలుఁగు తమ్ములయనుఁగుం
బత్రరథధ్వజదక్షిణ, నేత్రము నీక్షించి వికచనిజలోచనుఁ డై. ౧౪
మ. అవనిం జాఁగిలి మ్రొక్కి లేచి నిభృతుం డై సూర్యనారాయణుం
భవకారాగృహబంధమోచనవిధాపాండిత్యపారాయణుం
రవి రాజీవవనీవనీపకశుభప్రాప్తిప్రియంభావుకుం
సవిత న్నాధుసఖు న్నుతించు నిగమస్ఫారోద్గమద్వాక్కులం. ౧౫
మ. నినుఁ బద్మోద్భవుఁగా భజింతునో భవానీభర్తఁగా నెంతునో
వనజాతేక్షణుఁగాఁ దలంపుదునో దేవా! కాక యమ్మువ్వ రీ
తనువై నిల్చిరో యంచుఁ జూతునో మదిం ద్రయ్యంతసిద్ధాంతవి
జ్జనహృత్పంజరరాజకీరమ! జగత్సాక్షీ! యెఱిఁగింపవే! ౧౬
చ. అలఘుఁ గళానిధిం గువలయప్రియు రాజును జూడ రోసి బ
ల్పళములతల్పు బిగ్గనిడి తామరమొగ్గలమూలయింటిలో
నలి చెలిగాఁ బరాగపటికావృతయైన సరోరుహేందిరం
గిలకిల నవ్వుచుండ గిలిగింతలు వెట్టుదుగా దినాధిపా. ౧౭
ఉ. శూలిలలాటకీలితొలుచూలునుబోలిన మండువేసవిం
హేళి! కరాగ్రకుంభముల నెల్లరసంబులు నాహరింతు వా
శీల మెఱింగితి న్నుజనసేవధి తావకమూర్తి వేదవి
ద్వ్యాలతికాలవాలముగదా జలపూర్ణము సేయు టొప్పగుం. ౧౮
సీ. అపరపక్షక్షయాహతినఱుగుడుగొన్న యుడుభర్త కెవ్వ చంద్రోదయపటు
లక్షలావనీతలో న్ముఖవృష్టికిని గెంపుఁదూముకాలువలనఁ దోఁచు నెవ్వ
రెవ్వ గాఢాంధకారేభయూథములకు దుందుముతై మహోద్ధురతనిగుడు
నాకాశనికషోపలాభోగమున కెవ్వ రొఱసినకమ్మబంగరువునిగ్గు
లహరుదధివిద్రుమోద్రిక్తి నడరు నెవ్వ, యెవ్వ దీపార్చు లమరులయిండ్లకెల్ల
నట్టి నీభానువుల వినమ్రార్థకామ, ధేనువుల నెన్న మాతరం బౌనె తరణి.

క. విరహాశ్వథితరథాంగో, త్కరములఁ గరములఁ దెమల్చి తాప ముడుపు దో
యరుణకిరణ ! ద్విజరక్షణ, పరిణతి తేజోధనులకుఁ బ్రాభవము గదా. ౨౦

సీ. నవనవోదయలీల దివసాధిపత్యంబు నేకచక్రముగాఁగ నేలు దనియు
నలపద్మినులఁ గరంబుల నంటి డెందంబు గరఁగించి రాగంబు గాంతు వనియు
హంసశబ్దమునకు నర్థంబుగా విష్ణుపదమునందు నె మ్ముక్తి వడయు దనియుఁ
దనలోనఁ జొచ్చు రాజునకైన బలమిచ్చి పగలీఁగు మనఁజాలు ప్రభువ వనియు
విధుని గనుపాపఁగాఁ జేసి వెలయుకతన, నఖిలజగదంబకంబవై వగుదువనియు
నిన్నుఁ బ్రణుతింతు సేవింతు నెమ్మిఁ గాంతుఁ, గాంతిహృతతారకా తేజఘస్రరాజ.

సీ. పురుహూతముఖమరుత్పుష్పాంజలులఁ గూడి పడఁగ తారకులరాలు నుడుపులడర
సముపసమయోత్ఫుల్లజలజప్రభలఁ గూడి యుదయరాగచ్ఛట లుద్ది వడయ
నప్సరోరచితలాస్యవిశేషములఁ గూడి హరిహేతిహూతినృత్యములు గమియ
గాఢాంధకారవికారంబుతోఁ గూడి భువనజడత్వంబు నవులఁ జనఁగ
దళితమందేహదేహారక్తములఁ గూడి, భూసురార్ఘ్యాంబుపూరంబు లేనరేఁగ
నిత్యకళ్యాణముల నిచ్చునీమురాక, రాక నైమె లోకదృక్చకోరములఁ దనుపు.

క. నీపాదపద్మసేవక, లాపము మన్నిటలమున కలంకృతి యయ్యెం
బాపహర ! నాకు నన్యదు, రాపము లగుకలుములిచ్చి హర్ష మొసఁగవే.

క. అనిపలికెడుసత్రాజి, త్తును సాదరదృష్టిఁ జూచి తోయజమిత్రుం
డనుపమఘృణి యగు నొకమణిఁ, దనకేలం దాల్చి యత్యుదాత్తతఁ బలికెన్.

చ. ఇది తొల్లి సృజియించె నుదితానురాగుఁడై నిఖిలలోకైకనిర్ణేత ధాత
దీనికిఁ గౌస్తుభాదికదివ్యమణులెల్ల వెలదీర్చుచోఁ గీసవెలితి చూపు
నేభూమి నిదియుండు నాభూమి క్షామడాంబరపీడ నెఱుఁగక సిరుల వఱలుఁ
గాంక్షింతు రమరపుంగవులు దీని ధరింపఁ దారుణ్యలావణ్యదాయి గానఁ
గురియు నెనిమిది బారువు ల్బంగారంబుఁ, బ్రత్యహము నిమ్మహారత్నపల్లవకము
గలిగె నాకిది మున్నొక్క కారణమున, నిది స్యమంతకమను పేర నెసఁగు ననఘ.

ఉ. నీదుతపంబు నీజపము నీగుణరక్తియు నీదుభక్తియు
న్నీదయ నీదమంబు మదినిర్వృతి నాకొదవించె దీనిఁ గొ
మ్మోదళితారి యీమణిగణోత్తమముం ధరియించి బ్రహ్మరు
ద్రాదుల నైన గెల్చెద వనంతవిభూతివిశేషచాతురిన్. ౨౬

క. హరిసిరికి నీవు మదిలోఁ, గర మరుదందుదువు దీనికతమున నీకా
హరిసిరికిని మిక్కిలి యగు, సిరి యొదవుం గొదవ లేదు చిరకీర్తినిధీ. ౨౭

క. ఆరోగ్యదానభేషజ, మారబ్ధమనోరథోదయాభిముఖము నీ
వీరత్నంబును గైకొను, మీరత్నంబునకు నెనయె యేరత్నములుల్. ౨౮

వ. అని నభోరత్నం బావివస్వద్రత్నంబునకు నాస్యమంతకరత్నంబుఁ బ్రసాదించి ప్రసాదమేదురవదనవనరుహుండై నిజమండలంబు నలంకరించె నంత నక్కడ.

చ. వరమునఁ గన్న రత్నకులవల్లభము న్నిజపాణిపంకజో
దరమునఁ దాల్చి యొప్పె నలద్వారవతీగృహమేధి కల్పభూ
మిరుహము కొమ్మనుం బొలుపుమీఱు ఫలంబును బోలెఁ బూర్వది
క్పరిసరవర్తి యౌ నుదయభానుని బూనిన మిన్నునుం బలెన్. ౨౯

సీ. కలధౌతసౌధమండల మయ్యె గిరులెల్లఁ గరులెల్లఁ బురుషప్రకాండు లైరి
వనజాకరము లయ్యె వాఁకలకులమెల్ల నలమెల్లఁ గాండకాండంబు లయ్యె
నప్సరఃస్త్రీలైరి యసదుఁజెంచెతలెల్ల లతలెల్ల మణిదీపలక్ష్ము లయ్యెఁ
దేజోహయము లయ్యె దీప్తోగ్రహరులెల్ల దరులెల్ల యవనికాంతరము లయ్యె
స్యందనములయ్యె సైకతకందళంబు, లండజంబులు మాగధషండ మయ్యెఁ
గాన వీడయ్యె నారవిధ్యానకృతికి, నాస్యమంతకరత్నమాహాత్మ్యలబ్ధి. ౩౦

శా. ఆకల్యాణగుణుండు వీతనియమూర్ధ్వాకల్పుఁడై తొంటికా
రాకుల్ డుల్లిన పల్లవస్తబకరమ్యాకార మౌ మావిలే
మోకంబోలి విచిత్రభూషణరుచు ల్పుంభారమై పర్వ ను
ల్లోకశ్రీకమనీయమూర్తిరుచిఁ బొల్చున్ భోగదేవేంద్రుఁడై. ౩౧

వ. అప్పుడు కప్పురంపుటుప్పరిగ ముంగిటి యింగిలీకంపురతనాల కెలని పం దిటిక్రిందఁ దరుణతరణిమండల మధ్యవర్తి యగు నారాయణమూర్తియుం బోలె నారాజచక్రవర్తి కీర్తనీయుం డై యుండుట యు నాఖండితారిం గదిసి ముదుక లగుధరణీత్రిదశపురంధ్రులు పద్మినులు పద్మకేసరంబులు పద్మమిత్రుప యిం జిలుకుచెలువునం బసుపునసలున నుసిమిన సేసఁబోసి రుత్తాలదండ వాలంబులు నుదగ్రగోపిచందనపుండ్రకచిత్రకాయంబులు నగు విప్రశాస్త్రాంతం బులు దీప్రాశీర్వాదనాదంబుల నంతరాయహర్షిణంబులం బరిహరించిరి పంచశ రశరాసనప్రపంచవంచనాచుంచురంబులగుకటీవంకకనుబొమలు నిక్కించి కి లికించితోదంచితంబు లగు కెలపుం జూపుల నేపారి రూపాజీవలుసేవించి రధి కారపూరుషులు వారి వారికిం జేరి తమతమ పారుపత్యంబులు ప్రత్యేకంబు వక్కాణించి రుక్కు మెఱసి కక్షసంపుభటులు కుహనాకిటి మాటుటబొందులుం

బోలెఁ బ్రబలబలపరిస్పందులై క్రందుకొనిరి తనుమంతంబు లగు నభస్వం
తంబుల యోజ రాజిల్లు నాజానేయతేజోహయంబుల నెక్కి రాహుత్తులు
మోహరించిరి సారథులు రథ్యవనాథంబు లగు రథంబులు గొనితెచ్చి రథి
కులం గలయం గని యవితథమనోరథులై రెల్లయెడల వేణువీణామృదంగ
పణవాదినిక్వాణంబులు పిక్కటిల్లె మఱియు నాగరకంబు లగు బాగులన్నియు
నున్నిద్రంబు లయ్యె నయ్యెడ. ౩౩

గీ. పద్మవాసనకర్ణికాభద్రపీఠి, నించు రాయంచదారి విడియించురీతి
మకరకేతుకటారి యా నొకమిటారి, కమలహితభక్తుఁ గనకపీఠమునను నిచె.

సీ. కెలచూపు రంభ నెచ్చెలి యయ్యె మూఁపున మంజిటికుంచియ మాటియోర్తు
గాలిపటము ద్రిప్పు కంతునింతియపోలె సురటి ద్రిప్పుచు నొక్కసొబగులాఁడి
యుదితేందుకళ లేఖువదచకోరిక మీఁతెఁ దెలనాకుఁ జిలిచి కలికియొకతె
యమృతకుంభముఁబూనునలమాయప్రోయాలిఁదలపించెభృంగారుకలితయోర్తు
పూనెఁగాళాంజియొక్కకప్పురపుగంది, యొకవరారోహకీరబాలకముఁదాల్చె
నవిరళయశుండు సత్రాజిదాహ్వయుండు, లోనికొలువున నాస్థాన మైనవేళ.

ఉ. వేదపురాణగోష్ఠియుఁ గవిత్వరసాభినయంబు గానవి
ద్యాదరణంబు రాజనయతంత్రము మంత్రవచఃప్రకారముల్
జూదము నాది యా కళలు చూపిరి తత్తదభిజ్ఞు లాకలా
వేదికెలంకులం దగినవేషము భాషలుఁ జర్య లింపుగన్. ౩౬

క. పంచమముహూర్తమాత్రము, పంచశరప్రభుఁడు ప్రభుఁడు ప్రజగొలువుగొనం
గించిదవశిష్టముగ నే, తెంచెఁ దరణి గగనమధ్యదేశంబునకున్. ౩౭

క. నవలాలితయావన లగు, నవలా లంతఃపురంబున వెడలి దేవా
యవధారు జలకమున కిది, యవసర మనుటయు నతండు నంగీకృతితోన్.

ఉ. రోహణశైలశృంగ మవరోహ మొనర్చు మృగేంద్రురేఖ భూ
షాహళహల్లికారుచులు చాఁగు బళా సముఖా యటంచు ను
ద్గాహ లొనర్చుకంచుకులకంఠనినాదము వియ్యమందికోఁ
గా హరిపీఠి డిగ్గి తగుకట్టడఁ గొల్వుజనంబు నంచుచున్. ౩౯

మ. అతివ ల్దెచ్చిన హేమపాదుకల నొయ్యారంబుగా మెట్టి పా
దతలస్పర్శసుఖంబు మెచ్చుగతిఁ దద్గర్భస్థము ల్గిల్గు లం

చిత నాదంబుగ నుగ్గడింప నొకహంసీయాన చేయూఁది యొ
ల్లెతుద ల్యాభ్యస్థలి జీర వచ్చెఁ బతి కేళీమందమందత్వరన్. ౪౦

గీ. అప్పు డుచిత వేషహారి యై చెలువారు, వారిజాప్తభక్తిసారునకును
సంగనాజనంబు లభ్యంగసౌభాగ్య, మాచరించుపనుల కంగవించి*. ౪౧

సీ. తిలకకస్తూరిపత్త్రిరిబొట్టుపేఁటులు రాల ఫాలమ్ముఁ గెంగేల నొత్తి
క్రొమ్ముడి సడలించి కురువేరు మొగలిఱేకులుఁ జంపకదళంబు లొలిచి తిగిచి
నెత్తమ్మిఁ దొరఁగు తేనియఁ బోలఁ గెంగేల వాసితతైలప్రవాహ మొలికి†
కలువముమ్మొనవంటి ములువాఁడిగోరుల నాఁటి శిరసున కానంద మొసఁగి
పేర్చికరమూలకాంతులుపిక్కటిల్ల, గబ్బిచనుగుబ్బలొండొంటిఁ గదియఁగాను
నులియ నెమ్మోము చెమరింపలలన యొత్తు, పతికిఁ దలయంటెఁ గంకణప్రతతులులియ

క. గందాన నటక లిడియెఁ బు, రందరనిభమూర్తి కొక్కరాజానన కే
లుందొవల నతనిచికురమి, ళిందంబులు సందడింప తేనగ వింపన్. ౪౩

క. జలకం బార్చిరి నిజకుచ, కలశంబులుఁబోలు హేమకలశంబులు చే
తుల నెత్తి మత్తకాశిను, లలసత్రాజిత్తునకు శుభాయత్తునకున్. ౪౪

సీ. జిలుఁగుఁజాద్రికపావడలఁ గడుఁ దడి యొత్తి కట్టించి రుజ్జ్వలక్షౌమకములు
భ్రమితకర్పూరధూపముల మై వాసించి రలఁదిరి జవ్వాదియసలు మేన
మణిగణక్వణితభూషణములు దొడివిరి యునిచిరి కురులఁ గ్రొన్ననలపెనలు
హారివాణముల ఘటించిరి హిమవాలుకాదీపమాలికలు తేఁదేపగాఁగ
హత్తి యపదానములు వాడి రమృతపూర, సారసర్వస్వవశగేయసౌష్ఠవమున
శరదృతువు కాశసంపదఁ బొరయుకరణి, నిడిరి వింజామరలుపతి కింతులంత.

గీ. అధిప తావకకాంతముఖాభిరమ్య, చోరుఁ బట్టితి మని చంద్రుఁ జూపుకరణిఁ
గామినులు దెచ్చితన పురోభూమి నిడిన, నిలువుటద్దములోఁ బతి నీడఁజూచె.

వ. అప్పు డయ్యాధ్యాత్మవేది మాధ్యాహ్నక్రియా కలాపంబులు విధ్యుక్తప్ర
కారంబున నాచరించి యాచారపూతశరీరుం డై యంకురితభానుభక్తిశరీరుం
డై యుండు నవసరంబున. ౪౭

క. మ్రోసె నగడియారమున మ, హాసంకుల రవముగాఁగ యామద్వయసం
ఖ్యాసూచకఘంటాధ్వని, వాసరమదకేసరిప్రవరగర్జిత మై. ౪౮

*అంగటించి. † అలికి. మూ.

ఉ. కంజహితార్చకుండు మణికల్పితదేవగృహాంతరాళవీ
థిం జనుదెంచి కుందనపుఁ దిన్నియ నర్చితుఁడైన సోషహా
రుం జలివిప్పువేల్పుఁ గని మ్రొక్కి త్రివార మొనర్చి హేమపు
ష్పాంజలు లంధకారపరిహారికి సిద్ధపదప్రచారికిన్. ౪౯

చ. కడిగినముత్తికాకృతియకాఁదగు నా నొక పొట్టిటింగణా
వమ వపరంజియుద్ధరణి వజ్రపుగిన్నియలోనితీర్థ మ
ప్పుడు మనుపూర్వకంబుగ నభోమణిభక్తుని కేల నించె న
ల్గడఁ దులసీపలాశకళికామృదుగంధము లుల్లసిల్లఁగన్. ౫౦

ఉ. పాలపయోధి వెల్వడిన పద్మవిరోధియుఁ బోలెఁ జంద్రికా
జాలరసావదాత మగు సౌరనివాసము నిర్గమించి ల
క్ష్మీలలితుం డతండు మణిశిల్పపు భోజనశాలకేగ ను
త్తాలి సరోరుహామృతము లానఁ గొలంకున కేగుకైవడిన్. ౫౧

వ. ఇట్లు వివిధకుడ్యనియోజిత చిత్రప్రతిమం బయ్యును నప్రతిమంబును జాం
బూనదభాజనయోజితాంధం బయ్యు ను ననంధంబును నానారుచిసనాథ
శాకపాకం బయ్యు ను నపాకంబు ను నై వైభవపరంపర యు నుం బోలెఁ
బ్రారబ్ధ భూత భావివాసనా వశంబును సుభటసంభావిత శిలీముఖంబు నుం
బోలె విశదీకృతఫలంబు ను సజ్జనుండు నుం బోలె సంగిసంగస్నేహపాత్రం
బును నలకూబరరణరణకంబునుం బోలె నుపచితరంభాపత్రకంబును సరస
కవిహృదయంబు నుం బోలె యుక్తాయుక్తపదార్థవివేకకలితంబు ను రాకా
రాత్రియుం బోలె నభిరామచంద్రవదనంబును నైన యాభోజనసదనంబునం
బ్రవేశించి పంచార్ద్రుం డై యాదయార్ద్రహృదయుం డుండుటయు. ౫౨

సీ. గమనోద్ధతికినోడిగతిహంసములు గూజితములిచ్చెనన నూపురములు మొరయఁ
గాంచి వజ్రప్రభౌఘము మ్రోఁత లనఁగ దువ్వలువకుచ్చెల బెళబెళలెసంగ
జతనంబు వేఁడికిఁ జాలవు మీకరాబ్జము లనుక్రియఁ గంకణములునులియఁ
గూరలవాసనఁ గొనియాడుగతి వక్త్రగంధాగతాలివర్గమ్ము గెరల
సరససల్లాపరసములచవులు చెవుల, నిండఁ జేయుచు నాయశోనిధికి నిడిరి
సానఁదీఁడినమన్మథాస్త్రములవంటి, హరిణలోచన లమృతదివ్యాశనములు.

వ. భోజనానంతరమున నాతేజోధనుండు విహారప్రదేశంబునఁ గొంతప్రొద్దు
విశ్రమించె నఖిలసైనికు లభీష్టాన్నపానంబులం దుష్టి వహించి రంత. ౫౪

సీ. తనుమేఘమునకు డాసినబలాకలలీలఁ జెవుల వెంజామరకవ దనర్ప
దానంబుగొనిపొగడ్తకుఁజొచ్చుయాచకౌఘము క్రియఁగరటభృంగములు మొ
బద్ధత్వసముచితప్రోథమృణాలవల్లులలీల వలుదకొమ్ములు దలిర్ప [రయఁ
నాకాశసంఘర్షణాసక్తి నంటిన జిలుఁగుఁజుక్కలుబోలె సిబ్బెమమరఁ
జేచిలువరాయఁ డూర్పుపుచ్చినవిధమునఁ
బెరుఁగుమదబృంహితోత్కటబృంహితముల
హస్తిఁ గొనివచ్చి సత్రాజిదగ్రవీథి
నాక్రమావంతుఁ డునిచె దర్పోగ్రవిహృతి. ౫౫

క. ఆకరి సత్రాజిద్ధర,ణీకాంతుం డెక్కి యొప్పె నీరదమును జం
ద్రాకల్పుఁడు మున్నెక్కిన, యాకృతిమై సర్వమంగళాశ్రితుఁ డగుచున్.

సీ. నాగేంద్రఘంటాఘణాత్కారబధిరితవ్యోమ ముద్దామంబు భీమతరము
ఘోటకహేషితాస్ఫోటితనభ మాత్తశుభమును విక్రమశోభితంబు
నతిరథపృథుల శౌర్యాటోపముద్రితదిశము నకృశమును విశదయశము
వివిధాపదానగానవిధేయనారదభటమును జటుల ముత్కటరవంబు
నగుచునిరుపక్కియలయందునబ్ధిలహరి,గహనసంకాశమగుబలౌఘంబు ప్రబలి
కొలువద్వారకకేతెంచెనలఘువిభవ,మూర్తివిస్ఫూర్తిరవిఁగొల్చుపుణ్యమూర్తి.

గీ. హృదయలగ్నుఁ డైనయి దీవరారాతి, వెలికిఁ బ్రతిఫలించు చెలువునించు
నాస్యమంతకము భుజాంతరాళంబునఁ, దాళిసేయు నతనిడాలు గాంచి.

సీ. తపనుండు గాఁబోలుఁ దపనుండ యగునేని మిట్టాడవచ్చునే మిన్ను విడిచి
యనలుండుగాఁబోలుననలుండయగునేనిదొలితొలిఁదలచూపుధూమ మెద్ది
తటిదాళి గాఁబోలుఁ దటిదాళి యగునేని ధళధళ మెఱచి వే తొలఁగవలదె
మణిగిరి గాఁబోలు మణిగిరి యగునేని యిలమీఁదఁ జరియింప నెఱకలెవ్వి
యేదియును గాదు సర్వలోకేశుఁ డైన,మనయశోదాకుమారు భీమప్రతాప
తరణియుదయించెననుచుగోపురముల్కెక్కి,పురముప్రజలెల్లగుజగుజపోయిరపుడు

సీ. ఒకకొన్నిదీధితు లుదధిమేఖలమేనఁ బట్టించుఁ గాశ్మీరపంకలిప్తి
నొకకొన్నిదీప్తులు సకలహరిద్వధూసీమంతసింధూరసృష్టి యొసఁగు
నొకకొన్నికిరణంబు లుర్వీసుతులఁ జేయు గ్రహతారకాకోరకముల ముంచి
యొకకొన్నిభానువు లుడుపథప్లక్షంబుఁబరిపక్వఫలసముద్భాసిఁ జేయు

నడరి యొకకొన్నిరోచులూర్ధ్వాండకర్ప,రంబు నింగిలికపుఁగ్రోవిరంగుదాల్పఁ
జేయుసత్రాజిద్దాదృత శ్రీస్యమంత,కమునఁదోతెంచి జగములుగగురుపొడువ.

వ. ఇట్లనన్యసామాన్య ప్రభాయత్తుం డగుసత్రాజిత్తుండు నిజనివాసంబుఁ బ్రవే
శించి వాసరమణి విశ్రాణితమణిప్రసాదంబు లగు సంపద్విలాసంబులం బెంపు
మెఱయుచుండెఁ దత్కాలంబున. ౬౧

సీ. కుష్ఠాదికవ్యాధికులము సంక్షోభించె జరచేతనైన జర్జరత సడలె
నీతిబాధలు మానె నీతిబోధలు హెచ్చె రాణించె నిత్యకళ్యాణగరిమ
పతిభక్తి వాటించి రతివ లెంతయుఁ దాల్మి నగ్గువ యయ్యె నానార్థతతులు
మొలచె ధర్మమునకు నలుగాళ్లు చనవింకఁ బాషండషండంబు పరిసిపోయె
ధనము లింటింట దండోపదండ మయ్యె
శమము దళుకొత్తెఁ గ్రోధ మాత్సర్య మయ్యె
ద్వారవతివారలకు నెల్లఁ దరణిదత్త
పద్మరాగప్రభావవైభవసమృద్ధి. ౬౨

క. ఆరత్నంబు ప్రసేనకు, మారున కవ్విభుఁ డొసంగె మక్కువ నన్నల్
కూరిచినధనము తమ్ములఁ, జేరదె సౌభ్రాత్రపాత్రశీలముఁ కలిమిన్. ౬౩

శా. సత్రాజిత్తు స్యమంతరత్నజనితస్వర్ణంబులం దెచ్చి స
త్పాత్రాయత్తతఁ గూర్ప నప్పసిఁడి విప్రశ్రేష్ఠు లాత్మాలయ
క్షేత్రాంతస్థలి డాఁచి నించుటఁ జుమీ చేపట్టి చూపట్టెడిన్
గోత్రాదేవి వసుంధరాహ్వయము నుత్శ్లోచప్రచారంబునన్. ౬౪

చ. జడనిధిమేఖలాఘటితసర్వమహీతలవాసులందు నా
కడిఁది ప్రదాతచే ధనము గాననివాఁడు మొగిళ్లక్రిందట
న్నడవనివాఁడు భానుకిరణంబులు సోఁకనివాఁడు వానలం
దడియనివాఁడు గాడ్పు మెయిఁ దాఁకనివాఁడును లేఁడ యెవ్వఁడున్. ౬౫

మ. ఘనుఁ డాతండు సువర్ణవృష్టి గురియంగా వందివాగ్ఘోషగ
ర్జనము ల్దత్తవధూతటిద్రుచులు హారద్యోతవర్షాశ్రసం
జననంబుల్ మణిభూషణద్యుతిమరుచ్చాపంబు దీపింప స
జ్జనతాచాతకజాతికిం గలుగుఁబో సంపూర్ణకామత్వమున్. ౬౬

ఉ. యాదవు లెల్ల నాగుణగణాఢ్యునిసంపద కోర్వలేక హృ
త్ఖేదము నొందు చేయరుదు కృష్ణుఁడు సర్వజగద్విభుండు సం

పాడితయత్నుఁ డయ్యె వసుభారవదాన్యమణిప్రకాండలా
భాదరణంబునందు నితరాభ్యుదయంబున కోర్వ రెవ్వరున్. ౧౯

సీ. విశ్వవిశ్వంభరావిర్భవత్పురరత్న మగుద్వారవతికి నధ్యక్షుఁ డయ్యె
నిఖిలలోకాంగనానివహశిరోరత్న మగురుక్మిణీదేవి కధిపుఁ డయ్యె
రణరంగవిజయకారణహేతికులరత్న మగు సుదర్శనము చే నందికొనియె
రత్నరత్నము నప్రయత్నసిద్ధమ్మున నగుకౌస్తుభముకల్మి హరి యయ్యె
దేవరత్నంబు దానయ్యె దేవకికు, మారరత్నంబుబుద్ధి స్యమంతకంబు
నాహరించుటకూహించెనవనిపతుల, కధికధనవంతులకుఁగాంక్షలగ్గలములు.

— శ్రీకృష్ణుఁ డుద్ధవుని సత్రాజిత్తుకడకుఁ బంపుట. —

క. అవిరళవినయోద్ధవు ను, ద్ధవు సత్రాజిత్తుకడకు దండితఝంఝా
పవనుఁడుహరిపనుచుటయును,రవినిభుఁడతఁడరిగియాదరంగదియుటయున్

చ. ఎదురుగ వచ్చి శేఖరమహేంద్రమణీఘృణిభృంగపంక్తి త
త్పదవనజాతము ల్పొదువ దండనమస్క్రియ లాచరించి య
ర్ఘ్యదుఁ డయి హేమపీఠమునయం దతనిం దగ నిల్పి బ్రహ్మకుం
ద్రిదశవిభుం డొనర్చుపగిది న్వివిధోచితపూజ లిచ్చుచున్. ౨౦

వ. సత్రాజిత్తుం డర్ధఘటికామాత్రం బెడగలసి కొలిచి నిలిచి తదనుమతిం దదంతికంబున నుచితాసనాసీనుం డయ్యె నమ్మహాస్థానంబు ను దానవదేశికాలంకృతనక్షత్రచక్రంబు ననుసరించె నప్పు డాప్రసేనపూర్వజుం డావిప్రవృషభం బుం గూర్చి కూర్చినకరంబులతో ని ట్లనియె. ౨౧

శా. ఆడంబోయినతీర్థరాజ మిల డాయన్వచ్చుమర్యాద నిం
జూడం గోరఁగ నీవ మాకడకు నోసూరీంద్ర వేంచేసి తే
జాడ న్మత్సముఁ డైన పుణ్యధనసంసక్తుండు లేఁ డంబుజ
క్రోడప్రోద్భవు నైనఁ జీరికిని గైకో నింక నిష్పంకతన్. ౨౨

సీ. నీపాదరక్తిమ నేఁడు మాయింటికిఁ బల్లవతోరణప్రౌఢి యయ్యె
నీనఖచంద్రిక నేఁడు మాయింటికి ముత్యాలముగ్గులమురిప మయ్యె
నీవదనప్రభ నేఁడు మాయింటికి దీపితనవసుధాలేప మయ్యె
నీలోచనచ్ఛాయ నేఁడు మాయింటికి నంభోజపత్త్రోపహార మయ్యె
నీకృపారసంబు నేఁడు మాయింటికిఁ, బూర్ణకుంభలక్ష్మి పొలుపు దెలిపెఁ
బరిచితాంగ మైన భాగ్యదేవత నైతి, నీవు మద్గృహమున నోవశీంద్ర. ౨౩

క. ధన మిదె తను విదె వనితా, జన మిదె నారాజ్య మిదె విచారింపఁగ నీ
మనమున కెయ్యది యిష్టం, బనఘా యేనిత్తు నదియె యన నతఁ డనియెన్.
మ. తగునా నన్ను గుఱించి యి ట్లనఁగ సత్రాజిత్త మత్తారిరా
ణ్నగదంభోళి వినమ్రశూలి కమలానాథుండు గల్గంగ హ
స్తగతంబు ల్సకలార్థము (ల్గలఁవ) నీసౌభాగ్య మీక్షించువే
డ్క గాన ల్గాఁగఁగ వచ్చినాఁడఁ ద్రిజగద్గణ్యుండు నన్పంపఁగన్. ౭౫
సీ. పొరసినాఁడో లేదొ పూతనాభూతనారీస్తన్యజీవితారిణరుచులు
నెఱసినాఁడో లేదొ నిర్ఘాతసమపాతవాతాసురాసుచర్వణ మొనర్చి
యరసినాఁడో లేదొ యమరేంద్రకృతసాంద్ర దృష్టిఁ జేష్టలుదక్కు వ్రేలఁ జాల
మొరసినాఁడో లేదొ ముంచిమృత్యువుమించుకువలయాపీడంబుఁ గూల్చుదనుక
వేఁడిదావానలము గ్రోలినాఁడొ లేదొ*
యట్టిశ్రీ కృష్ణునకుఁ బ్రియంబాచరించు
త్రోవఁ జను టొప్పు నీకు నోదురితదూర. ౭౬
సీ. అంభోధిశయనున కభ్యాస మగు ఱొంత యరివాహినీవార్ధిఁ దఱియ నీఁద
గోత్రోద్ధరణకళామాత్రున కేదొడ్డు శత్రుభూభృత్కూటచాలనంబు
చక్రంబు పనిసేయువిక్రమశాలికిఁ బరిపంథిచక్రసంహరణ మరుదె
యగ్నిఁ గ్రోలెడుమేటి కబ్రమే పగతురబాహాప్రతాపాగ్ని పరిహరింప
నాత్మగురుపుత్రు నిజసోదరాలి మరలఁ, దెచ్చు స్రష్ట కశక్యమే దీప్తవైరి
బలము మరలింప రుక్మిణీప్రాణనాథు, తోడఁ జెలికార మొనరింపఁ బ్రోడ వీవ.
గీ. అనుచుఁ గొలువువారి నందఱ ననిపించి, పవనధూతపుష్పనివహ మైన
కురవకమున నలియుఁ గోకిలంబుఁ జెలంగు, పగిది నుద్ధవుండు పలియుఁదాను.
క. రాజిల్లి పలుకు నోస, త్రాజిత్తా హరికి నొసఁగఁదగ దే నీయం
భోజాప్తదత్తరత్నము, భూజనమందార మతఁడు పూజ్యుఁడు గాఁడే. ౭౭
క. ఏరీతిఁ గన్న నే మగు, నీరత్నము హరికి యోగ్య మిది యె ట్లనినం
జోరోపనీతమణికో, టీరము నృపునకు నె తగు ఘటింపఁగ మాళిన్. ౭౮
క. మణి నొసఁగు మొసఁగి గోపక, మణిఁ గొలువు తదంఘ్రిభక్తమణులకుఁ జింతా
మణికల్పకామధేనువు, లణుపరిమాణంబు లగుట యూహ్యఁ దెలియవే. ౭౯
గీ. ఇల జనించినరత్నరాసులకు నెల్లఁ, గర్త యగును గ్రసేనభూభర్త కతఁడు
పన్ని తావకమణియు నీనున్న వాఁడు, యజ్వకునుయాగఫలమిచ్చునగ్నివోలె.

*ఎత్తుగీతిలో నొక్కచరణము లేదు.

చ. కమలదళాక్షునాననము గందకమున్న దినేశదత్తర
త్నము నొసఁగంగఁ బాడి, హలధారిముఖాఖిలయాదవు ల్మహో
ద్యమమున నీపయిం గవియఁ దార్క్ష్యానుకర్షవృత్తి మాన్చి శాం
తముగ నొసర్చెఁ జక్రి కలదా యిలఁ దాదృశచర్య యేరికిన్. ౮౩

మ. రవివిశ్రాణితరత్న మేమిగుఱి యీరాధా మురారాతికిన్
ద్రవిణప్రాప్తియ చూచెదే వినుము రాధానాథుకారుణ్యగా
రవరాజన్నయనాంచలం బభిమతార్థశ్రీల నీఁజాలదే
ధ్రువముఖ్యు ల్గనుఁగొన్న వైభవముఁ జేతోవీధి నూహింపవే. ౮౪

చ. అన విని యుద్ధవుం బలుకు నర్యమభక్తిసమగ్రచిత్తుఁ డో
యనఘవిచార మీర లిటు లాడఁగ నేటికిఁ జూపి మోపి యం
జనఘననీలవర్ణుని ప్రచారము వింతయె వెన్నతోడఁ బె
ట్టినయవి సవ్యసాచిశకటీవినియంతకు నిట్టిదాష్ట్యముల్. ౮౫

మ. సడిగాకుండఁగ నుగ్రసేననృపు భిక్షావృత్తిపట్టంబునం
దిడి, కంసార్జితరత్నకోటులు మహాహేమంబు లాందోళికల్
పడఁతు ల్పర్వతసన్నిభేభములుఁ రథంపాసంపతద్వాహము
ల్నడిపించెం దనయింటి కీ వెఱుఁగవే నారాయణుం డుద్ధవా! ౮౬

ఉ. ప్రొద్దుగుణంబునం గనినపూసకు నాహరి యాసచేసెఁ గాఁ
దద్దయుఁ బ్రేలగింజయును దైవముకంటికిఁ బెద్ద యయ్యె నే
ముద్దుటనుంగుఁదమ్మునకు మున్నె స్యమంతక మిచ్చినాఁడ నే
వద్దన వాని నీ వడుగు వాఁడు నొసంగినఁ గొమ్ము నెమ్మదిన్. ౮౭

ఉ. సీరి సహస్రశీర్షుఁ డగు శేషుఁడు శేషునికేమి భ్రాంతి యం
భోరుహరాగరత్నములు భోగతటంబులఁ జక్రి వక్రియై
పౌరుషకాంతు నమ్ముసలి ప్రక్కలుదట్టిటు వచ్చె నేనియుం
బోరెద మీఱెద న్విపులపాంక మడంచెద నాక్రమించెదన్. ౮౮

క. కృతవర్మసాత్యకిప్రేరిత మై యదుబలము పొదివి రేసినయేనిన్
శితధారఖడ్గధారల, శతధా భిన్నముగఁ జేసి సమయింతు ననిన్. ౮౯

క. కరవాలఫాలనయనున, కరియువతిదృగంజనంబు హాలాహలముగాఁ
బెరిఁగెద సురిఁగెద నే యిఁక, హరి గినియు నటంచుఁ గలని కార్యస్తుత్యా.

చ. అని యిటులాడ నవ్వెడఁగు నన్నయశాలి యదల్చి మూర్ఖ యీ
చెనఁటిదురుక్తు లేల యదుసింహుని కేగుఱి నీదురత్న మా

యన మును విక్రమించినఁ బరాక్రమలీలల శక్రశుక్రలో
చనవనజాతజాతులకు శక్యమె నిక్కము నీ వెఱుంగవే. ౯౧

వ. అని తదాస్థానంబు వెడలి యమ్మానధనుండు మాధవునకు నవ్విధంబుఁ గొంత
కొంత యెఱింగించెఁ బద్మనేత్రుండును సత్రాజిద్రత్నాభిలాషంబు సడలి భువ
నంబులు పోషించుచునుండె నంత. ౯౨

— గ్రీష్మర్తువర్ణనము —

శా. హారాలంకృతయావతస్తనము నృత్యత్తాలవృంతంబు నీ
హారానేకపకూటపాకలము యామాయామవద్ఘస్ర మం
భోరక్షఃకులవిష్ణుచక్రము దలదుర్భారిప్రసూనచ్ఛటా
సౌరభ్యాహృతభృంగధైర్య మిల గ్రీష్మం బావహిల్లెం గడున్. ౯౩

శా. ఆసాయంబును గ్రీడలాడుహరిమధ్యానాభికూపంబులం
గాసారాంబువు డిందిన ట్లివిరె మార్గాంబుప్రపావారిసే
కాసారంబునఁ దర్పితాధ్వగమునై యాయాసముం బాచి మ
ల్లీసౌరభ్య మదభ్ర మయ్యె మరుఁ డేలెం గాముకానీకమున్. ౯౪

చ. గగనము రుద్రమూర్తి యగుఁ గానఁ దదుజ్జ్వలఫాలలోచనం
బగుచు వెలుంగు నుష్ణకరుఁ డంగజుగర్వ మఖర్వ మయ్యె ము
జ్జగములు దైత్యరాట్త్రిపురసామ్యము మైఁ దపియింపఁ జొచ్చె న
ప్పొగపున ధూమ్రభావమునఁ బొందె నశేషదిగంతరాళముల్. ౯౫

సీ. సలసలఁ గ్రాఁగు నబ్జమరందమును మూతి ముట్టదించుక యైన మొకరి తేఁటి
విహరింపఁగా నోడు గహనదేవత సూర్యకాంతభూములఁ బొక్కుఁ గాళ్లటంచు
ననలజిహ్వాశంక నాస్వాద మొనరింప దడవికోయిల యెండ నుడుకునిగురుఁ
దలచూపవెఱచు నంచలు పద్మవనకుటీమందిరంబుల నీఁగి మాపుదనుక
మడువునసలునఁ గిటిపలు మాఱుఁ బొర్లుఁ, గాసరము రోఁజు నోరు వెగ్గలము విచ్చి
తడుపుఁ గుత్తుక పులుఁగు లుదగ్రధూళి, ధూసరములైన గ్రీష్మర్తువాసరముల.

చ. జలములఁ గ్రోలుచుం గిసలశయ్యలఁ దేలుచు సంగమస్పృహం
దొలఁగుచుఁ గుంజపుంజములఁ దూఱుచుఁ దాపవికార మాఁగుచుం
గలయఁగ మేనఁ గ్రొత్తవలికావులు గట్టుచు పీతరాగులుం
బలెఁ జరియింతు రాతపసమాగమనంబున నెల్లభోగులున్. ౯౬

గీ. సవిత ప్రకటించుముందు వేసవి ధరిత్రిఁ, గాఁడి నెఱియలు వాసినఁ గానవచ్చె
భోగిలోకంబు సీరింకు పుష్కరిణులఁ, దోఁచు నెలదూఁడు మొలకలతోఁ గరుఁ దెగడి,

సీ. లలనాధరాసవంబులును జ్యాక్షైరపానకంబులు నందంద కలుగఁబట్టి
మోహినీకుచహారములు నరవడుగుదువ్వాలువలు నందంద కలుగఁబట్టి
రమణీభుజావేష్టనములు మల్లీమాల్యకంబులు నందంద కలుగఁబట్టి
తరుణులయూర్పులుఁ దాలవృంతానిలాఘాతంబు నందంద కలుగఁబట్టి
చందనార్ద్రింబు లైనపూర్ణేందుముఖుల, వలుదపాలిండ్లపంచలు నలదలతల
గర్భగృహములు నందంద కలుగఁబట్టి,తపమునకునోర్చిరవ్వసుధాజనములు.
సీ. పెనముపై నట్టు వోసినలీలఁ జుయ్యంచుఁ బొలసి వెన్నెల తప్తభూధ్రశిఖల
నుష్ణోష్ణాన ముఖానిలోద్ధతిఁ జల్లార్చి తేఁటి చెందొవపూవుఁదేనె లానె
నఖిలావదాతాంగియై చుఱుక్కున నిసు మడుగంటఁ బ్రియునింటికరిగె జార
కబళించె నుఱక యాఁకటి కోర్వక చకోరి నిష్టప్తరోహిణీనేత్రకళలు
మల్లియలపూవుదుమ్ముముమ్మరముమున్ను,రాగ్నిశిఖలంచువిరహియారాటమందెఁ
గలువవికసించియునుగసుగందిమొగము, ప్రాల్చెవైశాఖపూర్ణిమారాత్రులందు.
సీ. దవధూమ మభ్రంబునవిఁ బొదలోనుండి నెమిలిపిల్లలు నిక్కినిక్కిచూచు
మరుమరీచికలు వేసవిఁజూచి జలబుద్ధి నరుగుఁ బిపాసార్తమైమృగంబు
లవె మెట్టకెందమ్ము లని సూర్యకాంతాగ్నికీలలఁ దునుమ నుంకించు నంచ
సురగాడ్పుమెదుము ప్రసూనపరాగాళిఁ గదిసి తేఁటులు తావిగనమిఁదిరుగుఁ
బాంథు లాకులురాలినపాదపములు, డగ్గఱియు నీడఁగానమి బెగ్గిలుదు
రధికలోభాంధుసిరిభోగ్యమనిభజించి,యర్థమొదవమి వెతఁబొందునర్థులనఁగ.
మ. కలహంసీగరుదాభతల్పములపైఁ గర్పూరరంభామిళ
న్నలదాకల్పితకాయమానములక్రిందం గమ్మగొజ్జంగమొ
గ్గలచే నల్లిన తాళవృంతములతోగాడ్పు ల్విసాళింపఁ గాం
తలగంధార్ద్రకుచప్రఘూణముల నిద్రల్గంత్రు భాగ్యాధికుల్. ౧౦౨
గీ. *చనుపకముల తావి గొనక రోజాలుండి, తేఁటిమలక మల్లెతెల్లవిరుల
చందుచూచి విరహజయకాంక్షమై దుగా,నా యొనర్చె నుత్తరాయణమున.
గీ. వెదురు వెదురురాయ నొదవినకార్చిచ్చు, గుండెనిగులోనర్చెఁగొండలకును
వంశభేదవైరవైశ్వానరంబున, భూభృదర్దనంబు పొడమదెట్లు. ౧౦౪
గీ. ధరణి నెనైన్నఁ గలుగనీ తాపశాంతు, లాతపంబున నాతపం బడరువేళ
హారఘనసారగంధసారార్ద్రయువతి, కఠినవక్షోజములె శైత్యకారణములు.

---

*ఈపద్యములో మహమ్మదీయసంప్రదాయము-రోజాలు=ఉపవాసములు. మలక=మహ
మ్మదీయుఁడు, చందుచూచి=చంద్రదర్శనముచేసి- దుగానా=రెండుదండప్రణామములు.

చ. కలువలు వేనలిం దుఱిమి గందము తావికిఁ జిక్కఁబూసి పై
వలిపము గట్టి ముత్తెపురువాణములం దులకించు వల్లభో
రులపయి నిద్రవోయెడుసరోరుహగంధులఁ జూచి వారిచె
న్నలమియు నచ్చర ల్వగతు రక్షులు మూయమి నిద్రరాములన్. ౧౦౬
గీ. వటవిటపినీడనొకకొంత వామదృశల, కుచలికుచముల నొకకొంతకూపవారి
యందునొకకొంతనిలిచె గ్రీష్మావశేష, మేమిసేయునొయెఱుఁగరాదింత మీఁద.
చ. నులివడి వారిదాళి నళను ల్తలఁదూర్చుట శంభుఫాలదృ
క్కలిక కరంబున న్విసనకఱ్ఱ వహించుట యూర్వ మబ్ధిలో
నిలుచుట సూర్యుఁ డంబువుల నీడలు చూచుట గ్రీష్మకాలసం
వళదురుతాపమోర్వమిన వారల కావిధ మూర కేటికిన్. ౧౦౭

— ప్రసేనుఁడు రైవతకపర్వతమునకు వెడలుట. —

ఉ. ఆసమయంబునం దొకదినాగమవేళఁ బ్రసేనుఁ డభ్రగం
గాసమవర్ణమైనతురగంబుపయి న్వరదంబుదంబుపై
వాసరభర్తచందమున వట్రిలి నెయ్యురు గొల్వ నేగె న
వ్వేసవి వేఁడి రైవతకవీరుదిలారుహవాటి నాఁపఁగన్. ౧౦౮
సీ. తరుణరాజావర్తదండంబు లైననేజాలు పెంజిలువలజాతిఁ దెలుప
డాలొందు కెంపుఁగేడాలు వేలాయాతకూర్మకులచ్ఛాయఁ గూడఁదివియ
నీలంపు వజ్రాంగిజోళుల నెఱరంగు జలపాయిజలదకజ్జలముగాఁగ
హాళహాళికాలాపహయహేషితాటోపములుమహోర్ముల మ్రోఁతమూదలింప
బిరుదుటెక్కియములుమీలపిల్లపదుపు, పొదువువొదలంగఁజేయ నంభోధిగన్న
మాఱుబొందియుఁబోలెఁగుమారుసేన, నడచె నెడయాక రైవతనగముగుఱిచి.
క. వీరుఁడు ప్రసేనుఁ డటుతం, జేరుచురతనంపుఁబొద్దు సేవించు సితాం
భోరుహము లనఁగ వెన్నెల, గాఱు ధవళచామరములగములపుడమరెన్.
క. సత్రాజిదనుజధవళ, చ్ఛత్రము దీపించె గ్రీష్మసమయవ్యథఁ ద
న్నేత్రాంశుకుముదపుష్ప, క్షేత్రంబున నడఁపవచ్చు శీతాంశు క్రియన్.
మ. పొలఁతు ల్వంశవతంసచంద్రవలయంబు ల్మట్టుచుం గర్ణకుం

క. పరిపరివిధములఁ దేజీ, సరళీకృతమురళి గెరలఁ జని పతి గనియెం
బరిపూరితకందరని, ర్జరవీణాధైవతకము రైవతకంబున్. ౧౧౪

— రైవతకపర్వతవర్ణనము —

గీ. మదకలపికస్వరామ్నాయమధురిమంబు, కొండయెలమావికొమ్మలనిండుకరణి
వేల్పుగాణలు శిక్షగావించునలయ, లంక్రియలు సిద్ధకన్యాకులంబువొదువు.
గీ. కొఱలుఁ గొండ కొప్పెసూటంబు లభ్యస్త, గారుడాశ్మరుచులు గప్పికొనఁగ
వెండి బసిఁడి సేయు వేడుక సిద్ధులు, చాలఁ మందుపసరు చమిరి రసఁగ.
గీ. కొండకోలఁకులందుఁ గోకనదంబుల, నంచగుడ్లు లమరు నమరయువతి
హస్తలగ్నజలధరావిర్భవస్మారక్తి, కములగములచెలువుఁ గౌఁగిలించి. ౧౧౭
క. ఇలమోచుపనికిఁ దలచీ, రలుచుట్టిన పగిదిఁ గుధరరాజము శిఖరం
బులు వోల్చు మేఘరేఖా, వలయిత నిజగౌరవప్రవర్ధనలబ్ధిన్. ౧౧౮
గీ. మాసరము లైన మదమత్తకాసరములు, లీలఁ గోరాడ వెండిఱానేలదుమ్ము
ప్రాంతవర్తిష్ణుసప్తర్షి పరివృఢులకుఁ, బ్రతిముహూర్తంబుభసితచర్చలుఘటించు.
సీ. దూర్వాదళభ్రాంతి దులకించు పచ్చఁరుచికి లోనై చిక్కు రురుకులంబు
పరిపక్వబింబికాఫలబుద్ధి విద్రుమద్రుమలతాంకురములఁ దొడుకుఁ జిలుక
వలమానకందరావజ్రాంకురచ్ఛాయ నవమృణాళ మటంచు నమలు నంచ
వనమయూరము గేరు వలభేదిమణిఘృణిఘనము ఘనాఘనౌఘంబుసావిఁ
దళుకులొదవించువెన్నెలమొలకలంచు, మదచకోరికముత్యంపుటదరుఁగొఱుకు
బంగరువునిగ్గు చంపకప్రసవకలిక, లని శిలీముఖ మలయిక నందు నందు.
ఉ. నిచ్చఁ బసిండిఱామొరపనేలల రత్నము లేఱి తెచ్చి వై
యచ్చరకన్య లాశిఖరి నచ్చనగండులయాట లాడి మై
నొచ్చియు సేదదేఱుదు రనోకహపల్లవలాస్యకర్త యై
వచ్చుసుగంధగంధవహవారితభూరితరాంగఖేదలై. ౧౨౧
గీ. మొదల నాగవాసములపొందు గలిగించి, సానులకును రాగసరణి దెలిపి
తెలుపు మంచికూటముల యిమ్ము తారల, కచలభర్త సరసుఁ డైనకతన.
చ. చటులచపేటఘాతముల సామజకుంభములం బగుల్చుచుఁ
జోటజోటఁ గాఱు క్రొమ్మెదడుఁ జుబ్బనచూఱఁగఁ గ్రోలుసింగముల్
సటలు విదుర్పఁ దోఁచు నెఱసంజకు(వారక)తారకప్రభా
ఘటన దొసంగుఁ దద్గళితకమ్రవినూతనశుక్తిజావలుల్. ౧౨౩

క. పౌలస్త్యబాహుహృతహర, శైలేంద్రముఁ బోలుఁ గొండ సమధికతాళీ
పాళీప్రాచీనంబున, వాలుచు * దుర్వర్ణవర్ణవర్ణిత మగుచున్. ౧౨౪

ఉ. కిన్నరకామినుల్ పసిఁడికిన్నెర లంది యఖిన్నరీతుల
న్వన్నని నాలతింపఁ బృథివీధరరాజము సాత్త్వికోదయ
చ్ఛన్నశరీర మైనక్రియఁ జంద్రశిలాజలధారలం దటో
త్పన్ననవీనవజ్రపరభాగమున న్విలసిల్లు నెల్లెడన్. ౧౨౫

క. అలకాంతకాంతవదనలఁ, గులకాంతలఁబోదలి చన్నుఁగొండలయందు
న్వలకారు లైనదానవ, కులకారులు నింతు రందుఁ గుంకుమలతికల్. ౧౨౬

క. నవరాల గెల్చి చీఁకటి, నవరాలుచుకురులు గలుగు జవరాలికొలం
బు విరాళిగొనఁగ వేణువు, లవరాళి ఖచరవరాళి లలి నింపుగిరిన్. ౧౨౭

సీ. బుసకొట్టుపెంజిల్వనిసువులు ఫూత్కారఘోరహస్తస్ఫూర్తికొమరుదెలుపఁ
బవమానగర్భ మై రవళి దెల్పుగుహాళి ప్రబలబృంహితవక్త్రరంధ్రములుగ
నెలమేటిచేఁ జెమ్మగిలుపాదములు మదోద్గారి పంకిలపదగరిమఁ దెలుప
సంచారిజలధరచాంచల్యము విలోలకర్ణశూర్పంబులఁ గరము నూప
భద్రదంతావళమ్ములపగిది నితర, శైలరాజమ్ము లురుతపోద్వేలలీల
మలయ నక్కొండ సార్వభౌమత్వమందు, దాననవనిధికర్తృతాధన్య మయ్యె.

శా. చంచచ్చంపకపుష్పసౌరభము నాస్వాదించి మూర్ఛాదశా
చాంచల్యంబునఁ దూలు భృంగముల నాశ్వాసించి కన్నూచుక్రొ
మ్మించువెన్నెల సేదదేఱుతురు నెమ్మిన్ రైవతాద్రిస్థలిం
జెంచుంగొమ్మలు నైజకుంతలరుచిశ్రీమిత్రు లంచుంజుమీ. ౧౨౮

క. గిఱికొనుదవానలమునకు, † వెఱవదు గిరి వేల్పురాచవెలఁదులమోము
ల్తెఱవఁగ నీరగు నెలఱాఁ, దఱుపులు దనయందుఁ గలయఁదలకొనుటఁజుమీ.

గీ. అడరి యభ్రంకషంబగు నన్నగమున, నిగుడుహరిహయనీలమాణిక్యకాంతి
తమముసవివిప్పనుంకించి తమముసావి, వెఱచి పఱతురు చలివెల్గు వేఁడివెల్గు.

సీ. కడవఁబుట్టినమౌనిఁ గడవనేరక క్రుంగె వింధ్యంబునుద్రేకవిభవమెంత
విల్లయ్యె రుద్రున కిల్లయ్యె వేల్పుల కమరాద్రిప్రాధాన్య మనఁగ నెంత
బలుపాఁపమలఁకచుట్టుల బిట్టు లావఱి తిరిగె మందరగిరి ధృతియు నెంత
వడి దూలి వెసనెత్తువడియె మందోదరీవిభునకుఁ గైలాసవిభవ మెంత

* దుర్వర్ణము=వెండి, దుష్టవర్ణముగలది. † వెరవకు-ము.

సగముగనవచ్చియునుమఱిసగముగానరానివలయాచలము గిర్పుదానదెంత
యనుచుఁ బవమానపూర్ణగుహాస్యసరణి, నట్టహాసంబుసేయునాగట్టుతేఁడు.

గీ. వన్యమహిషవిషాణముల్ వ్రచ్చివైవఁ, గాఱు నగ్గిరి నవవజ్రకందళములు
శూలిశూలాగ్రదళితరక్షోగజేంద్ర, కుంభనిర్ముక్తమౌక్తికాంకురము లనఁగ.

వ. వెండి యు నక్కొండ పుండరీకాక్షుండు నుం బోలె వసుదేవప్రియం బై యం
బుజగర్భుండు నుం బోలె వివిధభువననిర్మాణకర్మఠచతురాననం బై త్ర్యంబ
కుండునుం బోలె శిరఃస్థవిహారణనిపుణహరిణలాంఛనం బై వజ్రధరుండు
నుం బోలెఁ బ్రవర్షణాధిక్యహేతుభూతం బై భూతసృష్టియు నుం బోలె నతి
విచిత్రంబు ను జిత్రకారుండు నుం బోలె నశేషాచలప్రతిమాకుశలంబు ను
గుశలవజననియుం బోలె ననలప్రవేశవిశుద్ధంబును నై వెండియుఁ బలిసదన
గామి చరణన్యాసత్వంబున వామనావతారంబు నభినయించుచుఁ గల్పాం
తరస్థాయి ఫలప్రదంబగుట నందనవనంబుతోడఁ బొందువడయుచు ధాతు
వికారవినిర్ణయవర్ణితంబగుట నగదంకారగౌరవంబు నిచ్చుచునిచ్చక్రొత్తలగు
తత్తాదృశవిభవంబుల నభిరామం బయ్యె నందు. ౧౩౪

గీ. అపుడు యదువృష్ణిభోజాంధకాదిబంధు
జనులు గొల్వఁ బ్రసేనుండు సమదయువతి
పరికరముతోడ దీపించె భద్రగజము
కలభములు వశలును గొల్వ నలరుకరణి. ౧౩౫

సీ. రమణులు వెంజామరములు వీవకమున్న చమరవాలవ్యజనములు మెలఁగె
మెలఁతలు పన్నీరు మీఁదఁ జిల్కకమున్న చనుదెంచె నిర్ఝరజలకణములు
సతులుగంధార్ద్రకుచములుచూపకమున్నడాసెవజ్రంపుఁగూటములగములు
వనితలు చెంగావివలువ లీయకమున్న కప్పె గైరికరజోగౌరవంబు
సలిలకేలివిహారాతిశైత్యగాత్ర, లతలు చెలువలు మైమచ్చు రతికి మున్న
పూవుఁదేనియఁ దడిపిన తీవ లలమె, నా ప్రసేనుని రైవతకాచలమున. ౧౩౬

క. చెలువలుఁ జెలులు భజింపఁగ, నలరైవతనగమునందు నతఁడు చరించెన్
బలితపుమెఱపులుఁ జాతక, ములుఁ గొలువఁగ నందు వ్రాలుమొగులున కెనయై.

సీ. ఊరుకూటముల యందుఁ జఱియించుఁజఱియించి కామినీవక్షోజగరిమఁ దెగడు
నవనవనిర్ఝరాంబువు లంటు నంటి కొమ్మలమేని చెమటలఁ జులుకసేయు
నడవియనంటుల ననఁగు ననంగి రామామృదులోరుసామగ్రి మఱచు
బింబఫలంబులు పీల్చుఁ బీల్చి పురంధ్రిమధురాధరంబులమమత సడలుఁ

గొలఁకుఁదామరనెత్తావి గ్రోలుఁగ్రోలి,మదవతీముఖగంధంబు మదిఁ దలంపఁ
డభినవప్రియులైన ధరాధిపతుల, నడక లన్నియుఁ గంధాంధనాగగతులు.

క. గురివెందపొదలఁ గురవక,తరువుల నెత్తమ్మికొలఁకుదండంబుల నా
సరసాగ్రేసరుఁ డలిపిక, మరాళగతి సంచరించె మలయఁగ నంతన్. ౧౩౯

ఉ. వారుణిమీఁదఁ గోర్కిగల వాసరరాడరుణాంశుకంబు నం
భోరుహలక్ష్మి తమ్మివిరిమోడుపుఁగేలునఁ బట్టి తివ్వ దు
ర్వారగతిం జనుం దరణి రాగరసాంచితపూర్తి (మూర్తి) న
న్యారతిసక్తచిత్తులకు న్యాయమునం జనురీతి గల్గునే. ౧౪౦

క. అరమొగుడుచుఁగెందమ్ముల, విరితేనియ యొప్పు రత్నవిగచితపాత్రాం
తరమధువుఁ జరమసంధ్యా, తరుణి ప్రసేనునకుఁ జూపెఁ దానపు డనఁగన్.

గీ. పగలు నెత్తమ్మిపూవులఁ బ్రబలు లక్ష్మి, సంజప్రొద్దునఁ దొగలకుఁజనఁ దదంఘ్రి
లాక్షయంటినలీలఁ గొలంకులందుఁ, బర్వె నెఱసంజడాలుదృక్పర్వమగుచు.

గీ. కాలగరుడమూర్తి ఘస్రాహిఁ దివియంగ, నంగకలితరక్త మయ్యె సంజ
ఫణమునందు జాఱిపడినరత్నం బయ్యె, గగనరత్న మబ్ధికడకు డిగ్గి. ౧౪౩

గీ. మిఱిమిఱిచీఁకటికొదమల, నెఱసంజమెఱుఁగు లెగసి యుఁపొదవించెం
దఱిఁ జెంచెతచనుగుబ్బల, గిఱికొను గుంజాఫలమ్ము (కెంపు)న కెనయై. ౧౪౪

సీ. జక్కవమదిఁ జేరె సకలావనీచక్రమాక్రమించు విదాహాహావ్యవహాము
ప్రస్థానపటహ ముద్భటభంగిఁ జఱపించె రతిరాజు వే పుల్గురవళిచేతఁ
జిమ్మించుఁగ్రొన్నీరుచెన్ను లలాటామృతముగాఁగ విధుశిలాతాప మడఁగెఁ
బరదేశ మరుగుచోఁ దరణి యిల్లడయిడు నిసువులై గృహదీపవిసర మమరె
వీచెఁ జలిగాడ్పు నెత్తమ్మివిరులు నిద్ర, బోవఁ జుక్కలు మింటిపైఁబొడవుసూపె
నత్తమాలద్రుమంబున ననలకరణిఁ, గలువకనుకుట్టుమ్రందుతత్కాలమునను.

క. రజనీవికాసమన్మథ, విజయంబులసందు లదుకు వెలిగారము తో
యజవైరి యుదయ మయ్యె, న్నిజకరదీపములఁ దిమిరనికరము లడఁగన్.

గీ. గగనభల్లూకముఖ మైన కమలవైరి, పేర్చి కరముల నెఱసంజ పేరిచెదలు
పట్టుకొనిమ్రింగెఁగైరవోద్భటమరంద, మనెడిపెరతేనెనానందమధిగమించె.

గీ. చెలువుఁ డిచ్చు నీలిచీర ముంగోరునఁ, దారతమ్యమరయఁ దరుణియెత్తు
గతి నఖేందురేఖ గాఢాంధకారంబు, నిబ్బరము నొకింత యుబ్బలెత్తె. ౧౪౮

సీ. హరజటాకూటదీవ్యన్నవ్యకంకేళి పూర్వదిక్కాంతాకపోలపాళి
యనురక్తి రేచామ యఱుతఁగట్టిన తాళి వనధరపథసరోవరమరాళి

సకలదిక్పరిపూర్ణ చంద్రికారింఛోళి యుడువుల గిలిగింత లిడుపిసాళి
దర్పితతిమిర భూధరకూటదంభోళి కైరవవదనకర్పూరధూళి
హిమములకుఁ జెన్ను మురవైరియెడమకన్ను
పద్మములవాడు వేలుపుఁబాలకూడు
సారసౌందర్యపరసీమ చందమామ
యుదయమునఁ బొల్చె నెంతయు నొప్పుగాల్చి. ౧౪౯

క. ఆసమయమునఁ బ్రసేనుం, డాసవరసలోలహృదయుఁడై విధుకాంత
ప్రాసాదచంద్రశాల వి, లాసవతీజనము నలుగెలంకులఁ గొలువన్. ౧౫౦

సీ. చెంద్రిక నిడినట్లు చెరివిన నునుసేసకొప్పుపువ్వుల ఘుమఘుమలునిగుడ
గంధానుమేయ మాఘనసారమయచర్చ నివ్వటిల్లిన నిగనిగలు గునియ
నాణిము త్తెపుఁ గంఠహారంబునందలి తళుకుమీఱిన ధళధళలు చెలఁగఁ
జంద్రికాపునరుక్తిజనక మా నఖళియాదళిమంబు ధగధగద్ధగలు మొగువ
మదచకోరంబు విధుకళాభ్యుదితసుధకు, నంగవించు విధమ్మున నతివ లిచ్చు
కాపిశాయన మాసించెఁ గంతువింటి, కొప్పుగవఁదేఁటిలే నారిగొనలుసాఁగ.

సీ. పూర్ణచంద్రిక లనుపువ్వారుఁబోఁడుల మందహాసప్రభాకందళములు
మలయానిలంబులు మదవతీలోకంబు కమ్మనియూర్పులగంధలహరి
సౌధస్థలంబులు చంద్రబింబాస్యల వలిచన్నుదోయి కౌఁగిళులబిగువుఁ
గందర్పచాపటంకారంబు నువిదల మణితాభినయకళామంజిమంబు
మంచియుపదంశకంబులుమానవతుల, ముద్దుఁగెమ్మోవి తేనెలముమ్మరములు
నాసవాస్వాదపరుఁడైనయాప్రసేను,చిత్తమున(గలఁ) ధైర్యము వ్రేత్తుగొనియె.

గీ. పుష్పముకుళస్థ మగుతావిఁ బొదలఁజేయు
సమయమునఁ బోలె సీధుసంజనితమదము
వెలఁదులవిలాసదశ లెల్ల విఱుగఁజేసె
నించువిలుకానిజయసిద్ధిహేతు వగుచు. ౧౫౩

సీ. నిజకనీనికల క్రొన్నిగ్గులు వాసనోత్పలపత్రములసావిఁ బాఱమీటుఁ
బ్రతిబింబితేందుబింబము గల్ల మనుబుద్ధి వేమాఱు ముంగేల వెరఁజివైచు
మోవి చేఁదివియు నామోద మగ్గలమైనఁదలగంటగించుఁ గాతాళమొందు
ముంచి పానఃపున్యమున నాథునధరంబు నుపదంశబుద్ధిమై నుఱక కొఱుకుఁ
బాడు నూరక తేఁటులతోడముచ్చ,టాడు నసియాడు నొకగుబ్బలాఁడి వాఁడి
మీఱుమదిరామదంబునమేనుసోరిగి, మదనుఖడ్గంబునొఅనుండి ప్రిదిలిప్రాల.

సీ. కంఠకంబువునందుఁ గరమృణాళము చుట్టుఁ జిగురాకు వ్రేళులఁజిక్కనొక్కు
బింకంపుగుబ్బలు పేరురంబున గ్రుచ్చు నిర్విశంకంబుగా నీవి జార్చుఁ
జుఱుచుఱుక్కన మోవిసుధపంక్తులఁ గ్రోలు సోఁకించుమశితంబు శ్రవణసీమునుఁ జొనుపుఁ
గల్ల చేసితి నని కాలిదమ్మికి మ్రొక్కుఁ దొడలపై నెమ్మేను దూలి వ్రాలు
బాధముగఁ దప్పొనర్చిన భర్త మున్ను, ప్రార్థనలు పెక్కు చేసినఁ శాపమాని
తరుణిమదిరామదంబునఁదనకుఁ దానె, యంతరంగంబులో నానియలుక మాని.
సీ. ఈసుధారోచికి నిఁక నింతమీఁదట స్వర్భానుభవభీతి సడలుఁగాక
యీకమ్మతెమ్మెర కిఁక నింతమీఁదట ఫణిచేతియలజడి వాయుఁగాక
యీ తేఁటిదాఁటున కిఁక నింతమీఁదటఁ జనుపకంబులశంక సడలుఁగాక
యీవలరాయని కిఁక నింతమీఁదట మేను లే దనుమాట మానుఁగాక
శుక్రశాపదోషవక్రిమ యిఁక నింత, మీఁద మధువునకును మేళవింప
కుండుఁగాక యనుచు నొకయింతియలుచొక్కి, చొక్కిచొక్కి పలికె మ్రొక్కిమ్రొక్కి
గీ. యామినీలక్ష్మి వివిధ విహారగతులఁ, గెరలు కాంతామణులను వీక్షింపఁగోరి
కలయ నుత్తానితము లైనకన్ను లనఁగ, పొరిదిమై రేయరసపూర్ణశుక్తులమరె.
మ. కలవీణారణనంబుఁ జంద్రవలయక్వాణంబులుం జెంగుమీ
టులు వంశీస్వరతానమానములు సాటోపప్రసూనాస్త్రచా
పలతాఘోషముఁ గామినీగళగళత్పర్యాయనిర్ముక్తభా
షలు రాగాంబుధివీచిగర్జితమనీషం జేసె ఘూర్ణిల్లుచున్. ౧౭౮
సీ. ఇది కన్నుదమ్ముల కెలసంజ యగునేమొ కాదేని ముకుళింపఁగాఁ బనేమి
యిది కొప్పుపువ్వుల కెలయుగాడుపోయేమొ కాదేనియవిరాలఁగాఁ బనేమి
యిది సిగ్గుబీగంపుగుదికిఁ జేయగు నేమొ కాదేని మరలి పోఁగాఁ బనేమి
* * * * *
యనఁగ మదిరామదము హెచ్చి యబ్జముఖులఁ
బతుల నొక్కటిగావించి పరిణమింపఁ
జేసి ధూతవిచేష్టితోద్భాసియయ్యె
రైవతకశైలకందరప్రాంగణమున. ౧౭౯
క. సత్రాజిదవరజునకును, సుత్రామసమానవిభవశోభితునకు నా
రాత్రి శివరాత్రి యయ్యెను, జైత్రరతిక్రీడఁ జేయు జాగరముతమిన్.
మ. ఉపధానీకృతబాహుశాఖములు ఘ్రాణోద్వాంతనిశ్వాసగం
ధపతద్భృంగనిభాలకాంచలపరీతస్విన్నఫాలాగ్రముల్

ద్వీపదీగర్భితమర్మదేశములు గంధీవాసనాపూర్ణవ
క్త్రపుటంబు లున్ఖసుప్తిసౌఖ్యములు వేడ్కఁ గ్లా యువశ్రేణికిన్. ౧౬౧

చ. అలరుల వృంతబంధముల నంటులు విప్పుచుఁ దమ్మిపూవు మొ
గ్గల*గిటిగొన్న నిద్ర దొలఁగ న్సరసీసలిలంబుఁ జిల్కుచుం
దెలతెలవాఱ నొయ్య నరుదెంచి నిశాంతరతాంతతాంతలా
లలనలమేని కింపుగ మెలంగెఁ గురంగతురంగడింభముల్. ౧౬౨

ఉ. కాఁక వెలుంగుచున్న త్రిజగంబుల నొక్కట ముంచి మించుపెం
జీఁకటి†కొమ్ముటేనుఁగులఁ జించి మదించిన చంద్రకేసరి
న్సోఁక జరాపరాభవము స్రుక్కె శరీరము పాదశ్శక్తి బ
ల్గూఁకటివేరు వేప్పరుప్ర గొట్టెఁ గళాచ్ఛట లూడె నన్నియున్. ౧౬౩

సీ. ఒకపరివేషంబునకుఁ జొచ్చి దుర్దినహేతువై తమ్ముల నేఁచు నితఁడు
సకలోన్నతుం డైన శంభునొఁదలమీఁదఁ బాదంబులిడినదుర్భావుఁడితఁడు
లాఘవమ్మున సురాలయముఁ జుట్టుచు నింత పంకింపనట్టి కళంకి యితఁడు
తనరాక చక్రహితముగాక దోషానువర్తి యై పొడసూపు వక్రుఁ డితఁడు
విష్ణుపదసక్తుఁ డయ్యును వేఱె యితర, విబుధసేవకు లోనైన వెడఁగితండు
గాన నేనొల్ల నని సుమీ కలువలచ్చి, జరఠశశిఁజూడఁగానోడిశిరసువంచె.

గీ. ఘనసరణిలాంగలక్షేత్రజనితయామి
నీసమాహ్వయకృష్ణ కార్పాససస్య
ముడువు లనుప్రత్తి వినతతొల్త్రొడుకు విడువఁ
జుక్కలిడునట్టు లొక్కొక్కచుక్క నిలిచె. ౧౬౫

గీ. కుదిసి రేయెల్ల నాఁకలిగొని తపించు, చక్రవాకంబు కొసఁగంగ శక్రుదిక్కు
కరమునందిడుదధ్యన్నకబళమనఁగ, సొబగుదళుకొత్తవేగురుఁజుక్క మొక్క.

చ. విలసదనూరురక్తరుచివిభ్రమవాహిని ఫాలలోచనో
జ్జ్వలశిఖికీలమై నిగుడి సాగఁ బ్రభాతపురారి చూచెఁ జెం
గలువలవిందుపేరి రతికాంతు నిశాగిరిరాజపుత్రి బె
గ్గిలి చను నట్టు లొయ్య నుడిగెన్ దివిఁ దారకవర్గ మంతయున్. ౧౬౭

క. వేకువచలి మేల్కని హుహు, హూంకారము లెసఁగఁ గాంతలొత్తిరికుచనా
ళీకముకుళములు ముల్లొన, వీఁకలు పతియురము గ్రుచ్చి పీఁపున వెడలన్.

---

* గరికొన్న- మూ † కొమ్ముటేనుఁగు- మూ.

చ. ఉరవడి నొక్క కంటఁ గృప యొల్కఁగ వే ఱొకకంటఁ గ్రోధని
ష్ఠురమొలుకంగ వేల్పుల నిశాచరలోకముఁ జూచు నంబుజో
దరుఁ బుసడించె *మిన్న హిమధాము రుచిం గమలాకరంబుల
న్నిరి మెఱయించుచుం దరణిచేఁ గుముదంబుల నిద్రపుచ్చుచున్. ౧౬౯

సీ. ఇందుకాంతముల నీ రిపురక యే లుండు రవిశిలాస్థలి నగ్ని రవులుకొనఁగఁ
గమలదీర్ఘికలు నిద్ర మరల్ప కే లుండుఁ గుక్కుటమూఁగధోక్తులు చెలంగఁ
గుజములు క్రొంచివ్వరు ల్గూలింప కే లుండు గంధవాహమదాంధకరటి రాయ
జక్కవ తాపంబు సడలింప కే లుండు దరదరవిందంపుసురటి వీవఁ
దిమిర మరుగక యే లుండుఁ దీవ్రభాను
భానువులు లోకదీపక ప్రభ నిగుడ్వ
వెలివెలుఁగు జాఱు టది యెంత వేఁడివెలుఁగు
ననిచి యుదయాద్రిసింహాసనమునఁ దనర. ౧౭౦

గీ. అంబుజాకరశయ్య మత్తాళిమత్కుణములు గుట్టిన మేల్కొక కుముదలక్ష్మి
నిదుర పోఁజొచ్చె రే యెల్ల నీరజారి,తోడి రతికేళి మల్లుపోరాడి యొక్కొ.

సీ. పొదలు జక్కవలగుంపులుగూర్చు పోరామి చిమ్మచీఁకటులకుఁ జేరరామి
త్రయ్యంతవిద్యాసదాఖురళీభూమి చంద్రార్ధధరరథచక్రనేమి
వ్యాపృతగగనఘంటాపథాంచలగామి దినరాజ్యభరభృతి కొనరు వామి
రాహుగ్రహాగ్రహారభస మోర్చినక్షేమి నమదవనత్వరోన్నయనగామి
యుదుటు నెలుఁగుసామి యుదయభూధరసామి, దేశవర్తియగుచుఁ దెలివినిగుడు
తఱిఁ బ్రసేనుఁ డస్తతంద్ర ప్రబోధాను,సారి యగుచుఁ గొల్వుఁ జేరి నగుచు.

— ప్రసేనునికడకుఁ జెంచులు వచ్చుట —

క. నెఱి చూపువేళ నొకకొం,దఱు పొలపరు లేగుదెంచి దర్శించిరి య
న్నెఱబిరుదుమగని భిదురపుఁ,దఱుపులువర్షాంబుదంబుఁదఱియువిధమునన్.

సీ. భల్లూకరోము లుత్ఫుల్లవాహద్విషన్నేత్రులు గజనీలగాత్రధరులుఁ
గంఠీరవసటాప్రకారశిరోజులు దంష్ట్రిదంష్ట్రాంకూరతరనఖరులు
సారంగవేగులు సారంగకఠినసత్త్వులు గండభేరుండతులితరవులు
సరభసశరభభాస్వరపదన్యాసులు నురగబాహువులు వృకోదరులును
నగుచుఁ దమయున్నవిపినాలయముల నెల్ల,నంగకమ్ములఁ బ్రకటించునట్టులమరు
భిల్లవల్లభు లొకకొంద ఱుల్ల మమర, నా ప్రసేనునియాస్థానమల్లఁ గదిసి.

* మిన్న హిమధాము రుచిం గమలాకరంబులం గిరి మొరయింపుచుం- మూ-

ఉ. ఓరలువోవఁ గన్గొనుచు నూరక యయ్యపనేము లిచ్చుచుఁ
జోరునఁ గాఱుక్రొంజెమట జొబ్బిలు మేనులఁ గంప మందుచుఁ
బారెఁట బారెఁట న్నిలిచి భంగురతాన్వితభంగి మెట్టుచు
న్వారు ప్రణామపూర్వకము వక్రతరోక్తులు పల్కి రీక్రియన్. ౧౭౫
ఉ. ఈవరి* యేము కొండసెలయేఱులవంకలవార మన్నలున్
బావలు మామ లల్లుఁడులు బాదుగులు న్బలగంబు నొక్కప్రో
గై విలువేఁట లాడికొని యాలయి బిడ్డయి యిల్లు ముంగిలై
బూవపుఁబొత్తు గూడి కసవు ల్దినియింతుము నాఁడు నాఁటికిన్. ౧౭౬
సీ. తట్టపున్గునఁ గాని తలరాయనేరము పెట్టయీఁకలఁ గాని సుట్టనేర
మెఱచి పోఁచలె కాని చిఱుమంగ నేరము గదురుఁదోల్లె కాని కట్టనేర
మీరంబులనె కాని తూఱుండ నేరము వెదురుబియ్యమె కాని వెరఁజనేర
మడవినేలనె కాని నడయాడ నేరము గురులపాడియ కాని కొసరనేర
మెండ మాకు దండ యివము మామది కింబు, బల్లిదంపుగాడ్పు గాళ్ళసత్త్వ
మెట్రమొరపనేల యిక్కలు కంకటు, లివియ కాని యన్య మెఱుఁగమయ్య!
వ. అని నిజప్రభావంబుం బ్రకటింపం గడంగి యావ్యాధయూథంబు నిజనిరీ
క్షణప్రబోధమధురాననుం డగు నయోధ్యావరునితో ని ట్లనిరి. ౧౭౮
సీ. నల్లదేవర మోచినాఁడు నాఁ డని కాని మలఁతుము గరుటాలమంతు నైన
ననరానిపని గంబ మయ్యెఁ దానని కాని చఱతుము తెఱనోరిసామి నైనఁ
జందమామకు ముద్దు సాగించు నని కాని యేసి తెత్తుము మింటియిత్రి నైన
దుగ్గిదేవమ్మకుఁ దోలుబోన మని కాని త్రుంతుము జముఁ డెక్కు దుంత నైన
సరబసాళువమళువంబుసార మెగము
గండబేరుండ మని మఱి కలుగుజీవు
లని యెఱుఁగమేము తడవింట నమ్మునిండఁ
దొడిగి యడవుల వేఁటాడఁదొడఁగినపుడు. ౧౭౯
వ. అని తదనంతరంబ. ౧౮౦
సీ. ఏనికతలలపై నేర్చి తెచ్చిన పచ్చిముత్తెంబు లొకకొన్ని ముంచి పోసి
తల్లిప్రక్కలఁ గూర్కఁ దలఁగించి తెచ్చిన సింగంపునిసువులఁ జేతఁజూపి
గిలుబాడి ఫణిఫణంబుల నొల్చి తెచ్చిన రత్నరాజములు పేరాళమొసఁగి
గుత్తులకొలఁదికి గుత్తంబుగాఁ గట్టి తెచ్చిన పులిగోళ్ళ తెగలువైచి

* దేవర- మూ.

మఱియు నతిమానుషపరాక్రమమునఁ గన్న, వన్యవస్తువులు పథగావరుస నునిచి
చిత్తమలరింప మృగవధాజీవు లనిరి, యాప్రసేనుని ముకుళితహస్తు లగుచు.

శా. దేవా! యిప్పుడు మావనంబునకు నేతెంచెం గరాళానన
వ్యావల్గత్తటుఘోషగర్జల దిశల్ వ్రయ్యన్ హాలాహలకం
ఠావిర్భావము కల్పసంక్షయమునం దాటోపముం జూపున
ట్లై విద్రావితవాయురంహ మొకసింహం బెందు మున్నుండెనో. ౧౮౨

క. మాతరము గాదు సింగము, పోతర మడఁగింప బీఱువోయితిమి సదా
యాతాయాతోద్ధతి ని, ర్ఘాతాకృతిఁ బక్షణములఁ గ్రక్కసపఱుపన్. ౧౮౩

క. సింగంబుఁ జంపి మాడగు, బ గంబుఁ దొలంగఁ జేయు ప్రాఁబులి మును గ
న్నింగలము వేల్పు మమ్మొన, లం గలయఁలుఁగునఁ బగుల్చులాగున నధిపా.

గీ. ఇట్టి లిది యని చిత్తానఁ బెట్టు టరుదు, దేవ దేవర విచ్చేసి నీవు వెన్ను
దన్ని యుండినఁ జాలు నాదగర మెకముఁ, బట్టువారము నేము నీపాదమాన.

చ. అదియును గాక మా యడవి నన్నునఁ గన్నునఁ గానలేక మే
చిదిమినమాత్రఁ గ్రొంజమురు చిల్లున మీఁదికి గుప్పలింపఁగాఁ
గదుపులు గట్టి యున్న యవి గంధగజంబుల నైన రాయుచు
న్నదకలకోలరాజములు మర్దితభిల్లకుమార తేజముల్. ౧౮౬

క. కలములఁ బోలిన భయదై, కలము లిపుడు చింతపంటికందువ యగుట
న్గళదఘ్నదర్పసంపదఁ, జెలఁగెడు ఱాలెల్ల మేనిజిడ్డునఁ దోఁగన్. ౧౮౭

చ. తొలఁగవు చిన్నకన్ను వడి దుప్పులు చప్పుడు గాకయుండఁ బెం
జిలువల బిట్టు మ్రింగుచును శృంగము లైదును నాలు ప్రంగలై
తలలకు వ్రేఁగుసేయ నవి దాసిన వ్రేసిన మేనెఱుంగ వే
పొలమునఁ జూడఁ దామ యగుఁ బున్నమవెన్నెల గాయ మైపొడల్. ౧౮౮

క. సీరాముసేన లైక, ప్పారుశరీరములతోడ హరిణంబులు గాం
తారమునఁ దిరుగు వాని, న్నేరఁ డొడిసిపట్ట నిటలనేత్రుం డైనన్. ౧౮౯

క. కాసరములు నిజరేఖా, మాసరములు నిజవిషాణమథితగిరిరజో
ధూసరములు రుచికృతఘన, వాసరములు గలవు లెక్క వానికిఁ గలదే.

క. మిన్ను దలమోచి పొడవున, మన్నులు విహరించు వాని మడియింపము నే
మెన్నఁడును బసులకదుపుల, వెన్నాడెడులీల నుఱక వెలుతుము పోవన్.

ఉ. రంజితకృష్ణసారగళరక్తము దప్పికి నీరు, దుప్పిక్రొ
న్నంజుటికండ లాఁకటి కొనర్చినకూడును, నై కుభృద్గుహా

కుంజములం జరించుఁ బడఁగు మ్రినఁ జమ్మిన మే నెఱుంగ వెం
దుం జిరకాలకాయములు తోరపుఁగోఁతుల చిత్రకాయముల్. ౧౯౨

సీ. కరికుంభ సుక్తి శార్దూల సుప్తలంబుల భ్రమితచంక్రమణసంభవము నెఱపు
ఘుమఘుమధ్వనులు ఘోషింపఁగెర లెత్తి మూర్ఛితమిన్నులు మోవ నెగయు
విద్యాధరకుమారవిహృతికిఁ జోటైక గండుస గుహ లెల్ల నిండియుండు

* * * * *

నసములో చనపటహ కంఠారవములు, కాఱుశవిలోని ఘోరకంఠీరవములు.

క. గట్టుల గుట్టలఁ బంచల, పట్టులఁ గుంజములగములఁ బడఁకుఁగెలఁకులం
దొట్టిన క్రొవ్వనఁ బిట్టలు, చెట్టడిచినఁ జేటెండన్ని జిలజిల నెగయున్.

క. పెరతేనె తెరలు దేనియ, గురియు స్మోఘములు వాన గురియు తెఱఁగునన్
దొరువులఁబొదలిన పూఁబొద, యిరువులఁ గలచలువ పవలు నివతాళించున్.

గీ. ముదురుఁజాఱుపప్పు వెదురుబియ్యములును, గురులపాలు పెరుఁగుదొరల కైన
మనసు లలరఁజేయు మాష్కణంబుల, సింధురాఘదానచిక్కణములు. ౧౯౬

క. వడిగలఁడనిమాసెరివినఁ, బసుదు వెపుసు వేఁట కిపుడుపయన మగుము నా
వుడుసతఁడు వారివార్ధ్యపు, నోడువులుముద మొదవవినికనుంగవనగుచున్.

వ. పసదనంబుం బ్రసాదించి యాచెంచుల నాదరించి సాటోపంబుగ నాఖేటం
బునకు నయనంబులం బొదలు సితాసితారుణప్రభలు ప్రబలం గర్ణకుండల
మాణిక్యమరీచులు గడలుకొన నిలుసొచ్చి వెడలి వచ్చుటయు. ౧౯౭

శా. చోళీనాట్యపలోకనప్రియ త్రయీశుద్ధాంతశుద్ధాంతరం
గాళీస్వస్తికలాకరోద్యత ధరాయాగక్రియాగక్రియా
వ్యాళీకల్పితచారుచంక్రమణ సర్వారాతివాహా మహా
జ్వాలీజ్వాలలిలీఢ దైత్యశలభవ్రాత ప్రతిక్షేపదా. ౧౯౯

క. తిరుమంగయాళువారు, స్థిర భక్తివిధేయ రంగదివ్యక్షేత్రాం
తరసన్ని వేశ భట్టరు, తిరువంశ జ్ఞానభావ దీపితభావా. ౨౦౦

స్రగ్ధర. వేధోబోధోపదేష్టా విబుధరిపుచమూవిప్రియాపాదిచేష్టా
రాధాసాధారణోక్తి ప్రకటనవసుధాగ్రాసనంపుల్లహాసా
గోధుగ్బాలారిరంపాకులనిజహృదయక్రోడ సౌఖ్యప్రశంసా
మాధుర్యస్మేరకీర్తి మధుమథన జగన్మంగళాధారమూర్తీ. ౨౦౧

గద్యము. ఇది శ్రీమత్తిరుమల శ్రీనివాసాచార్యవర్య కరుణాపారంపర్యపాత్రా
త్రేయగోత్రాపస్తంబసూత్రపవిత్ర సకలకళాభోజ రామరాజ రంగప్పరాజప్ర
ణీతం బైన సాంబోపాఖ్యానమునందు ద్వితీయాశ్వాసము.

శ్రీరస్తు.

# సాంబోపాఖ్యానము.

## తృతీయాశ్వాసము.

క. శ్రీరమణీకుచకీలిత, హారమణీమిళితవైజయంతీలతికా
హారస్మేరద్యోతా, ధారమహావక్షరంగధామాధ్యక్షా. ౧

వ. దేవా భావికథాక్రమంబు నీదివ్యచిత్తంబున నవధరింపుము. ౨

—ప్రసేనుఁడు వేఁటకుఁ గడఁగుట—

సీ. తడవిండ్ల నుండక తడవిండ్లవార లేతెంచిరి మదకలద్విరదలీల
హరిగలచ్ఛాగతోడ హరిగలవారలు వచ్చిరి సింహసంహనను లగుచు
గడలవారలును నల్గడలఁ దోతెంచిరి చటులజిహ్వాభీలసర్పలీలఁ
గరవాలధరులు భీకరవాలశార్దూలసమరేఖఁ బొల్చి రుత్సాహ మెసఁగఁ
దప్పెటలుమ్రోసెఁదస్ఫుటధ్వనులు రేసెఁ, దుఱుతుతురికీలనెక్కి రౌతులు చెలంగఁ
జిరదములతోడనలమందిగ్రందుకొనియె, నాప్రసేనుండుమృగయులు నరుగువేళ.

క. మృగయులు దెచ్చిరి బంగరు, సగతులఁ జేపట్టి గట్టిజాగిలముల బ
ల్మొగుళుల విద్యుల్లతికా, స్థగితగ్రీవములఁ బవనతతి నడుపుక్రియన్. ౪

క. ఉరులుం బోఁగులుఁ బెదపెద, తెరలును గుందేటివలలు దీమంబులుఁ దె
చ్చిరి వేఁటకాండ్రు బహుధా, పరిచితమృగయావిశేషపరిణతు లగుటన్. ౫

సీ. వేగాధ్యయనవిద్య వేవిధంబుల నిది చదివింపఁ బవనంబు చదువఁబోలు
నిది మావుగాఁ బుట్టి యీడేటఁ గాఁబోలుఁ గల్క్యవతారరక్షకులారి
యిది వాగె గుదియింప నించుకసడలింప వలయాచలంబునవ్వల నె వ్రాలు
నిదియ పట్టాశ్వమై యింట నుండినయేని వజ్రికి నుచ్చైశ్శ్రవంబు గుఱ్ఱతె
యెంతలా వెంతశుద్ధత యెంతబిరుద, మెంతయదటంచుఁ జూపఱు సంతసింప
సాదియాయత్తపఱిచినజవనహయము, నెక్కెమృగయార్హశృంగార మెసఁగ విభుఁడు

క. పేరోజంబులకుల్లా, యారాజకుమారుశిరసునందుఁ దలిర్చెం
గారణమానవనందకు, మారకమస్త్రగ్రపింఛమంజరి యనఁగన్. ౭

గీ. వనజినీపత్రరుచిమిత్రవారవాణ, మాప్రసేనుని గాత్రంబునందుఁ దనరెఁ
గప్పుధళ్లోత్తుచిహ్నంపుటొప్పిదంబు, పూర్ణశశిమీఁదవైచిన పొలుపు దెలిపి.

క. రాజావర్తరసార్ద్రిపు, నేజా తద్బాహుశాఖ నెలవుకొనియెం జే
రోజ సురశాఖిశాఖిక, రాజిల్లు ద్విరేఫరాజరాజియుఁ బోలెన్. ౯

క. వనచరదర్శితమార్గం, బున నడవికిఁ జనియె రాజపుత్త్రుఁడు మున్నా
వనచరదర్శితమార్గం, బున లంకకుఁ బోవు రామభూభుజుఁ డనఁగన్. ౧౦

క. తెరలొడ్డిరి పోఁగులువా, ఱిరి త్రవ్విరి యోదములు పరిసరవనములం
జొరఁగొట్టిరి మృగముల నే, ర్పరు లగు పాలపసులు వివిధపరికరధరులై.

మ. దొర లశ్వంబులుఁ దేరులు న్ద్విరదపంక్తు ల్గోలి తూలింపఁ గా
సరముం గేసరి భల్లుకంబు రురువు న్సాలమ్ముం గోలమున్
హరిణంబు న్శశము న్వృకంబు శలలం బాక్రాంతహృద్భీతి నా
తురతన్ బెగ్గిలి మ్రగ్గఁ గాఱడవియందు న్సరదూరంబులై. ౧౨

క. ఆసత్రాజిద్భ్రాతృశ, రాసారము గ్రుచ్చికొనిన నవనిం బడియెం
గాసరము లక్షకరశ, రాస్పృష్టింబగులు నంధకారం బనఁగన్. ౧౩

గీ. ఆప్రసేనుఁ డేయు నర్ధచంద్రశిలీము, ఖములఁ బొదికొమ్ముగములు రాలె
విపినపవననిహతి విచ్ఛిన్నవృంతంబు, లైన యగిసెవిరులయొంద మొంద. ౧౪

గీ. నింగిమోవంగ నెగయుసారంగ మొకటి, యధిపుసింగిణివింటితూపాయమాడ
నదటు వోనాడి చేతికి నగ్గ మయ్యె, భర్గునకు యజ్ఞమృగము చేపడిన కరణి.

గీ. ఆప్రసేనుఁడేయు నశనికల్పానల్ప, కాండవృష్టి దంతకళిక లూడ్పఁ
గుసుమలావిలూనకోరకకైతక, వనము ననుసరించె వనగజములు. ౧౬

గీ. కప్పికోలలనాతండుదుప్పిపదువు, నొడలనరుణాంబుబిందువులొప్పడమఁ జేయఁ
గడుఁ బ్రకాశించెఁదమ తెల్లపొడలనవియుఁ, జిగురులలరులుగలిగినచెట్టులనఁగ.

గీ. రక్తకణములు ఱక రాలంగఁ బెనుగోలఁ, గొదమకున్కఁగొట్టె ఘోణి యొకటి
రాయబాటు గాన రణదానవిధికాంక్ష, జాలె వ్రక్కలించి చల్లె ననఁగ. ౧౮

గీ. బల్లెకోల దాఁకి పరవశత్వముఁ బొంది, యొక్కచెవులపోతు చిక్కె జలద
ఘట్టనమున మిన్నుపట్టూడి శశికళా, సక్తి నంకమృగము జాఱె ననఁగ. ౧౯

క. గిరిజాసింహము మహిషా, సురదాయాదుల వధించు చొప్పున గవయో
త్కరములఁ గర మతఁ డేయఁగ, గొరువంకలకరణిఁ జాపగుణలత మొరసెన్.

క. పులులకుఁ దార్చినపులులం, బొలియించె విభుండు శస్త్రపుంఖితవదనం
బులు గాఁడ నేసి మోహా, దులను వివేకుండు మున్ను దునిమినకరణిన్.

క. నేజా నతండు మెకముల, వేజాడలఁ గెడప నట్ల వెలసిరి భటులున్
రా జెట్టిజాడవాఁ డగు, నాజాడనె ప్రజలు నడతు రద్ది నిజము చుమీ. ౨౨

గీ. ధర్మగుణముచేతఁ దగిలియుండియు నీను, నోప్రసేన యిట్టి యుగ్రకృత్య
మేలయనెడుకరణిఁ గోలాహలముచేసె, గిద్ద లలమి పొడువ ఖేచరములు.
క. నెత్తురు మెదడును నంజుడుఁ, జిత్తడి గావించెఁ దత్ప్రసేనభటులచే
కత్తులు నీఁటెలు మెకములఁ,దుత్తుమురుగఁ జేయ నడవిత్రోవల నెల్లన్. ౨౮

—ప్రసేనునకు సింహమునకును యుద్ధము—

ఉ. అత్తఱి వచ్చె నవ్వనమునందుఁ జరించుమృగాధిరాజు క్రొ
న్నెత్తురు జుంజు విచ్చి నిజనేత్రరుచుల్ లయరుద్రదృష్టులం
బొత్తుకుఁ బిల్వ సర్పపురముంబురుడింప సదంష్ట్రివక్త్రము
న్మిత్తుకనాలుకం దెగడుమేటిరసజ్ఞ దవాగ్ని గ్రాయఁగన్. ౨౯
గీ. వచ్చి కంఠరవం బిచ్చి వాల మెత్తి, నఖశిఖరవజ్రపాతసన్నాహమునకుఁ
దోడుపడఁ గోఱలాసేనఁ దుమురు సేయ, బెదరి పఱచిరి తక్కినపినుఁగులెల్ల.
క. బలములు విచ్చినఁ దనదోర్బల మొకటియచిక్కఁబట్టి పతి నిలిచె మహా
కులభవులు ప్రాణభయముం, దలఁతురె మానావనైకధన్యులు గారే. ౩౦
శా. ఈజాడం దిలకించుకేసరి నతం డీక్షించి శితాౕకళం
దేజీ నంటఁగఁగొల్పి కల్పదహనోద్రేకంబు ముద్రించుచే
నేజాము మ్మొన నింతనాటుటయు ఘూర్ణించె న్నగజద్వేషి క
ద్రాజాధీశ్వరతుల్యవాలధికి నాందోళంబు పుట్టించుచున్. ౩౧
వ. ఇట్లు ఘూర్ణిల్లి యామృగతల్లజం బాబల్లిదుని మొగంబున కెగయుట యు
నబ్బలుమగండు పాండిత్యంబునం దత్తడి వెనుకకు నూకుటయు నక్కాఁక
మెకం బొడుపు దప్పి గొప్పుచు వలవంకం ద్రిప్పివచ్చి యప్పురుషవతంసు
హంసరథదండచండం బగువాలంబునం గీలుమలంగి కొట్టుట యు నాదిట్ట
తట్టున నభిముఖంబుగ దాకొలిపి కరివైరిం బరిపరియలు గా నాయుధంబు
నం జేయుటయు నాసటాలంబు తటాలున వెనుకకు నిగిడి తద్వ్రతికటిప్రదే
శంబు చపేటంబున విపాటింప నాఘోటకంబు కైటభరిపువిపులసుదర్శన
స్పర్శంబు లగుపెనుగొరిజల నుఁగుజవంబున నప్పంచాస్యంబు నాస్యంబునం
దన్నం దన్నుటయునుం గటకటం బడి పుడమిం బడి లేచి యేచి యమ్మహా
వీరంబు ఘోరంబుగ నెలవంకకు లంఘించి నెలవంకల మీఱు నోరికోఱల
నవ్వీరవరు నెడమ ప్రక్క నొక్కుటయు నద్దిక్కు మొగం బై యగ్గద్దరి పెద్దవడి
నార్చి యావృద్ధసింహంబు వదనగహ్వరంబున నలుఁగు చొనుపుట యు

నాకుటిల ప్రచారంబు నాక్రూరాయుధంబు నురగంబుఁ గబళించు గరుడుని కరణిం గొఱికి వేసిన రేసిన మగంటిమి నజ్జగదభినుతుం డొంటిం బెట్టిన పట్టమ యంబు వెఱికి పిఱికిగుండె లేక యాకేసరిం దెగవ్రేయ నుద్యోగించు సమ యంబున. 29

క. కవిసి మృగపతి ప్రసేనుని, నవశత నొందించి యతనిహాయరత్నముఁ జెం
డి విడిచి కంఠాభరణము, నవలీలం గొనియె మాంస మని ముద మొదవన్.

వ. ఇ ట్లకుంఠితవిక్రమం బగు నాకంఠీరవంబు ప్రశాంతసంరంభం బై యాస్య మంతకంబు నిజగుహాంతరంబునకుం గొని చనియె నంత. 30

ఉ. ఆకడ కప్పటప్పటికి నర్థి మెయిం జనుఁగాన నాఁడ భ
ల్లూకవిభుండు వచ్చి యతిలోకపరాక్రమహారిఁ గేసరి
న్వీకునఁ జంపి తద్ధృతమణిన్ హరియించె ఘనాఘనంబు నా
ళీకవనప్రియుం బొదువులీల నరాళకరాళచండిమన్. 31

క. తనగుహకుస్యమంతకమణిఁ, గొనిచనిసుకుమారుఁడ నెడికొడుకునకొసఁగెన్
వనజాతప్రభవునితు,మ్మునఁ బుట్టినబుక్కులోకముఖ్యుం డంతన్. 33

సీ. ఆప్రసేనునిచర్య యంతయు నెఱిఁగి సత్రాజిత్తుఁ డాపులుఁ దాను వగచి
యెక్కడి మృగరాజ మెక్కడి మత్స్యహాోదరవిమర్దనము రత్నంబుపోక
యెక్కటి యది యిది యెంతయు మురవైరి మాయాప్రపంచనిర్మాణమహిమ
మణిఁ దన కీకున్న మర్యాద లంఘించి బూమెలపోకలువోయి తనదు
తలఁపు సఫలంబు గావించె దానవారి, కన్యవిత్తాపహరణవిద్యానుషక్తి
కలిమి చాటుచునున్న దిగాదె ఘోష,యోషిదాలయరచితశౌర్యోల్లసనము.

గీ. తాఁ బ్రసేనుని జీవరత్నములతోడ,రత్నమునుబుచ్చికొన్నాఁడు రాధమగఁడు
చుట్టములలోన నిటువంటిసుభగుగలఁడె, వెలుఁగు చేనెల్ల మేసిన విధమువోలె.

క. అని యడలుచుండె నపుడా, జనవాదము నిండె నర్వజగతీస్థలిఁ జె
ర్వున నూనియ నెరసినక్రియఁ,బెనఁగొని నేత్రమున *నవిరి వెరిఁగినకరణిన్.

క. నిలయానిలవలయాహతి, జలనిధి యూటాడులీలఁ జక్రి మనము వె
గ్గల ముపవాదభయంబునఁ, గలఁగె న్గర్భస్థభువనకంపముతోడన్. 36

గీ. ఎట్టికృతులకైన నెవ్వారికేనియు, నియతిమహిమకతన నిందవచ్చు
శర్వమూర్తి యైనదుర్వాసునంతటి, వానిఁ బొదువదే ప్రవాదశంక. 37

---

*అయిర-మూ.

మ. చింతాతంతుపరీతచిత్తుఁ డగుచున్ శ్రీకృష్ణుఁ డాచందమా
ద్యంతంబుం దగువారితో నొడివి నిందాకర్దమక్షాళనం
బెంతే వేగ నొనర్పఁగాఁ దివిరె లోకేశుండు దా నయ్యు నా
నంతర్వాణులు ధర్మరక్షణపరీక్షావ్యాసమాక్షేక్షణుల్. ౩౯

చ. అలిగి హలాయుధాదులు తదర్థవిజృంభితసంభ్రమోగ్రులై
యలబల మాచరించుటయు నందఱు నొయ్యన మస్తరించెన
జ్జలనిధిశాయి నీతినడిసన్నబుధుల్ నడి వచ్చెనేనియుం
గలఁగక యుల్లముంటఁ దినఁగాఁ దలపోయుదు రాత్మధైర్యులై. ౪౦

క. వేదాంతార్థంబులు దను, వేదెఱుఁగుల వెదకి నలువవిభుఁడు ప్రసేనుం
డేదిక్కు చనియె వేఁటకు, నాదిక్కున నడిచె నింత లచ్యుతునిగతుల్. ౪౧

వ. గరుడకేతనశిఖాఘాతభీతిక్రాంతి జలజాప్తతేజోమోకులు వడంకఁ
జక్రనేమిక్రమప్రక్రియాపరిపాటి నిలయు నట్టెత్తిన నెత్తిరాఁగ
నిరుసులకొనలొత్తహరిదంతగజములు మొగములుప్పక్కించిముచ్చముడుఁగఁ
గల్పాంతఘనసుహృత్త్రితిన మోహంబుల దివి శబ్దగుణ మాటఁ జేటపఱుప
సైన్యసుగ్రీవమేఘపుష్పకవలాహకములఁబూన్పఁ జతుర్యుగఘటితకాల
చక్రమును బోలుతేరెక్కి చక్రపాణి, దారకుని కౌశలమ్ము చిత్తమ్ముగరఁప.

గీ. ఎక్కి పరిమితపరివార మిష్టజనులుఁ
దగినతెఱఁగునఁ గొలిచిరాఁ దనరె శార్ఙ్గి
త్రిపురములమీఁద నడతెంచు త్రిపురవైరి
సురలు భజియింప సొంపొందుసొబగుఁ దెగడి. ౪౩

శా. విధ్వస్తగ్రహతారకం బగుచుఁ బర్వెన్ ధూళి ప్రస్థానభే
రీధ్వానంబున వ్రక్కలయ్యె దిగిభశ్రేణీకటప్రాంతముల్
విధ్వాదిత్యులు తప్పఁగ్రుంకిరి మహోద్వేలాస్యరుట్పావకం
బధ్వాచ్ఛాదన మాచరింప హరిసేనాటోప మేపారఁగన్. ౪౪

సీ. ద్వీపిద్విపాహితద్విపధేనుకర్ణాదిసత్త్వసత్త్వస్థితిజన్మభూమి
చక్రచాతకచాషచంద్రకీబకశుకీలోకలోకాధికోత్సేకకారి
శాండిల్యశౌనకశాతాతపశమీకకృతకృతకేశరవ్రతవశంబు
జటిజంతుఫలజంబుజంబీరవిరచితభానుభానుప్రవేశానవసర
మగుచు నందనంబు నగుచుఁ జైత్రరథంబు, డంబుమీఱి ఖాండవంబు నీన
డించు నొకవనంబుఁ గాంచెఁ గాంచనవర్ణ, నేత్రధారి శక్రశత్రువైరి. ౪౫

గీ. ఉప్పుఁగడలిఁ జొచ్చునప్పయోదములీల, నీలవర్ణుఁ డింద్రనీలనీల
మైనకాననంబు నటఁ జొచ్చె ననుకూల, వాయులీల భటులు సేయఁబనులు.

గీ. అందు వెదకి వెదకి హరిగాంచె నొకచోట, హయముగూడనిహతుఁ డగుప్రసేను
మనసు నబుసుపోక వనలక్ష్మి యుచ్ఛైఃశ్ర,వంబుతో జయంతు వ్రాసెననఁగ.

సీ. నడుమ రెండుగఁ దున్న నమలి ఖండించిన సర్పంబుఁ బోలు నేజాముఁగాంచి
యొఱవాసి జమ్మిలో నుండి వెల్వడు కీలికీలఁ బోలెడు మేటివాలుఁగాంచి
మణులంటు రోహణక్ష్మాధరం బన గంట్లు గలమేని పురుషప్రకాండుఁగాంచి
పగిలిన ముఖదోషపంటితో దొరయంగ వదనంబు దెఱచినవాజిఁగాంచి
యసువు లెదవ్రచ్చికొనిపోవ నందు నెంట
నెగసి పోయెనో యనఁగఁ దద్గగనరత్న
దత్తరత్నంబు లేమి తథ్యముగఁ గాంచి
యద్భుతమునొందె నయ్యద్భుతాద్భుతుండు. ౮౯

క. దీనికిఁ గారణ మగుపం, చాననమె య్యదియొ యనుచు ననుఁగులు దానున్
దానవరిపుఁ డటుచని ప్రా,ణానకు నెరవైన మృగగణప్రభుఁ గనుచున్.

శా. ఈసింహంబు నృసింహదేవనిభ మం చే విందు నేప్రొద్దున
త్రాసాహంకృతిఁ గ్రాలు నీమృగపతిం బ్రాణంబులం బాపువాఁ
డాసుత్రాముఁడొ దండహస్తుఁడొ జలాధ్యక్షుండొ యక్షుండొ లే
దా సూనాస్త్రహరుండొ కాక యటు గాఁడా యన్యుఁ డర్హించునే. ౯౦

క. కాదేని జాంబవంతుం, డీదుర్గగుహాంతరమున నిరవై పరమా
హ్లాదమున నుండు నాతం, డో దీనికి హేతు వెద్ది యొకొ యూహింపన్.

వ. అని పరితఃప్రసారితనిరీక్షణుం డై పుండరీకాక్షుండు. ౯౧

క. వనితామణి నెమ్మదిఁ జొ, చ్చిన తత్ప్రియ భాషణముల చెలువున క్షితిఁదూ
ఱిననఖములుగలశతధృతి, తనయునిచరణములచొప్పుఁదాఁగనుఁగొనుచున్.

—శ్రీకృష్ణుఁడు పాతాళమున కేగుట—

సీ. నందద్దివానాథనందినీజలబిందుకందళస్యందసంక్షాళితములు
(గోవర్ధనాచల) శ్రీ వర్ధనాధిత్యకాధాతురసపరిష్కారకృతులు
కాళియఫణిఫణాగ్రస్థలస్ఫుటమాణిక్యరంగాసంగినృత్యవిధులు
గురుపుత్రశరతప్తతరశరీరోత్తరాపుత్రవారుణసూక్తపూతకృతములు
నైన శ్రీపాదములకుఁ బ్రయాస మనక
యెలుఁగుచొప్పున హరి యొక్కఁ డేగఁ దొడఁగెఁ

దేవనంబున సేన నా దెసనయునిచి
కలదె కార్యాతురల కెందు గర్వభరము. ౧౪

చ. మణిహరణాభిలాషరయమాణమనస్కుఁడు గోధుగగ్రణీ
మణి యట నేగి యేగి మణిమండితకుండలభోగభాగభృ
త్ఫణిపతివక్త్రభీమ మగుపర్వతగర్భము చొచ్చె రత్నభూ
షణఘృణిదీపమాలికలు సాంద్రతమఃపటలంబు ద్రింపఁగన్. ౧౫

సీ. ఇంచుక చెవిసోఁకె నిసిజింతపలుకుల వైఖరి యవ్యక్తవర్ణసరణి
నొకపాటిపొడసూపె యువతియు పుగ వాఁడునని యేర్పఱుపరాని యంగలతలు
కొంత వివేకింప గోచరం బయ్యెఁ బ్రాకారంబు లనియు నగడ్త లనియు
సగము సగంబు నిశ్చయము సేయఁగవచ్చె హాస్త్యశ్వరథపదాత్యతిశయంబు
లంత జవనిక డివిసినయట్లు తోఁచె, సర్వసౌభాగ్యభాగ్యప్రశస్తి పౌర
వరము పాతాళభూమినూపురము నొక్క, పురము గగనాగ్రదర్శిగోపురము హరికి.

ఉ. వాసవపట్టణప్రతిమవైభవ మన్నగరంబు చొచ్చి ని
త్రాసవిహారహేల యదురాజశిఖామణి జాంబవంతు కే
ళీసదనంబుఁ జొచ్చినఁ జలించిరి గొల్లలు వృద్ధకంచుకు
ల్వీసరవోయె నూడిగపు లేమలచిత్తము మోహమత్తమై. ౧౬

శా. ఆలావణ్యము నావిలాసవిభవం బాధైర్యగాంభీర్యరే
ఖాలంకారవిశేష మా సొబగు నాయానాభిరామంబుఁ బా
రాళిన్ హాళి విరాళిఁ బెట్టె హరి ఋక్షాధీశుశుద్ధాంతముం
గేలీమందిరరీతిఁ జొచ్చు నెడఁ గంకేళిన్ ద్విరేఫాకృతిన్. ౧౭

క. ఉద్దండవృత్తి నపుడా, మద్దులనడఁగించినట్టిమతకరి ప్రావృ
ట్ప్రోద్దామవిద్యుదాళిన్, ఖద్దించుగృహంబు చొచ్చి కహకహ నగుచున్.

సీ. శరదభ్రవేష్టితతరుణచందురుఁడు వోలె వెలఁదిపొత్తుల మేను వెలువరించి
యలచేతఁ గొని పాదసరసజాతము వికస్వరముఖాంబుజమున సారెఁ జొనిపి
తొయ్యలు లొయ్యొయ్య నుయ్యెల లూఁపనిద్రానందసౌభాగ్యమనుభవించి
రత్నకుడ్యాంతరప్రతిబింబ మీక్షించి బాలకాంతరబుద్ధిఁ బట్టఁదివిరి
బాల్యచేష్టల దాదికిఁ బ్రమద మొసఁగు
చున్న సుకుమారు మ్రోలఁ జూపొలయఁ గేలి

కందుకముగా నొనర్చినగగనరత్న
దత్తరత్నంబు దానవధ్వంసి కాంచె. ౬౦

గీ. మింటనంగారకుని మ్రోలమెలఁగుతరుణ,తరణిఁగబళించుకేతువక్త్రంబుఁబోలె
శ్యామలాంగుని శ్రీహస్తమాహరించె, డింభకుని మ్రోలనున్నకడింది కెంపు.

క. సురవారణ మంతఃపుర,సరసీగతరత్నరక్తజలజాతంబుం
గరమునఁ దెమల్ప నంచల, కరణిన్ బెగ్గిలిరి చంద్రికాదరహాసల్. ౬౧

క. స్త్రీభయముత్పాదించె ధ,రాభరపరిహారణకరణరతుఁ డట్టిద యా
స్త్రీభయమొదవంచుట ల,క్ష్మీభర్తకు నొంట రెంట సిద్ధము గాదే. ౬౩

సీ. కుచములువంచినఁగచభరంబుఁబిఱుందు వెనుకకుఁదివియంగ వెకలులగుచు
మరలిచూచినచూపులుభయగ్రస్తంబు లగుటకుఁ దరళచిత్తాబ్జ లగుచు
నభ్యాసపరిచితి హస్తంబు సాఁచి కేలూఁదలేమికి మ్రొగ్గియున్న రనుచు
మందతఁగఱచిన మదమరాళంబులు గూడి రానేరమిఁ గుతిలపడుచు
నొకతెఁ బట్టఁగఁ బదురుగా నురవడించి
చంచలాక్షులు జాంబవత్సవిధభూమి
గదిసి ప్రణమిల్లి ముఖచంద్రకాంతి మడుఁగు
తమ్ములో యన హస్తపద్మములు మొగిచి. ౬౪

సీ. పీలినెట్టెమువాఁడు బింబఫలారుణ్య తారుణ్యమున మోవి దనరువాఁడు
వెడఁదకన్నులవాఁడు విధుబింబనిభవిభావిభవవిభ మముఃఖ ప్రభలవాఁడు
రత్నకీలితనిజోరఃకవాటమువాఁడు మేఘసంకాశమౌ మేనివాఁడు
మిగులఁ జక్కనివాఁడు జగతీతలాభోగగమనకారణచరణములవాఁడు
లావుగలవాఁడు మరుఁగన్న తేవవాఁడు
బెట్టిదపువాఁడు మిగులఁ జూపట్టువాఁడు
దేవ యెవ్వఁడో యొక్కఁడే తెంచి యాస్య
మంతకము నాహరించెఁ గుమారుఁ డలుక. ౬౫

క. ఆతని గనుఁగొని భయపడి, తోతెంచితి మనుఁడు ఋక్షధూర్జటి రణక
ర్మాతతనేపథ్యకళా, ద్యోతితుఁడై విల్లుగొని విహూతాంగకుఁడై. ౬౬

క. పులిమీసలనెవ్వఁడొయు, య్యేల లూఁగఁగడంగె వానియదటున్ గిదటున్
బలమున్గిలముంజలమున్,గిలముం జులువుత్తుఁగలనఁ గృతకృత్యుఁడనై. ౬౭

క. అనివచ్చితాఁకిహరితోఁ, బెనఁగఁదొడఁగె వానిఁదాఁకి పెనఁగెహరియు నా
పెనఁకువ శార్దూలంబులు, పెనఁగుట కంఠీరవములు పెనఁగుట యయ్యెన్.

—। శ్రీకృష్ణజాంబవంతులయుద్ధము ।—

సీ. వాయెత్తవెఱచుఁబో వారసింహనాదంబులు విని సింహతల్లజములు
నురుమద ప్రక్రియ నుఱుకుంగ వెఱచుఁబో యశనులు వారల యార్పువినికి
వనగజంబులు వారిపెనఁకువ వీక్షించి కదలంగ వెఱచుఁబో గర్వరేఖ
వారలజవసత్త్వదారుణాటోపంబు గాడ్పులు నెఱేఁగనేఁ గదలవెఱచు
ననఁగ జాంబవంతుఁ డారుక్మిణీకాంతుఁ,డలరుముసలముల గదాయుధములఁ
బోరుపోగు చాలఘోరమై దీపించె, బలిని కేతనమునఁ బ్రబలమహిమ.౧౯
క. మణి కీ వెవ్వఁడ వనఁగా, మణి కేఁబో కర్తననఁగ మానక పెరిఁగెన్
రణ మది దిగ్వారణదా,రుణకర్ణజ్వరకృదుగ్రరోషారవమై. ౨౦
క. ఆహరియు భల్లుకేంద్రుఁడు, మోహాంధతఁ బెనఁగి రపుడు ముష్టాముష్టిన్
బాహాబాహిఁ గచాకచి, సాహసికత్వమున భువనచలనం బొదవన్. ౨౧
సీ. ఘోషయోషాకుచకుట్మలకార్కశ్యపర్యాయపరిపాకపారదృశ్వ
ముద్దామగోవర్ధనోద్ధృతప్రక్రియాపాండిత్యతాండవహిండితంబు
గ్రాహాననగ్రస్తకరిరాజగురుకుంభసముపలాలనకళాచతురతరము
భయభంగురాశ్రితభంగిభీతిత్యాగకల్పనాకళ్యాణకల్పశాఖ
మైన శ్రీహస్త మసురలోకాక్షిపాత
ధూమకేతువు జాంబవంతునియురమునఁ
బూఁపుచక్కనమై హరి పూఁచెఁ దానఁ
దొలఁగె నజ్ఞానబాధ మయ్యెలుఁగుదొరకు. ౨౨
సీ. హరశిరశ్శశిరేఖ కనుగలం బగునొక్కయేఱు పాదంబున నేఱుపడియెఁ
దొలిపల్లునుంగేల నలుమోము లలరంగఁ బొక్కిట నొకపట్టి వొడము దెంచె
నాదిగర్భేశ్వరి మై యొక్కయెలనాఁగ యురముపై నిలిచెఁ బేరోలగమున
వెట్టవెల్గును జలివెలుఁగు నెమ్మోమునఁ గన్నులపోలుపుమైఁ గానఁబడియె
గగనభాగంబు శిరసుపొంకంబుఁ జూపె, దిశలు చేతులచందమై దీప్తి మిగిలె
నేడు గాడ్పులు నూర్పులై యెసక మెసఁగెఁ, గృష్ణునకు భక్తలోకవర్ధిష్ణునకును.
శా. ఆమేటింగని భల్లతల్లజము సాష్టాంగంబుగా మ్రొక్కి యో
స్వామీ యాదవనాథ యే వెడఁగనై సంగ్రామపాండిత్య ము
ద్దామాహంకృతి నాచరించితి నినుం దర్కింపలేనైతి మ
త్సామర్థ్యం బది యెంత యింతటనె నిస్సారుండనై తూలితిన్. ౨౩

క. ఇల నేఁడు బ్రహ్మకల్పం, బులు బతికితి భూమిదేవిపులిపిరినై నా
యలప్రను బలముతు నీవగు, వలచేతికి లోకువయ్యె వనజదళాక్షా. ౭౫

ఉ. శ్రీస్తుతిపాత్రగాత్రకృతచేష్టము మ్రుక్కికపోలపాళివి
న్యస్తకురంగనాభిమకరాంకురసౌరభభాసితంబు నీ
హస్తము తిర్యగన్వయమునం దుదయించిన నన్ను నంట వి
ధ్వస్తము లయ్యె మద్దురితవర్గము లోయపవర్గదాయకా! ౭౬

సీ. ఆరణ్యకాగ్నిహోత్రాంతరాయనిరాసచతుర మెవ్వనిపాదజలజరేణు
వంతకాతిథు లైన యసురవంశజులకుఁ బాథేయ మెవ్వనిబాహుశక్తి
పాథోధిగాంభీర్యపర్యాయవైకల్యహేతు వెవ్వనిబాణపాతమహిమ
యాచంద్రతారార్క మసురసామ్రాజ్యంబు నైరితమ్మునికి నెవ్వాఁ డొసంగె
దశముఖముఖాంబుజాతకాంతారఘోర, సామజం బయ్యె నెవ్వనిచాపవిద్య
యట్టిరఘుపతినిన్నుఁగా నాత్మఁదలఁతుఁ, బూతనాభూతనారీవిఘాతనిపుణ. ౭౭

దండకము. దేవా! సమగ్రానుభావా, విశుద్ధస్వభావా, త్రయీదత్తసేవా, భవానీశభాషాధిపస్వర్విభు ల్మున్ను గా నున్నవిద్వన్నిధు ల్నిన్ను భావింప లేర న్నఁ బెన్నాటకం బైననీపాటవం బస్మదాదు ల్నుతింపం గలారే! బలారే! భవద్భాగధేయం బమేయంబు ము న్నిక్షుకోదండపాటచ్చరు న్మేటిసీరాట మై మొత్తవే మొత్తవే మందరాద్రి న్మహోద్వృత్తితో నేలగోల న్గలద్దంష్ట్రికాటంక కైలాసకూటాగ్రకాదంబినిం జేయవే తీయవే మాయసింగంబవై కంబమున్ వ్రచ్చి కార్చిచ్చునుం బోని యర్చిర్నిధిన్ దైత్యనాథు న్నరున్నాథుతోఁ బుట్టి కన్పట్టుచుం బొట్టివై చేరి వైరోచని న్యాచకత్వంబున న్వేఁడవే మూఁడులోకంబుల న్వాఁడికోపంబుతోడం గుఠారాగ్రధారామహాకాళరాత్రి న్సృజింపవే హైహయశ్రేణి నిశ్రేణిగాఁ జేయవే బాణపంక్తి న్దివం బెక్కు పౌలస్త్యవంశ్యాళి కెల్ల న్మృషాభీర నీమేర లేమందు మందాకినీజన్మహేత్వంఘ్రికంజాత కంజాతగర్భుండ వై పుట్టి పుట్టించుచు న్గట్టురాతాల్పవై పొల్పు గల్పించుచుం బన్నగాకల్పవేషంబుతో శోషఁ బొందించుచున్ మించి లోకంబు నేకాధిపత్యంబు నీనిత్యకృత్యంబుగా నుండు నీపండితత్వంబుఁ దత్తాదృగైశ్వర్యగాంభీర్యమాధుర్యవంశంబు లే నెన్నఁగా నేర్తునే కూర్తునే నీకు లోకేశ శ్రీకేశవా! కేశిసంహారకారీ మురారీ హరీ హావభావాభిరామా భవైకప్రియా భావనాతీత భిన్నాహితవ్రాత భీమప్రతాపా భుజంగాధి

శాట్టల్ప భూతిప్రదా భేదదృగ్దూర భైక్షాన్నభుక్సేవధీ భోగభద్రాత్మ భా
మాంతకా భక్తనిర్ముక్త భర్మాంబరా నన్ను రక్షింపు పక్షీంద్రవాహా. ౭౯

క. అని పొగడుఁ భల్లుకాగ్రణిఁ, గనికరమునఁ గని కరమునఁ గంసారి నయం
బున మేను దువ్వె మేఘముఁ, దనకరమున సంస్పృశించు తరణియనంగన్.

గీ, హరికరస్పర్శమునఁ బావనాంగుఁ డగుచు
జాంబవంతుండు సంతోషజలధిలోన
మునిఁగి పులకితదేహుఁ డై మ్రొక్కి లేచి
పలుకు ముకుళితనిజహస్తపల్లవమున. ౮౦

క. జన్యస్థలి మానవహా, మాన్యమతి న్నిన్నుఁ దొడరి మద మేఁదితి మ
త్కన్యాపరిగ్రహంబున, ధన్యుని గావింపు నన్నుఁ దామరసాక్షా. ౮౧

క. అని తనడెందము కైవడి, ననుపమగంభీరతరము నతివిశదమునా
పెనుగుహకుఁ గృష్ణుఁ దోకొని, చనియె న్భల్లూకలోకచంద్రముఁ డెలమిన్.

సీ. హరిణలోచన లెల్ల నప్సరఃకాంతలు కలభూరుహము లెల్లఁ గల్పతరులు
సామజఘట లెల్లఁ జౌదంతికొదమ లుచ్చైఃశ్రవంబులు సింధుజంబు లెల్ల
శుద్ధోదకము లెల్ల సిద్ధరసంబులు చింతామణులు మణిశ్రేణు లెల్లఁ
బురుషు లెల్లను దివ్యపురుషప్రకాండులు హేమాబ్జకలితంబు లేఱు లెల్ల
నిత్యకళ్యాణమయములు నెలవు లెల్ల, వైభవము లెల్ల నధిగతప్రాభవమ్ము
లెలుఁగుమన్నీనివీటికి జలజగర్భ,వాసవేశ్వరపురములు గీసవెలితి. ౮౩

ఉ. ఆనగరంబునందుఁ గమలాక్షుఁడు పౌరవధూదృగుత్పల
శ్రీ నిజదేహయష్టికిఁ గసీసపుఁబట్టగుచాయఁ బూన్పఁ బా
దానతులై జను ల్గొలువ హాటకహర్మ్యమునందు రత్నపం
చాననపీఠి నిల్చెఁ బ్రథమాద్రిపయి న్రవి వొల్చుచాడ్పునన్. ౮౪

శా. విద్యుద్వర్ణసువర్ణదండభృతము ల్వింజామర ల్పర్వె దీ
పద్యోతంబులు ప్రజ్వరిల్లె నమృతప్రాయంబులై యంబుము
క్పద్యామధ్యలగానము ల్నిగిడె నాపద్మాక్షుఁ డవ్వేళ సం
పద్యుక్తం బగు ధర్మమే యనఁ గడు న్భాసిల్లె నుల్లాసి యై. ౮౫

క. సకళత్రపుత్రముగ నా,సకలేశ్వరుఁ గొలిచి తత్ప్రసాదంబున భ
ల్లుకనాథుఁ డమరె మధుమా,సకళాకమనీయతరుణసహకారరుచిన్. ౮౬

చ. కళలు భజింప వచ్చు శశికాంతి విధంబున నేగుదెంచె న
య్యేలువులఁజేనియాజ్ఞఁ గమలేక్షణుసన్నిధికి న్నఖీజనా
వలి భజియింప జాంబవతి వ్రజమయాభరణౌఘశింజితం
బులు పదవమ్మ నీ వనుచు బుజ్జవమారఁగఁ బల్కునట్లుగన్. ౮౭

—। జాంబవతీకన్యావర్ణనము ।—

క. మెఱుఁగుఁజిగురాకుమడుఁగులు, పఱచినవాఁ డేమొ పద్మభవుఁ డంగనయి
య్యాఱకాళులు నిర్మించెను, తఱి నందలియీనియలు గదా శుభరేఖల్.

గీ. అడుసుఁ జొరము కాళ్లు గడుగ మే మంచున, న్నలినలక్ష్మిఁ దెగడునగవులనఁగఁ
గాంతచరణనఖరకాంతులు వెన్నెల, గాయుచుండు బహుముఖముల నలరి.

గీ. అతివ వ్రేళులు పిల్లాండ్ల నందమంది, పల్లవచ్ఛాయములమీఁద మల్లచఱచుఁ
గేలి నుపమానవస్తుజిగీష నేస్తుఁ, జేరి పెనఁగంగ నవి జగజెట్లు గావె. ౯౦

చ. మదనజయాంకకాహళుల మంజులతాగుణగర్వరేఖ యం
దదుకులు చేసి బత్తళికలందలి కందళితప్రశస్తి యె
ప్పిదమును నైన కొత్తి పరబృంహితశాలివిశేషగర్భసం
పదయును బొల్లుసేసి నగు భామచిఱుందొడదోయి యాయతిన్. ౯౧

క. అతులితలావణ్యౌఘ, ద్వితయంబు ఘనీభవించువిధమున వికస
చ్ఛతపత్రపత్రనేత్రకు, సితపటఫేనములు దొడలు జిగిబిగి దనరున్. ౯౨

చ. తనదుపురాణచక్రమున దానవలోకజయంబె కాని యం
జనఘనవర్ణహస్తజలజంబున కింకిటమీఁద స్పర్శసం
జనితసుఖంబు గాంచి మణిచంద్రికలాలనఖేలనంబు న
వ్వనితకటీరచక్రవిభవంబునఁ గల్గుఁగదా తదాదృతిన్. ౯౩

గీ. కమ్రలావణ్యసారంబుగరఁచి తెచ్చి, చెలువకటి సేయనలువ నించినఁబొడమిన
పోఁతకాలును బోలె నింపులు దనర్చు, నాభి గాంభీర్యలాభసన్నహనశోభ.

ఉ. కాళిమఁ జంద్రమఃకళలుఁ గైకొని ధాత సరోరుహాక్షి వే
ణీలసితంబు మోము హవణింపఁగ నం దవశిష్టపుంగళల్
కాళిమ మధ్య మన్నభము గావున డాఁపఁగఁ బోలు రోమరా
జీలతికావళిత్రితయశిల్పము పేరిట నింతికౌనునన్. ౯౪

గీ. ఘనజఘనచక్రవిభ్రమకౌశలమున, నింతికుచకుంభములు చేసి కంతుఁ డురక
యుబ్బ నెత్తినతదవకాశోదయంబు, కామినీమణిమధ్యంబు లేమితీఱు. ౯౫

మ. స్మరదంతావళకుంభపీఠములు సాక్షాత్కారముం జూపున
య్యరవిందానన చన్నుఁగొండ లగుఁ గాఢా నూత్నకస్తూరికా
పరిమిశ్రాగురుపత్రభంగమదజంబాలంబు గల్పించునో
వరహారావళి శుక్తిముక్తికపదత్వంబుం బ్రతిష్ఠించునో. ౯౭

క. హరినఖపదయోగ్యములుగఁ, బరమేష్ఠి సృజించెఁ గాన భామకుచంబుల్
గిరివరడింభము లనఁదగుఁ, గరికుంభము లనఁగ రాదు కవిసూక్తులకున్.

చ. విధుడినరత్ననేత్రకరవేష్టనయోగ్యత కర్హమైన య
వ్విధుముఖిబాహుయుగ్మము వివృద్ధమదస్తనకుంభము ల్మహా
నిధు లని కాచియుండిన ఫణిద్వితయం బటుగాని దయ్యెనే
నధికతరస్వభోగలసదంచితకంచుకలబ్ధిఁ బొల్చునే. ౯౯

గీ. భూరిరత్నమయోర్మికంబు మృగనయన, కేలుకలశాంబునిధివేలఁ గేలిసేయుఁ
జేతఁ బదివేలతర మైన సిరుల విత్తు, పేఁగువారలు సరకు గావింప రొరుల.

గీ. పువ్వుఁబోఁడి గ్రీవ పోఁకబోదియగాన, నగవుపువ్వుఁబాళ లిగురు లొత్తె
నధరఫలము చాలనరుణిమ వహియించెఁ, బత్త్రలతలు పత్త్రభాతిఁ దనరె.

క. శ్రీకారములకు సతిక, ర్ణాకారంబులకు నొక్కయన్వయ మగునోఁ
గాకున్నఁ గమ్మ లంటుట, చేకుఱునే యక్షరప్రసిద్ధియుఁ గలదే. ౧౦౨

శా. ఆరక్తాగ్రము లైనజాంబవతినేత్రాంభోజము ల్నవ్యసిం
దూరాకారవిభాతసంధ్యరుచిఁ దోడ్తో రంజితాగ్రంబు లా
నీరేజచ్ఛదరేఖలం దెగడు రాణించుం దదాసక్త భృం
గీరూపంబు గనీనిక ల్వెనుచుచున్ ఖేలప్రచారంబు లై. ౧౦౩

క. సురపొన్నమొగ్గవజ్రముఁ, బరువపుసంపంగిములికిఁ బట్టించి రతీ
శ్వరుఁడు సతిబొమ్మసింగిణి, నరివోసినగతి సరత్న మగుము క్కలరున్. ౧౦౪

ఉ. తామర నీరుమోవ హిమధాముఁడునుం గళవచ్చి డిగ్గఁ దే
జోమహిమాభిరామ మగుచు న్నుదతీవదనంబు వొల్చు నే
మీమకురంబుఁ బ్రోవ దది మేనులఁ దేనియలందు రూక్షహృ
త్తామసుల న్గణింపరుగదా హరిఁ జేరినవారివారలున్. ౧౦౫

క. అలకాభిరామ మగుటం, జెలి కలరు లలాటరేఖ శ్రీదప్రభ బొ
మ్మలు పద్మమహాపద్మం,బులు మొగమున నిలువ నిడిన మొదలిటిలెక్కల్. ౧౦౬

క. ఆహారినీలములు గుణ, గ్రాహులు దామయ్యె నేని ద్రాస మఱిఁ దృణ
గ్రాహు లగుచు నా త్రిభువన, మోహనకచభరము శరణముగఁ జొరవలయున్.

గీ. సొబగు నీల వేణి సుమనస్సమాసక్తి, యుతము నుత్తమాంగయుతమునగుట
వెన్ను నాశ్రయమున వేమాఱు నెఱిచూపు, భల్లుకేంద్రతనయ భావమునఁగ.

సీ. ఆకురు లా నెఱు లామందహాసంబు లాముఖచ్ఛాయలు నామృదూక్తు
లాకటాక్షేక్షణవ్యాపారధారలు నాకరనఖరరత్నాతపములు
నానిస్తులస్తనాహంకారరేఖలు నామధ్యతానవం బాగభీర
నాభిసరస్స్థిరశోభిశైవాలశంకాకారిరోమరేఖా ప్రవృద్ధి
యానితంబగరిమ యాయూరుసౌభాగ్య, మట్టి చిఱుతతొడల యందచంద
మాశిరీషకోమలాంఘ్రితలస్ఫూర్తి, జాంబవతికి నిచ్చె జలజసూతి. ౧౦౯

గీ. నడకచూపు నెడల నాళీకపత్త్రాక్షి, గమియు హంసశిఖులగర్వరేఖ
పీరపత్ను లెందు విపుల తేజశ్శక్తిఁ, జూపు టెల్ల ధర్మదీపితంబు. ౧౧౦

సీ. అడుగుల కెంజాయ లన్నియు నూరిచి తెచ్చి కెంపులుగాఁగ గ్రుచ్చరాదె
ఘనజఘనాభోగగౌరవంబు హరించి పృథివీతలంబు గల్పింపరాదె
భారంపుగుబ్బల పసిఁడిక్రొమ్మించుల బంగారుగిరులుగాఁ బన్నరాదె
లపనలావణ్యలీలామోహనశ్రీలఁ జంద్రకోటులఁ జేసి సాఁకరాదె
కన్నుఁదళుకులవిద్యున్నికాయకాయ, విసరముఁ లకును ధ్రువపదంబొసఁగరాదె
కురులఁ బుట్టింపరాదె భాస్వరుని మ్రింగు, నిరులననినింతి యెంతయు సిరుల మెఱయు.

శా. ఆకన్యాతిలకంబు దెచ్చి హరి కుగ్రారాతిసంహారికిన్
లోకస్తుత్యచరిత్రపాత్రుఁ డగు భల్లూకేశుఁ డర్పించె సీ
తాకాంతన్ జనకుండు రామునకు ధర్మాధీనశౌర్యోదయో
త్సేకప్రీతమనస్కుఁడై యొసఁగురీతి న్ధన్యసంకల్పుఁ డై. ౧౧౨

— శ్రీకృష్ణజాంబవతుల కల్యాణము —

వ. అప్పు డాభల్లూకవల్లభు నుల్లాసంబునకు ననుకూలంబుగ యదుతల్లజ కళ్యాణార్థం బాగుహాగృహరాజంబునఁ బ్రతిగృహంబును శోభనసంభారంబు విజృంభించె నందు. ౧౧౩

సీ. కస్తూరికాగోముఖములు* ధాత్రికిని గంధవతి యన్పేరు తథ్యముగఁ జేసెఁ
బురరమాసితనేత్రతరళప్రభలలీలఁ గలువపూఁదోరణంబులు సెలంగె

* గోముఖము=అలుకుటం.

హరిఁజూడఁ దలలెత్తు నహివల్లభులఫణంబులు వోలెఁ గేతనంబులు చిగిర్చె
గృహదేవతోరులక్ష్మీసహోదరములై ద్వారస్థితాంశుమత్ఫలలు వొలిచె
వేణువీణాది వాద్యనిక్వాణ మమర
సారఘనసారమునఁ బట్లు చలిచి రింతు
లురగగృహకల్పతరువులవిరులు నెఱసె
నంగడులఁ బుణ్యాలగ్నంబు నపుడు గదిసె. ౧౧౪

క. అత్తఱిఁ బాతాళమునీం, ద్రోత్తము లొనరింపఁదొడఁగి రుచితశుభకృతుల్
పొత్తములు విప్పి చూచుచుఁ, దత్తాదృఙ్మంత్రతంత్రదర్శకు లగుచున్.

ఉ. వాసుకిముఖ్యులౌనురగవల్లభు లింతులతో మురారివా
రై సకలప్రయోజనము లర్హాగతిం బొనరింపఁ బూని ర
బ్జాసనపుత్రపక్షమునయందు గృహస్థపురంధ్రిరత్నముల్
సేసలు వెట్టి జాంబవతిఁ జేరి యొనర్చిరి భద్రకృత్యముల్. ౧౧౬

క. జలకమునింటికి నిజతను, ఫలకము పులకములు దాలుపఁగ హరి వచ్చెం
గులకములు గట్టి కాంతా, తిలకము లూడిగ మొనర్చు తెఱఁగున మెలఁగన్.

సీ. శేషసింహాసనాసీనున కొకయింతి యర్పించె నాణిముత్యాలగద్దె
హరిరుద్రజనకమా నలికంబునం దొకతరుణి హరిద్రాక్షతములు వెట్టె
సకలరక్షకుఁ డైనస్వామికి నొకలేమ కౌక్షేయకంబు రక్షగ నొసంగె
నమరాభిషిక్త మానచ్యుతుశిరసున నెలఁతుక యొర్తు నూనియ ఘటించెఁ
గీర్తికర్పూరగర్భితాఖిలదిశునకు
నతివ యొక్కతె గంధాన నటక లిడియె
దృక్కృపాస్నాతనిజభక్తదేహునకును
హరిణనయనలు జలకంబులార్చి రపుడు. ౧౧౮

సీ. శిరసార్చి తడి యొత్తెఁ జెంద్రికపావడ నొక్కతె గోపాలయూథపతికిఁ
జంద్రికానిభశుభక్షౌమంబు లొక్కతె యొసఁగె సజ్జనపద్మభసళమునకు
నీరాజనావళి సారించె నొక్కతె దైత్యదావాగ్నికంధరమునకును
సురటిగా డ్పొక్కతె సరణిగాఁబసరించెయదుసరఃకువలయాభ్యుదయమునకు
[illegible] గనళజలజ

సీ. పూను మీకహ్లారపుష్పదామము మాకుఁ బీలినెత్తెము లేదు కాళియారి
భరియించు దాడిమీఫలకమాలిక మాకు గురివెందసరులు లే వురుగుణాఢ్య
సాతుము కాశ్మీరచర్చ మేనున మాకు రాధమైపూఁత లే దోధృతారి
కట్టుము కలహంసకలితనేత్రము మాకుఁ బసుపుఁబచ్చడము లే దసురవైరి
భక్తులము గాని యడవులఁబడిచరింప, శక్తులముగాము మేమంచుజాంబవత్తు
మారినెచ్చెలు లాడంగ శౌరి నగుచు, వివిధనేపథ్యసౌభాగ్య మవధరించె.

వ. జాంబూనద సమానద్యుతి యగు జాంబవతికినిం బుణ్యాంగనా జనంబులు పరిణయోచిత శృంగారంబులు గావించి రంత నాసద్యోభావివధూవరులు విద్యోతమాన విధూపలఫలక కలితంబును లలిత ముక్తాఫల లలంతికావందన మాలికాకాంతంబును నై సకుటుంబంబుగ నవతరించిన విధుమండలంబు విధంబునం బుష్కళం బగు కళ్యాణచతుష్కంబునందు ధవళపుష్కరంబు నలంకరించు మధుకరీ మధుకరంబుల విభవంబు నభినయించి రభిమతప్ర దాత యగుజామాతకు భల్లూకపతి యుల్లోకతరానంద తరంగితాంతరం గుండై ధారాప్రధానవిధానంబు ను మధుపర్కాచారంబు ను నాచరించెఁ ద దాస్వాదనం బాదామోదరునకు ఘోషయోషాగృహ కుటీర గోరసపానం బునుం దలపించె నప్పుడు. ౧౨౧

క. నీరాజనపత్రంబుల, చేరాజీవాక్షు లుల్లసిల్లిరి నవమే
ఘారంభజనితరత్నాం,కూర లగు విదూరధరలకుం బ్రతి యగుచున్.

క. హరిణీనేత్రకు హరికిని, దెర నడుమ నొనర్చి రపుడు తెలుపలు సిరికిం
బురుషోత్తమునకు నంబుధి, తెరఁ బెండ్లి ఘటించు సలిలదేవత లనఁగన్.

గీ. తండ్రి యుపదగఁ జేయుచో దానవారి,కాంతి సుత నేత్రశుక్తినాకంఠముగను
గ్రోలియును దెరయడ్డంబుగొల్పుటకును, బాలపతిఁజూచుతహతహం బల్లటిల్లె.

క. తెరచాటున నుండిన న,య్యిరువురడెందములుఁ జినుఁగ నేసె మరుఁడు ద
చ్ఛరములను గాన రా దటఁ, దొరిగెఁ జెమటపేర నరుణతోయకణంబుల్.

క. తెరఁ దివిసినఁ బక్కున న, య్యిగవురచూపులును గలసి యుదియదియనరా
నిరసావేశంబునఁ జొ,క్కి రభసమున లజ్జ మరలఁగాఁ ద్రోయించెన్. ౧౨౬

గీ. మధుకణస్నాత మైనపద్మంబు రేకు, ధార్తరాష్ట్రంబు ముక్కునఁ దడవుకరణి
బాలికామణి చెమరించుకేలు దొడికె, నీలవర్ణుండు రక్తాబ్జనిభకరమున.

క. కేలుం గేలును బతిఁ సతి, గీలింపఁగ నేయు మకరకేతను బాహా
నాళంబు కండెవట్టిన, నాలో రతి పువ్వుఁదేనెయంటునఁ బిసుకున్. ౧౨౮

క. ఇరువురకుఁ బ్రేమబంధము, లురలకయుండంగఁ గూర్చి నొప్పమరఁగ న
య్యిరువురకొంగులు ముడిచిరి, సరసులు బాంధవులు నైన సాధ్వీజనముల్.
క. ధరణీధర మెత్తిన తన, కరమునకుం గంపభరము కనువ్రేఁగుగ న
య్యరవిందవదనకంధర, ధరణీధరుఁడు గట్టెఁ బసిఁడితాళిన్ హేళిన్. ౧౩౦
క. కాలాతిదీర్ఘ మగున, త్తాళి నరాళాలకామతల్లిగళము ల
క్ష్మీలలిత మయ్యె రత్నపు, మాలిక సుట్టిన రమారమణుశంఖ మనన్. ౧౩౧
చ. నిను నినుఁ దల్లి దండ్రి యని నీతి దలంపక యేఁచుచున్న యా
మనసిజుఁ బాసి వచ్చితిమి మమ్ము దయామతిఁ బ్రోవుఁ డంచు నా
యనవిలునారి రెండుదెగ లై కరపద్మమునం బెనంగె నా
వనితకు శౌరికిం దగు శివప్రదకౌతుకసూత్రబంధముల్. ౧౩౨
చ. జిలుఁగున వస్త్రఘూలితము సేయఁగ రాలు పసిండిముగ్గువె
గ్గలమున బాహుమూలతలకాంతులు గుప్పసముం బిగిల్చి రాఁ
గలకలఁ గంకణక్వణనగర్వ మఖర్వముగా వలగ్న మ
గ్గలముఁ గృశింప నింతి నిజకాంతుని చేతలఁబ్రాలఁదేల్చినన్. ౧౩౩
క. కలశాబ్ధి వీచిజలకణ, ములఁ దడిసిన కల్పభూజమున కెన యయ్యెన్
దలదరవిందదళాక్షుఁడు, మలయజదరహాస పుష్పమంజరులజడిన్. ౧౩౪
వ. అప్పుడు హోమకృత్యంబునుం బ్రవర్తించి కన్యాకుమారు లంగనాకరా
ర్పిత కనకాసనంబునందు ధర్మంబు నధిష్ఠించిన లక్ష్మీవిజయంబుల యోజ రా
జిల్లి రాలోన. ౧౩౫
సీ. హోమ పెట్టుముంచిన సవిధాంగనలు గాన రనుబుద్ధి నాభిముఖ్యము వహించి
యొండొరుఁ గదియంగ నొత్తర పెట్టినో కంతుఁ డనఁగ వ్యాజకలనఁ గదిసి
మఱపుల బెరసిన మరలింప లేకయు బాలిశదృష్టుల బలిమిఁ ద్రిప్పి
యనలంబు నోర్వక యన్యోన్యమును జొరఁబాఱిన క్రియ మిథస్స్పర్శనొంది
స్వేదముల దోఁగి పులకల విస్ఫురిఁగి, కంపములఁగుంది స్తంభసంగతుల డింది
హోమమొనరించి రవ్వేళ నొకవిధమున, లోలలోచనయు నబ్జలోచనుండు.
క. సతటి స్నేహము రత్న, క్షితిధరకూటాంచలములఁ జిలికెడుకరకా
వితతి యనఁ గనకవస్త్రా, న్వితుఁడై శిఖిశిఖలఁ జక్రి వేలిచె లాజల్. ౧౩౭
క. పలపలని మొగులుఁ దెరలో, పల నింద్రుఁ డుశచియుఁ దోఁచుపగిదిని విభుఁడున్
జలజాతాక్షియుఁ దోఁచిరి, తొలితొలి ధూమాంకధూమధోరణి నడుమన్.

క. హెచ్చిన చెందొవకొలఁకు, న్మెచ్చు మెయిం జుట్టుహంసమిథునము సరిరా
నచ్చతురమతులు దిరిగిరి, విచ్చినశిఖ లడరు నాహవిర్భుజుచుట్టున్. ౧౩౯
సీ. శార్ఙ్గయోజితశాతశరపుంఖసంఘాతనిర్భరాకర్షణోన్నిద్రతరము
లూధస్యధారామహోదగ్రధేనుపయోధరదోహనోద్యోగకృతులు
గోపికాకుచశాతకుంభకుంభకఠోరచూచుకలాలనశోభనములు
సాత్యకిప్రముఖేష్టజనసహద్యూతాగ్రశారికాశీలనచతురములును
నైన హస్తాంగుళంబుల యాదవేంద్రుఁ, డతివ ... ... ...
... ... మునఁ దనలోచనముల, నగవు గదురంగఁ బది వేలునగఁగ నెమర.
గీ. తారు నిల్పినట్టివారలు నొక్కొక్క, వేళఁ బని ... ... ...
... ... దానును, ధ్రువవరప్రదాయి ధ్రువునిఁ గాంచె. ౧౪౧
స్రగ్ధర. సూక్తంబు ల్గాక గానస్ఫురణనమృతవృష్టుల్ ప్ర
... ... నలగుచు బాలామిళత్పార్శ్వలౌచుం
బక్ష్మోగ్రానమ్రభావప్రకటిత సుషమల్ పారపారీణబంధుల్
... ... ... ... రామ్రేడితోక్తిన్. ౧౪౨
సీ. "పుత్రవాన్ భవ" యనఁ బూనిమన్మథుఁ గన్నతండ్రియాటకును సాధ్వసమునొంది
"కనకవాన్ భవ" యనఁ గాఁబోయి యాదిలక్ష్మీవల్లభుం డని క్రేగ్గుమలఁగి
"యారోగ్యవాన్ భవ" యనఁ బన్ని భవరోగవైద్యుండు గావున ... ...
"ధర్మవాన్ భవ" యనఁ దలఁచి ధర్మస్థాపకుం డితం డౌనని కుతిలమంది
వెదకి తారెద్ది గలుఁగ దీవింపఁ గడఁగ,
నొకవిధంబున దీవించి రుర్విదివిజు, లగ్రవర్ణత్వపారగాథాత్మ్య లగుచు. ౧౪౩
క. మామకును మ్రొక్కె నల్లుఁడు ...
ప్రేమమునఁ గౌఁగిలింపన్, బూమెలదేవరకు నెన్నిపోకలు గలవో. ౧౪౪
వ. ఇట్లనన్యసామాన్యసంపన్ను లగు నాదంపతులు (వృద్ధ)జనంబులకు నభివం
దనంబు లాచరించి తదభినందితులై రంత జనార్దనుండు రక్తార్ద్రం బగుబలీ
వర్దచర్మ(ంబున) గజాసురాజినోపరివిరాజితుండును గ్రొత్తపెండ్లి కొడుకును
నైన దక్షిణామూర్తి ననువర్తించె నప్పెండ్లి నాలుగుదినంబులును నభీష్టాన్నభో
జనంబులను విశిష్టపూజనంబులను గంధతాంబూలోపలాలనంబులను విచి
త్రచేలనంబులను విహారంబు లుదారంబు లయ్యె నంతఁ జతుర్థహోమా
నంతరంబున భల్లూకలోకవల్లభుం డల్లునకు నరణం బొసంగం దలంచి.

—॥ జాంబవంతుఁడు కృష్ణునికిచ్చిన హరణసామగ్రి ॥—

సీ. త్వష్ట మున్నరుణాంశుఁ దఱిమెన నిడ రాలు తేజంబుచేఁ జేసి తీఁడి తెచ్చి
బ్రహ్మకు నిచ్చె నా బ్రహ్మయుఁ బుత్రుండ నగుట నన్నెంతయు నాదరించి
భావికాలంబునఁ బని చాల నున్నది యోవత్స దీని నీవునుపు మనుచు
నాకర్థి దయచేసి నాఁడిది దీన నే రామరావణరణరభసవేళఁ
జెండి చెకబొక లాడితి దుండగంపు, సోఁకుమూఁకల జగమెల్లఁ జోద్య మంద
ననుచు జామాతకునొసంగె నచ్ఛభల్ల, భర్తయొక ఖడ్గమతుల ప్రభావయుతము.

మ. ఇది శుద్ధం బిది సిద్ధయోగ్య మిది చిత్తేష్టార్థసంధాయకం
బిది లక్ష్మీకర మీవు గొమ్మనుచుఁ దానిచ్చె న్నుతాభర్తకు
న్మది నుప్పొంగుచు జాంబవంతుఁడు నిశానాథప్రభాపూరముం
బొదువంజాలిన యొక్కహారము జగత్పూర్ణప్రభాధారముఁ. ౧౪౭

ఉ. భోజనపాత్ర మొక్కటి యపూర్వము పర్వతధారి కిచ్చె నం
భోజభవప్రసూతి యది భోజనవేళఁ దలంచుభోజ్యముల్
యోజనసేయఁ జాలు నది యోజనమాత్రవిసారికాంతి వి
భ్రాజితగారుడాశ్మవిసరస్థగితంబు విషాపహారముఁ. ౧౪౮

చ. ఇది గరిగంటిగానిరుచి నింపగు మాయుట లేదు భూతల
త్రిదివభుజంగసద్మములు దీనఁ గనుంగొనవచ్చు దానవ
త్రిదశులకైన లే దిది మదీయతపఃఫల(లబ్ధ)మంచు న
మ్ముదుకఁ డొసంగె నల్లునకు ముత్తెపుటద్దముఁ బెద్దసేయుచుఁ. ౧౪౯

సీ. చదివెనా యిది బ్రహ్మసభలోనిమునులచిత్తంబులకురు నపత్రప యొసంగుఁ
గైలాసపతియింటిగాణలనేనియుఁ బాడెనా యిదియె కీర్తించుఁ జాలు
భాషించెనాయిదిపలుకుఁదొయ్యాలియైనమూఁగయైవదనంబుమూసికొనును
నయశాస్త్రమిది దెల్పెనా బృహస్పతిశుక్రసర్వాధిపతులైన జలదరింతు
రిది దశాననకాంతకు నిచ్చు ముదము, సరమ యిది దెచ్చియున్ని చ్చెజనకసుతకు
నాకె మశ్సతి కిచ్చె నీయనుఁగుఁజిలుక, నేలికొమ్మని హరి కిచ్చె నెలుఁగుఱేఁడు.

క. ప్రళయవ్యథకోర్వక య, బ్బలిసద్మమునందుఁ గాఁడు భాస్కరకిరణాం
బులువోనిదివ్యమణు లా, బలివైరికి నిచ్చె మామ బహుమానముగఁ.

మ. తలపూవాడక దీని నెక్కి సమరాంతర్వీథులఁ గెల్పుల
చ్చ్బులఁ జూఱ ల్గొని తెచ్చు రావుతుఁడు తేజోలాభము ల్గాంచు భూ

తలము న్నాల్గుచెఱఁగు తేలు నని చంద్రజ్యోత్స్నయుం బోని త
త్తళి నిచ్చె న్నగచారి చారణసురస్త్రీణస్తుతఖ్యాతికిఁ. ౧౫౨

సీ. కరటస్రవద్దానకర్దమనిష్యందధోరణీకల్పితదుర్దినంబు
దంతకుంతామేయధాళధళ్యనికాయకల్పితాకాలికకౌముదీక
మురుతరక్రోధోగ్రతరనేత్రరోచిర్విభార్చితఫణిరాజపాటలిమను
నీలగాత్రాధిక్యనిర్మితనీలాచలేతరభూమిధరేంద్రజాతి
యైనయొకహస్తిఁ దెచ్చి దైత్యారి కిచ్చె,భల్లుకస్వామి దాన నబ్బల్లిదుండు
కువలయాపీడపునరుక్తిసవి మహోన్న,తాబ్ధినిర్మగ్నతరచిత్తుఁ డయ్యె నపుడు.

సీ. మలయానిలంబు వీరలయూర్పులఁబోలుఁ జిలువ లెంగిలిసేయఁ జేరవేని
కలువలవిందు వీరలమొగంబులఁబోలు దక్షాధ్వరధ్వంసి తన్నఁడేని
జలజాతములు వీరిచరణాబ్జములఁ బోలు రవ్వ స్తమయపీడ రాయదేని
గంధసారము వీరిగాత్రగంధముఁబోలు అంపపుఁగోఁతల వ్రయ్యదేని
ననఁగ నుపమల కుపమలై యతిశయిల్లు, పల్లవకృపాణకరవాలపల్లవములు
వల్లవేంద్రున కిచ్చె నాభల్లుకంబు, దేవతాస్త్రీల నేలెఁవు తెఱవపిండు. ౧౫౪

గీ. ఇది విధాతృదత్త మిది యమానుష మిది,తలఁచు నెడల కరుగు గెలుపులిచ్చు
ననుచు నొకరథంబు హర్యక్షతురగంబు, హంసకేతనంబు నతఁ డొసంగె

క. చాపం బొక్కటి యిచ్చె, న్గోపాలున కచ్ఛభల్లకులపతి విజయా
టోపప్రదంబు రత్నక,లాపాలంకృతము భువనలాలనపరముఁ. ౧౫౬

సీ. ఇది దాల్చువీరున కెడ్దప్పి జనియింప దరులతోఁ బోరంగ నాహవమున
హరివిరించులహేతు లనియైన నిది దాఁకి యుత్పలక్లీబత నొంది డిందు
నిది లోహమయముగా దెల్లవేల్పుల తేజములు గొని కావించె జలజసూతి
బేతాళపన్నగప్రేతభూతపిశాచభయముల నిది పాఱఁబట్టఁ జాలు
దీని దొడి నేను గల్పాంతదీప్తభాను,భానువుల వేఁడి యాఁగిప్రాభవముఁగంటి
ననుచు నొకవారవాణమయ్యల్లునకును,రామభక్తుండు ప్రేమానురక్తినొసఁగె.

వ. మఱియుఁ గఱియ వేలుపునకు నాళీకభవప్రభవుం డభిమతార్థంబు లొసంగి జాంబవతికిం దదధికం బగునరణం బిచ్చి యచ్యుతునింగూర్చి కూఁతు నను పంగ నంగవించి కన్నీరు నించి. ౧౫౮

—॥ జాంబవంతుఁడు పుత్రికి బుద్ధులు గఱపుట ॥—

గీ. తెఱవ పాతాళమాణిక్యదీపకళిక, రమణి కందర్పధాటీపురఃపతాక
బాల భల్లూకకులసౌధభర్మకలశి,యనఁగఁ జెలువొంది వెలసితి వబ్జవదన.

ఉ. అట్టితెఱంగు గాదు సకలాధికుఁ డైనమురారి కేలు చే
పట్టితి రుక్మిణీప్రముఖపద్మదళాక్షుల కెక్కు డైతి వో
పట్టి పతివ్రతాత్వపరిపాటిఁ గులద్వయవృద్ధిహేతు వై
పట్టము గట్టుమీ భువనపావనకీర్తివిలాసపూర్తికిన్. ౧౬౦

సీ. ప్రాణవల్లభుఁ డెంతభక్తి గావించిన నంతకంతకు వినయము వహింపు
సవతులగుణరూపసౌందర్యములఁ గాంచి సుళుగులు వన్ని యసూయపడకు
మత్తమామల నెమ్మి నారాధనముచేసి వార లొసంగుదీవనలు గనుము
స్వాతంత్ర్యమున నీవు వారల కర్థంబు లీకు మించుక యైన నిల్లుమొఱఁగి
కొలువు మిలు వేలుపుల నిష్ఠ దలకొనంగ
శీలతాచారపరిశుద్ధచిత్త వగుచుఁ
బుత్ర పౌత్రాభిలాషవిస్ఫూర్తిఁ బొందు
మిందుముఖులందు విఖ్యాతి నొందు తల్లి. ౧౬౧

వ. అని బుద్ధ్యుపదేశపూర్వకంబుగా నాయఖుమధ్య శిబికారూఢం జేసి యా
రూఢయౌవనలావణ్యతారుణ్య లగుచిగురుఁబోండ్లం గూర్చి యనిచె నను
చుటయు నయ్యిందుముఖి ముకుందసమన్విత యై సేనాబృందంబు గొలువ
నిజపురంబు నిర్గమించె నామార్గంబున. ౧౬౨

గీ. భద్రమూల ముదగ్రసుపర్ణయుతము, విపులఫలదాయకంబు నై విబుధతరువుఁ
బోలు రథ మెక్కె వేదాంతజాలపంజ, రాంతరాళశుకంబు పఠించితముగ.

క. హరిగలవారలు నడచిరి, హరియిరుగెలఁకులఁ బురాణహరిఁ గూర్కపరి
స్ఫురితములై చనుమానుష, పరికరములు గొలుచుపగిది బహుధాగతులన్.

గీ. గడలపౌఁజు నడిచెఁ గంసారి యిరుగడ, వానకాళ్ళతోడి వారిదంబు
లింద్రుఁ గొలుచులీల నెసకంపుటార్పులు, కుటిలజటిలవజ్రఘోషణముగ.

క. బలువిండ్లవారు వొదివిరి, బలిబంధను నతఁడు పవనపాతానతవం
శలతా ప్రత్యంతనగా, వలివృతకులపర్వతంబు వడువునఁ దనరెన్. ౧౬౬

క. ధళధళదసివల్లికలన్, జళిపించిరి కృష్ణుఁ గొలుచుసద్భటవృషభుల్
మలయానిలచలితోత్పల, దళములు గలకొలఁకు లనఁబోదలెఁ దత్తనువుల్.

సీ. అర్కాంశులఁ దెమల్చునబ్జంబులును బోలె వేత్రలతాహస్తవిభవ మడర
రవళిసేయుమరాళరాజంబులును బోలెఁ గమనీయబిరుదశంఖములు మొరయ
నలినచ్ఛదంబులు చలియించుటయుఁ బోలె సమదవారణకర్ణచలన మలరఁ
బారుగు బేడిసపిండు పుటముగొంటయుఁ బోలె జవనహయంబులు చౌకళింప

రాజదంభోజరాజపరాగరాజి, పోలెఁ బెందూళి దిక్కుల మూసికొనఁగ
సకలభూచక్రకూలంకషంబు లగుచు, నందనందనవాహినుల్నడువఁదొడఁగె.

చ. హరిరథరేణు వత్తతిఁ బరాసుతఁగన్న ప్రసేనుమీఁదఁ ద
త్తురగముమీఁదఁ బర్వుటయుఁ దొల్లిటియట్ల సజీవభావముం
బొరయుట గల్గె నత్తెఱఁగు పూర్వమునందు నహల్యశాపసం
జ్వరము నడంచు రాఘవుప్రచారము దూరము సేయకుండునే. ౧౬౯

క. హరిహృతజీవము ఋక్షే, శ్వరహృతరత్నంబు నిచ్చి సత్రాజిత్తో
దరు ననిచె గురుకుమారక, వరపునరుజ్జీవకుండు వరదుం డగుచున్. ౧౭౦

—కృష్ణుఁడు జాంబవతితో నిజపురమునకు వచ్చుట—

క. వెన్నెలతోఁ జుక్కలతో, వెన్నెలవేలుపు వెలుంగువిధమున నడచె
న్వెన్నుఁడు జాంబవతి యుఁ దా, ను న్నిబిడము లైనవాహినులు సేవింపన్.

సీ. మిహికాదిశాయ సమాక్రాంతలజ్జ
సత్కృసారథిసూనుసామీప్యపన్నగి యవిచారయోగరాజార్థనీతి

... ... ... ... ...

యనఁగఁ దగు జాంబవంతుగుహాంతరమున
డించి వచ్చిన యదుసేనఁ గాంచి చంచ
లించు ద్వారక నలరించెఁ బంచవిశిఖ
జనకుఁ డేతెంచి సంతోషజనకుఁ డగుచు. ౧౭౧

సీ. తనచక్రచక్రమిత్రప్రభావలిచేత వదనాంబుజంబుల వాడు దేర్చి
తనపాంచజన్యచంద్రవినూత్నచంద్రికఁ జక్షురుత్పలములఁ జలువఁ దనిపి
తనవైజయంతికాదామసౌరభముల సకలాంగముల బడలిక లడంచి
తనయురశ్చిహ్నకాదంబినికాళిమ వెలవెల్లఁ బొఱల్ల విరియఁ దట్టి
నిజవిరహభీతహృదయుల నిఖిలబంధు, గురుసహోదరముఖ్యులఁ గుస్తరించె
భల్లుకాధీశనందినీప్రాణభర్త, యార్తరక్షణదక్షుఁడైకకర్త. ౧౭౩

ఉ. వారిజనాభుఁ డీకరణి వచ్చుటయుం బురివారలెల్ల మా
యూరము వారిదంబు గని యుబ్బుగతిం బురివిచ్చి యాడి రా
శౌరియు మేరుశైలసమసారభుజాంచలపీఠిఁ దాల్చె భూ
భారముఁ బూర్వధారఁ బరిపాండురకీర్తిసుధానిధాన మై. ౧౭౪

మాలిని. సకలభువనయోషాసాంద్రలావణ్యపోషా
ధికశతధృతిపాత్రిన్ దివ్యతారుణ్యగాత్రిన్

వికచకమలగంధర్ విభ్రమస్ఫూర్తిసంధర్
మకరధిశయుఁ డేలెర్ మన్మథక్రీడఁ దేలెర్. ౧౭౫

సీ. మధురాధరాధర మాధవప్రియ యయ్యు మరుకేళిఁ జెమటలమంచుగురియు
శైవలాలకజాల చక్రిలాలిత యయ్యు నెత్తావితెమ్మెర నిర్వహించుఁ
గురువిందనిభదంత హరిమనోవశ యయ్యు లేనడ మత్తేభలీలఁ జూపుఁ
గిన్నరోపమకంఠి కృష్ణపాలిత యయ్యు నెమ్మోము తెలివి వెన్నెలలుగాయుఁ
గనకగౌరాంగి వామనవనిత యయ్యుఁ
బొడవుసూపు సపత్నులపొంక మడఁచి
స్రష్టకును మన్మరా లఁట జాంబవంతు
కూఁతు రెటు లుండె నేనియుఁ గొదవ గలదె. ౧౭౬

చ. తరుణి నితంబచక్రముకతంబునఁ జక్రియుఁ గృష్ణుఁ డింతికం
ధరమున శంఖహస్తుఁడు మదావళిగామిని కన్నుబొమ్మ క్రొ
మ్మురువున శార్ఙ్గియు న్భువనమోహిని జంఘలపొల్పుచే గదా
ధరుఁడును నయ్యెఁ గాక కలదా యభిధాన మనాదిమూర్తికిన్. ౧౭౭

క. ఈకరణి మదనభరణ, శ్రీకి న్గుతియైన విభునిచిత్త మెఱఁగి భ
ల్లూకవిభుతనయ యొకనాఁ, డేకాంతంబున ముకుందు నిట్లని పలికెన్.

ఉ. తామరసాక్షునాభివెలితామరఁ బుట్టిన సర్వదేవతా
గ్రామణిమన్మరాల నన గౌరవముం దగి యచ్ఛభల్లుక
స్వామితనూజనై భువనశాసి నినుం గడు వాసిఁ జెందితి
న్నోములు నేను నోఁచుక్రియ నోఁచిరె యెవ్వరు నివ్వసుంధరన్. ౧౭౮

ఉ. కట్టితిఁ బట్టుఁబుట్టములు కాంచనరత్నవిభూషణావళుల్
వెట్టితిఁ జేయి మీఁదుగను బెట్టితి బంధుల కీప్సితార్థముల్
చుట్టితి దిక్తటంబుల యశోలతికాకృతి కౌముదుల్ తుదల్
ముట్టితి భాగ్యసంపద నమోఘభవత్తరుణాగుణంబునన్. ౧౮౦

క. దంతరుచికోరకంబు న, తాంతాంగుళిపల్లవంబు దరహాస్యసుమం
క్రాంతము నగుసంతానము, సంతానము దీని నా కొసంగవె నాథా. ౧౮౧

సీ. ఋణదారుణవ్యథారుణభానుఁ గబళించుతమము పుత్రకునిమస్తకముకప్పు
సంతోషరససుధాజలరాశి నుబ్బించుపర్వేందుబింబ మర్భకునివదన
మన్వయాంబుజషట్పదాలాపలీలలు బాలకుజిలిబిలిభాషణములు
పితృమనఃకల్పకక్షితిరుహాగ్రమునకుఁ బువ్వులు పసిబిడ్డనవ్వుపసలు

నిఖిలబాంధవదృక్పద్మ నీడమూచు, నద్దములు చిన్నిపాపని ముద్దుఁజెక్కు
లధిప సంసారసౌఖ్యంబు లనుభవించు, వారలకుఁ గల్గవలదా కుమారుకలిమి.

సీ. తనుసంభవుండు యౌవనవనచ్ఛేదకుఠారాంచలం బైన గౌరవంబ
యాత్మజాతుండు గాత్రాబ్ధినిర్భేదనమందరం బైన నానందకరుఁడ
సుతుఁడు వక్షోరుహక్షితిధరకాఠిన్యటంకాగ్ర మైనఁ బ్రేమాంకురంబ
బాలుండు పతిరహఃకేళీనిరసనైకహేతుభూతుం డైనఁ గౌతుకంబ
తల్లికిని నేడుగడయును దారకుండ, జననికిని బట్టి తనుతాపచందనంబు
గాన నా కిమ్ము సంతానదానలాభ, మాశ్రితావనకృతదీక్ష యంబుజాక్ష.

—॥ కృష్ణుఁడు సంతానమునకై కైలాసమున కేగుట ॥—

క. అన విని నిజసతిఁ బలుకు, న్ననవిలుతుని గన్నతండ్రి నాళీకనిభా
నన నీకోరికితీవకు, నొనగూర్తు ఫలంబు వగవ కుల్లములోనన్. ౧౮౪

సీ. శూలిచేఁ జంద్రార్ధమౌళిచే వ్యోమనిచోళిచే ఫాలస్థకీలిచేత
రుద్రుచేఁ గరుణాసముద్రుచే భోగనిర్నిద్రుచే గుణగణాచ్ఛిద్రుచేత
భీముచే నిష్టప్తకాముచే నమ్రసుత్రాముచేఁ గరుణాభిరాముచేత
భర్గుచే హృతభూతసర్గుచే దత్తాపవర్గుచేఁ దనువసద్దుర్గుచేత
శంభుచేత సుధాదృక్కరంభుచేత, శివునిచేత నిరంతరోత్సవునిచేత
వరము వే కాంచి సత్పుత్రవరు నుదంచి, తాత్మునేఁ దెత్తు నీకోర్కు లందియిత్తు.

వ. అని యాప్రొద్దు యద్దయాళుండు కైలాసశైలయాత్రోన్ముఖుం డై నిఖిలభువన దీపాంకురాయమానప్రభాకాంతుం డగు గరుత్మంతుం దలంచిన నాశకుంత పతి యాజాంబవతీకాంతునుందట నావిర్భవించుటయు. ౧౮౬

సీ. బంధురత్రోటివిభావిభవప్రౌఢి మిన్నేటి తెలినీటిఁ గన్నుగీటఁ
గోటీరతటనిరాఘాటరత్నచ్ఛాయ లర్కాంశుసంపర్క మభినయింప
నక్షీణవీక్షణాప్రక్షేపముల నభస్సీమ విదూరంపుభూమిఁ జేయఁ
బక్షాగ్రజాగ్రత్ప్రభాశ్రీలు దిగ్బాలికాంగవల్లులఁ బసుపార్చుచుండఁ
జండగతిచూపు నప్పక్షిమండలేంద్రు, నద్రిలోకైకభర్త నీలాద్రివోలె
నెల్లదిక్కుల నిజతేజ మెక్కుచుండ, నెక్కె దైత్యారి యభిమతం బిచ్చఁ గోరి.

సీ. దిక్కరీంద్రములతో దివిఁ దేలుభర్మాద్రి యన రెక్కమొగుపుల ఘనములంట
శీఘ్రయానోద్వృత్తిఁ జెమటచిత్తడి దాల్చె ననఁ దారకములు మై నావరింప

నంటి పాయని ప్రతాపాతపోదయలక్ష్మి యన మేనిడాలు దిగ్వ్యాపి గాఁగ
వెంటనే యెగసిన విబుధస్రవంతి యో యన నాననజ్యోత్స్న యల్లికొనఁగఁ
జండతరవేగవిభ్రమాఖండలీల, హాళి మించిన గరుడవాహనము మ్రోయ
భల్లుకేశ్వరనందినీవల్లభుండు, గదిసెఁ గైలాసనగము శంకరదిదృక్షు. ౧౪౮

—॥ కైలాసవిశేషములు ॥—

ఉ. సారెకుఁ గమ్మఁదెమ్మెరలు చల్లెడు మానసభర్మపద్మకాం
తారభవాణు రేణుసముదాయము క్రిందట రాలి పొల్చు నాఁ
డారజనీచరాధిపభుజాగ్రసముత్పతదద్రిరాజభా
రారభటీవిమర్దితమహాంగదహేమరజచ్ఛటాకృతిన్. ౧౪౯

మ. హరుఁ డాడంగఁ గరోటికోత్పతకృతాహంకారము ల్పొంగ నూ
పురనాదంబులసావి గౌరి యెటయేఁ బో నీశ్వరానుజ్ఞచే
మరలింపం జను నెచ్చెలు ల్దివియ రామార్గంబు నాత్మాస్వరు
క్సరదిందూపలవీథులం జరణలాక్షాచిహ్నము ల్దోఁపమిన్. ౧౫౦

సీ. అలయాలసవిహారమలయానిలాంకూరసలయాహతరసాలవలయితంబు
కాలాగురులతాళిలీలాగతకపాలిబాలాగణవిహారలాలితంబు
గంగావనాభంగభంగావళీతుంగశృంగాభినిర్ఝరాలింగితంబు
భృంగీతతోత్సేకసంగీతపరిపాకభంగీతరంగితప్రాంగణంబు
కటకతటపర్యటద్భోగికటకతనయ, కటసముత్కటదానశీకరసుగంధ
గంధవాహకిశోరసంఘాతముదిత, హరిదిభేంద్రకపోలాళి యచలమౌళి.

క. ఇల్లయ్యె నందుఁ గలుమను, లిల్లయ్యె జగంబులేలు నీశ్వరునకు నా
వెల్లనిగట్టులదొరమురు, వెల్ల నిరూపింప శక్యమే యెవ్వరికిన్. ౧౫౨

గీ. కేళివనమాళితటఝుకీజాలశంభు, మందిరధ్వజదండదంభమున శిఖరి
యభవశుద్ధాంతరక్షకుం డగుటనొక్కొ, కంచుకోష్ణీషవేత్రసంగతి వహించు.

సీ. ప్లవమానపవమాననివహనిర్భరకంపితద్రుశాఖాపతత్ఫలమిషమున
భూరిసానుస్థానహారిహీరాంకురగుచ్ఛాచ్ఛచాకచక్యచ్ఛలమున
నిస్తులవిస్తృతప్రస్తరోల్లంఘనారంభజర్జరఝురీదంభకలన
గర్వభరాఖర్వశర్వవాహనధేనువరఘణాత్కృతిరవవ్యాజలబ్ధి
నిజగుహాగేహకిన్నరీనిరతగీయ
మానసానాపధానసంధానములకు

మెచ్చి డెందంబులో వేడ్క హెచ్చ నించు
నవ్విం బుకించుc గొనియాడు నగధరుండు. ౧౯౪

సీ. అభ్రంలిహాభంగశుభ్రతరోత్తుంగశృంగవజ్రప్రభాస్మితవికాస
మఖిలజగన్నందితాచారనారదవ్యాసాదిపరమసంయమినివాస
ముద్ధరణసముద్ధతోద్యోగనిర్వేగచకితమానసధృతచంద్రహాస
మతులగుహాగేహాగతఖేచరద్వయీరచితనానావిధరతివిలాస
మభిమతప్రాప్తిసంభ్రమోద్ధతకిలాస, మాగమాంతచరిష్ణుకృతాధివాస
మైనకైలాసమునకు నాయతవిలాస, భాసి యై యేగియాహేము వాసుదేవుండు.

వ. తపశ్చరణసముచితస్థలంబు నరయుచుండె నప్పుడు. ౧౯౬

శా. కుండీధారులు నిర్వికారులు తపఃకుక్షింభరు ల్దీగురు
ల్దండాలంకృతపాణిపద్మలు దయాదాక్షిణ్యసమ్మ ల్మహా
శ్చండాంశుప్రతిమాను లయ్యచలరాజస్థాను లేతెంచి త
త్పాండుప్రోద్భవవత్సలుం గనిరి బోధశ్రీఘను లన్మునుల్. ౧౯౭

—( కైలాసవాసు లగుమునులు కృష్ణు దర్శించుట )—

మ. దినకృద్బింబము డిగ్గ నాదిహరిరీతిం గశ్యపాపత్యవా
హనముc డిగ్గి యదుప్రవీరుcడు శమాయత్తైకచిత్తంబున
న్వినతింజేయcగcబోయినం గరముల న్వేమెత్తి దీవించి ర
య్యనవద్యోదయహృద్యమూర్తి శ్రుతిపద్యాసంప్రవర్తిc హరిc. ౧౯౮

సీ. కలశాంబునిధిలోలవలమానకల్లోలయుతకేలి కేసీటియర్ఘ్యమిగి
సనకాదికస్వాంతజలజమధ్యనిశాంతవిహరణకృతికి నేవిగులపూజ
యఖిలవేదవిదీశయజ్ఞపురోడాశహారికి నేఫలాహారరచన
పద్మసంభవముఖ్యభజనలీలాసౌఖ్యశాలికి నేయుపచారకప్తి
సంతతోల్లాసి నిగమనిశ్వాసభాసి
నెట్టిసూక్తులచే నుతియించువార
మాదిమధ్యాంతరహిత మాకతిథి వైతి
వనుచుc బూజించి రచ్యుతు నాదిమునులు. ౧౯౯

శా. ఆపూజావిధు లెల్లc గైకొని ప్రసాదామోదమేదస్వి యై
యాపద్మోద్భవుతండ్రి వల్కు దరహాసాంకూరచంద్రాతప

శ్రీపాండిత్యము తద్విలోకకుముదశ్రేణీవికాసోదయా
టోపంబుం బచరించుచుండ మృదుచాటుప్రౌఢవాగ్వైఖరిన్. ౧౦౦

శా. నీవారం బని యాదితత్త్వము మది న్నిత్యంబు భావించుచు
న్నీవారంబులు నీరము ల్ఫలదళానీకంబు లేకంబులన్
దైవాఱం గొని మీరు సేయు తపము ల్తత్తత్ఫలప్రాప్తులం
గైవారంబులు సేయఁగాఁ దగునె యీకైలాసవాసంబునన్. ౧౦౧

చ. అనవుడు వార లిట్టు లని రంబుజనాభునితోడ నోజనా
ర్దన వినవయ్య మాతప ముదాత్తఫలాత్తమహత్తరస్తుతిం
గనుటకు వేళ యున్నదె యొకానొకహేతువు తావకాంఘ్రిద
ర్శనమ నిదర్శనంబు జలజంబునకు న్రవిరాకయుం బలెన్. ౧౦౨

చ. ఉరమున నచ్చి లచ్చి గొలువుండఁగఁ జక్ర మవక్రవైఖరిం
గరగత మై తగంగ నలగంగ పదాంగుళి నుబ్బ గబ్బి వై
సరసిజసంభవాదిసురసంఘ మసంఖ్యము గొల్వ నుండియున్
హరునకు వింద వైతి తగు నాప్తబహూకృతి దొడ్డవారికిన్. ౧౦౩

క. మాహృదయంబులఁ గలసిన, నీహృదయము మాకుఁ దెలిసె నిఖిలాధిప నీ
యీహిత మవ్యాహతముగ, నీహితకల్పక మొసంగు నీశ్వరుఁ డిచటన్. ౧౦౪

సీ. ధూర్జటి యాయుష్ప్రదుం డౌటకును సాక్షి దండితాంతకుఁడు మృకండుసూతి
భూతేశుఁ డపవర్గదాత యౌటకు గుఱి మన్యుదూరుం డుపమన్యుమౌని
రుద్రుండు సంపత్కరుం డౌటకును లక్ష్య మక్షీణధనకర్త యక్షభర్త
హరుఁడు సంతానదాయకుఁ డౌటకును గరియగు శిలాదుఁడు శిలాదాభిధేయుఁ
డాశ్రితాంబుజహేళి చంద్రార్ధమౌళి, శంకరుఁడు భక్తులకును క్షేమంకరుండు
శివుఁడు నీకిచ్చు నిష్టార్థసిద్ధి హెచ్చు, మేనురానందగుణసాంద్ర యాదవేంద్ర.

మ. ఇట భానుండు తపంబు సేసె నిట దేవేంద్రుండు శ్రీ డాసె ము
న్నిటఁ జంద్రుండు ప్రసిద్ధి మించె నిట యక్షేశుండు దీపించె నాఁ
డిట సప్తర్షులు హర్షముం గనిరి భూయిష్ఠైకనిష్ఠాఢ్యులై
యిట నీవుం దప మాచరింపు భవదీయేచ్ఛార్హదేశంబునన్. ౧౦౫

గీ. అని దినాధీశు దీవించి యనుగు కిరణ, పాయులును బోలెఁ బద్మినీప్రాణనాథు
డాసి కొనియాడి చనిరి కైలాసవాసు, లమ్మహాత్ముండు దపమునకప్పుడు గడఁగె.

శా. పారావారవిహార హారివదనాబ్జా యబ్జరాగప్రభా
గారశ్రీ చరణానతార్తహృతభంగా శృంగభృద్భేదన
స్వైరస్ఫారబలా బలాహితముఖస్వర్ధామకోటీరకో
టీరారజ్యదభీతిదానపరిపాటీచాటు హస్తాంబుజా ! ౨౦౮

క. కావేరీతరళతరం,గావళివలమానపవనహతిపరిహృతల
క్ష్మీవక్షోరుహకనక,గ్రావాఘాతప్రయాస కల్పితహాసా. ౨౦౯

భుజంగప్రయాతము. శరత్పుండరీకాక్ష చక్రాయుధా ని
ర్జరేంద్రోపలశ్యామ సంవర్తవహ్ని
జ్వరాభీతలోకౌఘసంచారయోగ్యో
దరాంతఃప్రదేశా సదా సుప్రకాశా. ౨౧౦

గద్యము. ఇది శ్రీమత్తిగుమల శ్రీనివాసాచార్యవర్యకరుణాపారంపర్య పాత్రా
త్రేయగోత్రాపస్తంబసూత్రపవిత్ర సకలకళాభోజ రామరాజరంగప్పరాజప్ర
ణీతం బైన సాంబోపాఖ్యానమునందుఁ దృతీయాశ్వాసము.

శ్రీరస్తు.

# సాంబోపాఖ్యానము.

---

## చతుర్థాశ్వాసము.

---

క. శ్రీమత్సప్తావరణా, గ్రామావృతరంగమందిరవిహార ముని
క్షేమంకరసంచారో, ద్దామా యాముక్తమాల్యదాస్తనహారా. ౧

వ. దేవా! భావికథాక్రమంబు నీదివ్యచిత్తంబున నవధరింపుము. ౨

— శ్రీకృష్ణుఁడు తపముచేయునపు డీశ్వరసాక్షాత్కారము. —

సీ. అభిషేకసమయమహా టరసి తీవలనుండి జోరునఁ బూఁదేనె సోన గురిసెఁ
గాషాయములు గట్టుకందువ పరికించి ప్రాఁకె సానుస్థలి రత్నరుచులు
భూతిఁ బూయఁగఁ బూనుపూనిక యారసి యలమె నేడాకుపొన్నలరజంబు
మానసబంధంబు మదిలోపల నెఱింగి సారంగచర్మమై జలద మమరె
సకలలోకేశునకు గిరిస్థావరములు
జంగమంబులుఁ దగుసేవ సలుపఁదొడఁగె
హరుఁ గృతార్థునిఁజేయఁ బుత్రాభిలాష
దంభమున శార్ఙ్గి మునివృత్తి దాల్చునపుడు. 3

మ. కనుమోడ్చన్ జగమంధకార భయలగ్నంబౌనన న్నేర కా
సనబంధంబున వృద్ధకచ్ఛపము నిస్త్రాణం బగు న్నాక భో
జనదూరస్థితి గర్భగాఖిలజగజ్జాలంబు శోషించు నో
యన కాత్మోద్భవకాంక్షఁ జేసెఁ దప మబ్జాక్షుం డురుక్షాంతితోన్. ౪

సీ. వాలఖిల్యద్విజావలిఁ గూడి ఖద్యోతకీటంబునాఁ దీవ్రకిరణుఁ డుండె
భూచ్ఛాయమైనిండఁ బొదివినయాదికూర్మమువోలెఁ గసుగందెఁ గుముదహితుఁడు
జగములు మూర్ఛిల్ల జగదసువులు గానఁ గదలనిగతి వాయుగతులుగుదిసెఁ
గురులచిక్కైడలించి హరుఁ డోసరించిన వాడుఁబూవులు వోలె ప్రాలెఁ దార
లఖిలదిక్కులు ధూమ్రంబు లయ్యె దిగిభ, గండమండలసంగిభృంగప్రకాండ
గరుదుదంచితకాళిమాక్రాంతిఁ బోలె, శ్రీమనోభర్త తప మాచరింప నంత.

ఉ. బాలశశాంకశేఖయును బన్నగహారము గాత్రలగ్నకా
శీలలితాంగరాగము దలిర్పఁగఁ గ్రొన్నన తీవచుట్టు పూ
దూళియుఁ గల్గు కల్పకముతో నెనవచ్చు ననంగ గట్టురా
చూలిమగండు వ్రేలదొరచూలికి సన్నిధి యయ్యె నెయ్యఁ బై. ౬

చ. ఘనతరశృంగకంబు గళకంబళకంద ముదారపాదశో
భనమును జంద్రసాంద్రరుచిభాసియు నై తనకొండఁ బోలి యం
జనఘనగర్జలం జెవులుశబ్దము దాల్పవలంతి యైనవా
హనముఁ దటాలునం డిగియె నంబయుఁ దాను బ్రియంబు సంధిలన్. ౭

శా. వాత్యాపారణభూషణుండు గదిసె న్వృందారుమందారముం
బ్రత్యుత్థాన మొనర్చె ఘోషమహిళారాగాంకురావాలము
న్నత్యాచార మొనర్పఁ బూన గిరిజానాథుం డహో చాలునం
చత్యంతప్రమదంబునం బొదివె బాహామధ్యవీథిన్ హరిన్. ౮

సీ. కౌస్తుభచ్ఛాయయుఁ గంఠంబుకప్పును గైరికాంబుదసమాక్రాంతిఁ బెనుపఁ
గనకాంబరంబును గరటిచర్మముఁ దృణజ్యోతిర్వనావృతిస్ఫూర్తిఁ బొదువ
వైజయంతియు భోగిరాజహారము హరితాళసానువు ఝురస్థలముగాఁగ
నెమ్మోము తేటయు నిటలాక్షిదీప్తియు వలగొను చంద్రార్కవలయములుగఁ
జేసి లీలకై నీలకైలాసయుగము, గూడియుండినకైవడి జోడుగూడి
యుల్లసిల్లిరి రుక్మిణీవల్లభుఁడును, వసుమతీధరనందినీవల్లభుండు. ౯

ఉ. కిన్నరసిద్ధసాధ్యవసుఖేచరచారణ రుద్రయక్షరా
ట్పన్నగపుంగవుల్ ప్రమదబంధురులై చనుదెంచి కల్పకో
త్పన్ననవీనపుష్పములు పైపయిఁ జల్లుచు సన్నుతించి రా
పన్నశరణ్యుల న్విబుధపాలనగణ్యుల నవ్వరేణ్యులన్. ౧౦

స్రగ్ధర. రంభాదిస్వర్గకాంతాప్రకటనటనసంరంభగంభీరహేలా
దంభప్రౌఢుల్ దలిర్చెన్ దశదిశలు సుధాంధస్వనద్వాద్యహృద్యా
స్తంభప్రస్ఫూర్తి మ్రోసె న్సకలభువనము ల్సమ్మదశ్రీలఁ దేలన్
జంభామిత్రారివైరీశ్వరు లచట మిథస్సంగతిం జెంగలింపన్. ౧౧

సీ. వారణవల్లభావనసముత్సాహాయ వారణదైత్యనివారణాయ
గోరాజభంజనోదారప్రతాపాయ గోరాజవినుతసుగుణగణాయ
భోగీంద్రశోషణాద్భుతపదన్యాసాయ భోగీంద్రమణిమయభూషణాయ
పర్వతోద్ధరణనిర్భరబలోత్తంసాయ పర్వతావాసవైభవపరాయ

యాదవేంద్రాయ పారిషదాధిపాయ, బ్రహ్మభూపాయ తారకాపతిధరాయ
నమ యటంచున చంచల ప్రమదగరిమం, బొగడిరజముఖులద్దేవయుగముం జేరి.

క. బిసరుహపత్త్రాక్షుండును, బిసరుహరిపుధరుండు నపుడు బిసరుహరాగో
ల్లసితమహావేదికపై, వసియించిరి సురలు రెండువంకలం గొలువన్. ౧౩

మ. అమృతస్యందము కందళింప దరహాసాంకూరము ల్లోచనా
గ్రములం దాండవమాడఁ జంద్రధరుఁ డాకంజాక్షు నీక్షించి యో
కమలాక్షా! పరురీతి నీవు వ్రతదీక్షన్ రూక్షచర్యాసము
ద్యమముం జూపుదువయ్య యెయ్యెడ సుహృద్భావంబె యీచందముల్.

సీ. ఆభీరభీరుమధ్యాక్షీణవక్షోజకుంభకాశ్మీరకరంభితంబు
రాధామనోభవారాధనాస్పదదృగత్యామచంద్రాశపక్షాళితంబు
రుక్మిణీభుజలతారుక్మసమోద్దామదామవేష్టనసముద్భాసితంబు
కుబ్జామనోజ్ఞహస్తాబ్జాతవిన్యస్తకస్తూరికాగంధగంధిలంబు
నిరుపమాగణ్యలావణ్యనిర్విరోధ, దివ్యసుమమాలప్రవాహదేదీప్యమాన
మైననెమ్మేను నలయింతువయ్య నీకు, నందరాని యభీప్సితం బెందుఁ గలదు.

క. లోకంబుల సృజకరుణా, లోకంబుల మనుచునట్టి లోకేశునకు
న్నీ కీప్సితంబు నొసఁగఁగ, నా కీపెద్దఱిక మిచ్చినాఁడవ కృష్ణా. ౧౬

క. నీవన నేనన నేక, గ్రీవము నీమానసంబుకీ లెఱిఁగితి ల
క్ష్మీవల్లభ సంతానఫలావాప్తిగుఱించి వచ్చి తస్మద్గిరికిన్. ౧౭

క. పుత్త్రుఁడ నై యుదయించెద, గోత్రసముద్ధరణకరణగుణశౌర్య తటి
ద్గాత్త్రి యగుభల్లుకేశ్వర, పుత్త్రికి భవదీప్సితంబు పూర్తి వహింపన్. ౧౮

మ. అన నంతం జనుదెంచెఁ జంద్రసుమమాహంకారశంకావహా
ననిర్యద్దరహాసచంద్రికలతో హస్తీంద్రయానంబుతో
ననుకంపాభరభాసమాననయనాబ్జాళిందదర్పంబుతోఁ
గనుసన్నం బనిసేయు నచ్చరలతో గౌరీమహాదేవియున్. ౧౯

క. చనుదెంచి యార్య పలుకుం, గనదంచితగుణవిశాలుఁ గరుణాలోలున్
జనతాజనితాపవిమోచనతాత్పర్యప్రవీణు శాశితబాణున్. ౨౦

సీ. నీపదాబ్జమరందనిష్యందమునఁ గాదె సగరులు దివి కేగుజాడఁ గనుట
నీనాభిజనియించు నిసువు చేబడిఁగాదె భువనప్రచారంబు పొంకపడుట

నీయురఃస్థలి నున్న నెలఁతుకకృపఁ గాదె విశ్వంబు సరి విఱ్ఱవీఁగి మనుట
నీలోచనంబులడాలు వర్వుటఁగాదె యీయహోరాత్రంబు లేరుపడుట
నీదునిశ్వాసములఁ గాదె నిఖిలనిగమ,వర్తనము లచ్చుకట్టిన వఱలనునికి
నిన్నుఁ గొనియాడ నెవ్వరు నేర్చువారు,దళితదంభవికార యాదవకుమార.

స్రగ్ధర. ప్రభుమంత్రోత్సాహ శక్తిప్రభుతకు నిరవై భాగ్యసౌభాగ్యయోగ్య
ప్రభలం జెన్నొంది పద్మోద్భవముఖనిఖిలప్రౌఢవాగ్గీతకీర్తి
శుభలీలం గాంచి తేజస్స్ఫురణ దిగళిదృక్చ్ఛాళికాహేమభూషా
విభవప్రౌఢిం జెలంగ న్నెలయు మవని నోవిశ్వలోకైకనాథా. ౨౨

గీ. అంత నయ్యంబికాకాంతుఁ డఖిలనాథుఁ
జూచి యోయయ్య తప మొనర్చుటకతాన
నింత బడలితి మాయింటి కేగుదెమ్ము
శ్రాంతి డిగఁ గొన్నినాళ్లు వసింతుగాని. ౨౩

వ. అనిన నప్పుడు. ౨౪

సీ. జిష్ణులోకముఁబోలెఁ జిత్రలేఖాఢ్యంబు ఖగముఁబోలె ననంతగమనశాలి
పద్మాకరముఁబోలెఁ బద్మరాగమనోజ్ఞ మలదశాస్యుఁడుఁబోలె నక్షలలిత
మహారాదియునుబోలె హంససంసక్తంబు పద్మజాంగముఁబోలె బహుముఖంబు
కృష్ణవర్త్మయుఁ బోలెఁ గీలోల్లసన్మూర్తి యతలంబుఁబోలె హిమాన్వితంబు
సతతసుమనఃపరంపరాశయత సజ్జ, నుంశుఁబోలె ననర్ఘ్యమై ఖండపరశు
నాజ్ఞ నేతెంచె నొక్కమహావిమాన, మానతారాతి యైన పద్మాక్షుకడకు.

క. సాంబుండు వృషము నెక్కెసి, తాంబుజనాభుఁడు విమాన మధిరోహించెం
బంబి నలుగడల దివిజక,దంబంబులు గొలువ నలువతనయుఁడు పొగడన్.

క. జగదధినాయకయుగళీ,ధగధగితశరీరకాంతి ధారాంకూర
స్థగిత మగుమిన్ను కల్వలఁ, దొగలం జిగిమిగులుకొలనితో సరివచ్చెన్.

వ. ఇవ్విధంబున నమ్మధుమథనమన్మథమథనులు గగనఘంటాపథంబునం జని రప్పుడు. ౨౫

గీ. విద్యుదాహతములుఁబోలె వివిధవిబుధ
కులము స్వాద్దులు మిఱుమిట్లుగొలుపఁజాలి
తళుకు దీపించు రత్నకందళకలాప
కిరణకులములు దిక్కులఁ గ్రేళ్ళుదాఁటె. ౨౬

గీ. తన్మహాభారవృత్తికి దందశూక,లోకనాథుండు ముక్తనిర్మోకుఁ డగుచు
బహుశరీరంబు లెత్తినరహి దుకూల, వేష్టితేందూపలస్తంభవితతి దనరు.

క. అల మింటఁ దిరుగువేలుపు, వెలఁదుల ప్రతిబింబపంక్తి విధమున నిందూ
పలశకలరచితకుడ్య,స్థలవీథులయందుఁ జిత్రతరుణులు వెలయున్. ౩౧

క. అరవిందహితుల నందఱు, నరవిందభవుండు చేసి యవశిష్టమహా
పరమాణుచయము డాఁచిన, కరణిన్ బహురత్నదీపకళికలు వెలుఁగున్. ౩౨

గీ. ధవళనేత్రవితానసుధాకరాంక,పంకకాళిమ వోనూకు భానులతిక
లనఁగ దేనియతోఁ గూడ నళులు జాఱు,చారుతరపుష్పమాలికల్ తోరమగును.

వ. అఖండప్రభామండలమండితంబై వెండియు భాగ్యవంతు నిశాంతంబు నుం
బోలె నవిచ్ఛిన్నసంతానకాంతంబును, సత్కవికవిత్వంబునుంబోలెఁ దతబ
హుళధ్వనిపనితంబును సిద్ధౌషధసేవకు శరీరంబునుం బోలె ముక్తామయంబు
ను సుధాశరధియుంబోలె వివిధసుమనోమనోహరంబును వీణాకల్పనంబునుం
బోలె ఘటితప్రవాళంబును వాలఖిల్యవలయంబునుంబోలె నరుణకిరణగ్రస
నరసికంబును శశిబింబంబునుంబోలె సుధామధురంబును, వినతాగర్భంబు
నుంబోలె విభవస్థలంబును సిద్ధసారస్వతంబునుంబోలె వివిధవర్ణోదీర్ణంబును
బసిండిబేహారంబునుంబోలెఁ దులాలాలితంబును నై ప్రమదమదనవిజృం
భమాణయౌవనోద్దామభామినీకుచశాతకుంభకుంభసంభూతప్రభాజటిలజటి
లంబును సకలకలకంఠకాకలీకోలాహలహారితసహకారప్రముఖతరూద్యాన
పద్యాహృద్యంబును గంధర్వగంధేభగామినీగాంధర్వసౌగంధ్యబంధురంబు
ను నగు న్నొక్క క్రీడాభవనంబున నా త్రిభువనజన్మభవనంబు నునిచి ప్రమథపతి
నిజనికేతనంబునకుం జనియె నంతనక్కడ నమ్మురాంతకుండు. ౩౪

సీ. ఏదిక్కుఁ జూచిన మేదురామోదసంపాదితకల్పకాచ్ఛాదనంబు
లేవంకఁ జూచిన హిమవాలుకారజఃకస్తూరికాసల్పకల్పితంబు
లెచ్చోటఁ జూచిన నిందుబింబాననాకమనీయనృత్యరంగస్థలంబు
లేపట్టు చూచిన హేమాబ్జకహ్లారకుముదగుంభితసరస్సముదయములు
గలిగి యుత్తుంభశంఖమర్దలవిరావ, కవచితాశేషకకుబంత మవుచు నలరు
కేళిభవనంబు భక్తుల నేలుసురభి, చూచి తేలెఁ బ్రహర్షాబ్ధివీచిఘటల. ౩౫

మ. సరసాన్నంబులు దివ్యశాటికలు భూషాపేటిక ల్వీటికో
త్తరము ల్సారసుగంధవస్తువులు శీతక్షోణిభృత్పుత్రి యా

దరమొప్పం బరిచారికావితతిచేతం బంపె శంపామనో
హరదివ్యాంబరధారికిం గలుషవిద్యాహారికిన్ శౌరికిన్. ౩౬

క. హరికిం బరిచర్యయొసఁగం, బరమేశుఁడు వనిచెఁ జతురభూషాచణలం
బరిచితమన్మథరణలం, దరుణులఁ జంచత్కపోలతలదర్పణలన్. ౩౭

మ. చరణాంభోరుహనూపురధ్వను లుదంచన్మన్మథజ్యాలతా
సరసారావముగాఁగ రత్నమయభూషాదీధితుల్ సాగసా
గరవేలానవవిద్రుమద్రుమలతాకందాకృతుల్గా రమే
శ్వరు సేవించిరి రుద్రకన్యకలు భావద్రావకప్రక్రియన్. ౩౮

సీ. అసమానతారక లంట వారికనుతీరు శ్రవణసంశ్లేషంబు దప్పు టరుదె
యభినవవిటపంబు లంట వారిబాహువు లగ్రపల్లవరాజి నలము టరుదె
యలరాజబింబంబు లంట వారివదనము ల్పద్మాహితప్రాప్తిఁ బరఁగు టరుదె
యలకాభిరామంబు లంట వారికొప్పులు నీలకంఠప్రీతి నెఱపు టరుదె
కొండలంట వారివక్షోజకోరకములు, కూటములయందుఁ బ్రోది గైకొనుట యరుదె
యనఁగ విలసిల్లు రుద్రకన్యలు మురారి, యిచ్చ కెంతయు గిలిగింతఁ దెచ్చి రపుడు.

శా. ఆకన్యాతిలకంబులు న్శతసహస్రానంగరమ్యాంగరే
ఖాకాంతం బగు నమ్మురాంతకుని యాకారంబు వీక్షించి స్వే
దాకీర్ణాంగలుఁ గంపమానకుచకుంభాభోగలు న్భోగదీ
క్షాకాంక్షావలమానమానసలునై కన్పట్టి రప్పట్టునన్. ౪౦

చ. హరి పదియాఱువేలజలజాక్షుల నక్షతరాగసాగర
స్ఫురణఁ గరేణుల న్గజము చొప్పునఁ దేల్చె నటంచు నాత్మ న
బ్బురపడ నేల నాగపతిభూషణకన్యలఁ గోటిసంఖ్యల
న్సరులు గొనంగఁ జేసె సుషమావిషమాస్త్రకృపాణధారలన్. ౪౧

క. చామరముఁ దెచ్చి యందొక, కోమలి మెయిమఱచియుంచఁ గొమ్మని యిచ్చెం
దామరసాక్షుని చేతికిఁ, గామిను లందఱును జూచి కవకవనవ్వన్. ౪౨

మ. అలగోవర్ధన మెత్తినాఁడ నని గర్వాటోపముం జెందఁగా
వల దీకొండొకకొండ లెత్తు నిను సత్త్వస్ఫూర్తిమన్మూర్తిఁగాఁ
బలుమాఱు న్నుతియింతు నంచు నొకశంపాగాత్రి వక్షోరుహాం
చలము ల్ద్రాయఁగఁ గౌఁగిలించె హరివక్షఃపీఠి సాపేక్షతన్. ౪౩

గీ. ప్రసవదామకమునఁ బెలుచమోఁఁ బాయవక్త్ర,మూర్తియైన శౌరినోర్తు సెలసి
మదనకేళిగతుల మర్మంబు లెఱుఁగంగ, పాటుకోలఁ బట్టు సానివోలె. ౪౪

చ. కలశజుఁ డట్లు చేసె. ననుఁ గన్నపయోనిధిఁ దొల్లినీవుఁ ద
త్కలశసఖంబ వౌదు వని గాఢగతిం బగ నీఁగఁ బూని చు
క్కలగమి కాఁడు పంచిన యొకానొక రాజకుమారు మేర ను
జ్జ్వలనఖరేఖ యొప్పె నొకచామకుచంబున శార్ఙ్గినించినన్. ౪౫

క. వదనశ్రీగృహదేహళిఁ, బొదివినరక్తాక్షతములపోలుపు వహించెన్
యదునాథుఁ డనుపమానందొక,మదిరేక్షణపెదవి రదనమణిచిహ్నంబుల్.

మ. సరసస్వేదకణార్ద్రదేహ యగుచు న్సంతోష ముప్పొంగ శ్రీ
హరి నాలింగన మాచరించె నొకహేమాకార యేతెంచి యం
గరుచివ్యాప్తిఁ దత్తనూగ్గతవిభాకాళింది యచ్ఛద్రవ
ద్వరజఃశ్రీఁ గనఁ జెంద నుత్పలలతానూధుర్యధుర్యస్థితిన్. ౪౭

మ. స్మరకీర్తిచ్ఛట లా తుషారకణికాసారోద్గతు ల్తామకో
త్కరహృజ్జాలకకూలవాతములుగాఁ దర్పించు హేమంతవా
సరవేళ న్నవయౌవనోద్ధితసరోజాతావలోకాపయో
ధరపాళీపరిరంభగుంభములు మోదం బిచ్చె దైత్యారికిన్. ౪౮

శా. చేతోజాతమదద్విపాధిపశిరస్సిందూరపాతంబు ల
జ్జాతాస్యామధురంజితాక్షియుగళీచంచత్ప్రభాభానురు
గ్జాతంబు ల్చలిదీర్ప గంధిలధనుర్జన్యైకవన్యోన్నతిన్
సీతుంగందువఁ గ్రీడసల్పు విసమజ్జిష్ణుండు కృష్ణుండు దోగిన్. ౪౯

మ. జగము ల్గాఁడు భుజాబలచ్ఛలనచే సాధింపనూహించు న
య్యగురుం గైదువు రాచవాని కిరవౌ హేలాగతిశ్రేణి లేఁ
బొగరుం బ్రాయపుఁ బువ్వుఁదోఁట వనయంబుం గ్రీడ గావించెఁ బ
న్నగతల్పుండు వసంతవేళల నితాంతప్రీతచేతస్కుఁడై. ౫౦

మ. స్మరభూపాలకకేలిదీర్ఘికల యోజ న్వేణికాశైవలో
త్కరవక్షోరుహచక్రహస్తబిసదృక్పద్మంబులం బొల్చు న
య్యరవిందాక్షుల కాంతిపూరములయం దశ్రాంతసంతోషపుం
బెరలం దేలె నిదాఘకాలమున దైతేయారి హారిస్థితిన్. ౫౧

చ. గురుకుచశాతకుంభమయకుంభ దరస్మితచంద్రికాసుధా
భర చికురాగ్రధూపలవపంక్తి విలోచనజాలజాలక
స్థిరత రతీశుమేడ లనఁ జెన్నువహించిన రుద్రకన్యలం
బరిపరిలాగుల న్రతులఁ బజ్జకుఁ దెచ్చె ధృతారి తొల్లరిన్. ౧౨

మ. మది నెయ్యంపుఁదగు ల్పయోధరరమామాధుర్యముం గల్గి య
మ్మదనారాధనకామధేనువులన న్మత్తిల్లు నత్తన్వులన్
యదునాథుండు గరంగఁజేసె నధరన్యంచత్సుధావారి శా
రదవేళం దమివోవఁ గ్రోలి రతిసామ్రాజ్యైకపూజ్యోన్నతిన్. ౧౩

క. ఇటువలెఁ బద్మదళాక్షుఁడు, నిటలాక్షుఁడు దనకునొసఁగు నెలఁతల హేలా
నటనఁ గరఁగించె రాగో,త్కటమతి నొకయేఁడు సురతకౌతూహలి యై.

—॥ కృష్ణుని కడకు నారదముని వచ్చుట ॥—

చ. జడముడి కెంపుఁ గృష్ణమృగచర్మము నల్పు విభూతి కాంతియున్
జడరుహసంభవాచ్యుతనిశాకరశేఖరులాత్మతేజ మి
ల్లడయిడి రాపుఁ డౌనని తదాకృతియం దననొప్పు నారదుం
డుడుపథవీథి డిగ్గి ప్రియమూనఁగ వచ్చె ముకుందునింటికిన్. ౧౪

ఉ. వచ్చిన యమ్మహాత్ముఁ గని వారిజనాభుఁడు మ్రొక్కి యర్చనం
బిచ్చి మహామునీంద్ర శుభమే యని కాంచనపీఠినుంచి వై
యచ్చరకార్యనిర్వహణ మన్వహముం బనిగాఁ జరించు నీ
వచ్చుట భాగ్యసంపదలు వచ్చుట నావుడు నాతపస్వియున్. ౧౫

సీ. జలజసంభవురాణి చరియించుపథమున బలియించుసోపానపంక్తి యనఁగ
గానసుధావృష్టికల్లిక నమ్మీఁదఁ గానంగవచ్చు నాగడప లనఁగ
రాగలక్ష్మీమందిరప్రాంగణంబునఁ గీలించు తోరణశ్రీ లనంగ
సరసస్వరస్థానజలధిలో నుదయించు సమధికాభంగభంగము లనంగ
మించురత్నమయంబులౌ మెట్లచేత, రహివహించినతనదైనమహతిఁ(బూని)
పాడెనొకకొంతవడి మానిభర్త దైత్య, హర్త సంతోషవార్ధి నోలాడుచుండ.

క. హరిమనసుఁ గరఁచి మునికేసరి యిట్లను దేవదేవ సాళ్వుఁడు గర్వో
ద్ధురుఁడై సవిమానంబుగఁ, గర ముద్ధతి విడిసె ద్వారకాపురిమీఁదన్.

వ. అమ్మాయావిచేత యాదవనికాయం బపాయంబుం బొందకమున్న వేంచేయు
మనవుడుఁ గాంచనాంబరుండు పంచవదనుచేత ననిపించుకొని ప్రతిప్ర
యాణోన్ముఖుం డై వైనతేయుం దలంచుటయు. ౧౬

—॥ కృష్ణుఁడు ద్వారకకు మరలి వచ్చుట ॥—

సీ. ఊరమెట్టినవెల వులుక వ్రస్సిన నేలలోని భోగీంద్రునిమేను వడఁక
త్రొక్కలు జాళింప జివ్వనునురవడి దిక్కు లన్నియు నొక్కదిక్కు గాఁగ
నీక్షణోగ్రప్రభ యొసఁగఁ జంద్రజ్యోతి మ్రోల దీవియపంజుఁ బోలి వ్రాల
నెఱవీఁక మై మెడ నిక్కించుటయును బ్రహ్మాండంబు పైచిప్ప యతుకు విప్ప
నురక మిన్నేటి నీరెల్లఁ గఱుకుటూర్పు, వడిని సుడివడి పిండలివండు గాఁగ
గరుడుఁడేతెంచుటయురమాకాంతుఁడెక్కె, విజయలక్ష్మీసనాథునావిహగనాథు

మ. గరుడస్కంధము మీఁద మేరువుపయిం గాలాభమానాఁగ ని
ర్భరవేగంబున నేగుదెంచి నగరప్రాకారసంరోధిభీ
కరసాల్వక్షితిపాలసైనికులఁ జక్రజ్వాలకీలానలాం
తరతూలాకృతి చేసె ద్వారవతి కుత్సాహంబు పుట్టించుచున్. ౬౧

గీ. క్రొత్తమోదుగుఁబూవుల యొత్తరంబు
తోడిచైత్రంబు వలిపింపఁ దుళుకరించు
నుపవనము పోలె ద్వారక యుగ్రరిపుల
యాఁక చక్రాయుధుఁడు మాన్ప నరుదు వొదలె. ౬౨

సీ. ఘోషయోషాకుచకుట్మలంబులమీఁదఁ జంద్రరేఖలు నిల్పుజాణతనము
రుక్మిణీసీమంతరుచిరసిందూరరేఖాపుండ్రకము దిద్దు కౌశలంబు
జాంబవతీఘర్మజలకణంబులు వోవ మీటంగ నేర్చిన పాటవంబు
రుద్రకన్యకలకురుల్దువ్వి చిక్కు వాపుటఁ దోఁచురసికత్వపోషణంబు
గలుగు వాలారుఁగొనగోరు కలువరేకు
మొనల మై దువ్వి ప్రియసూక్తి ముదమొనర్చి
పోయి రమ్మని యనిచె నంభోజనేత్రుఁ
డండజాధీశు దీప్రదాహప్రకాశు. ౬౩

క. హారుఁ డిచ్చువరముతోడం, బురసంరోధిద్విషన్నృపులఁ గడపి యనిం
బొరసినవిజయముతోడన్, హరి యంతఃపురము సొచ్చెనఖిలనుతుండై.

క. బలభద్రసాత్యకిప్రముఖుల నలరఁగఁజేసి నందగోపతనయుఁ డెం
డల వాడినసస్యములకు, నెలమి యొసఁగు మేఘమునకు నెనయైతగియెన్.

క. పితృగతిగను నాలస్యము, శతకల్పసమాన మయ్యెఁ జక్రాంకునకు
ద్ధతి జాంబవతీదర్శన, రతికౌతూహలము మనసు రాయిడిపఱుపన్. ౬౬

క. అంతఃపురాంతరస్థిత, కాంతాగృహములనుఁ జనక కనులా త్తుఁడు వా
క్కాంతాసుతుసుతగృహమున, కెంతయుఁదమకమునఁజని యెనిమిపో కూర్మిల్.

చ. చని తనపోయివచ్చినప్రకారము సర్వముఁ దెల్పి జాంబవ
త్తనయ మనఃప్రసాదసహితంబుగఁ జేయు నపోపచారముల్
మనసు గరంగఁజేయ నొకమాసము తద్భవనంబునంద ని
ల్చె నఘవిరోధి యత్తరుణి చేసినపుణ్య మగణ్య మయ్యెడన్. ౧౮

—॥ జాంబవతి గర్భోత్పత్తి ॥—

చ. కమలదళాయతాక్షుకృప గర్భముదాల్చిన భల్లుకేంద్రపు
త్రి మిగులు స్వాతితువ్వర గరిష్ఠమణిన్ ధరియించు శుక్తిచం
దమునఁ దదుద్భవుండు గుణధన్యుఁడుఁ జంద్రసమాన కాంతివి
భ్రముఁడు వధూనుచాభరణభావభవుండును గాకయుండునే. ౧౯

క. హరితేజము నిజగర్భాం,తరమున ధరియించి యొప్పెఁ దాటంకిని భా
స్కరగర్భిణి యగుసంధ్యా, తరుణియునుంబోలె నధికతరరాగమునన్. ౨౦

మ. అయథాపూర్వవపుర్విలాసము స్వభూపాదానవైరాగ్యని
ర్ణయసంక్రాంతమనస్క ముజ్ఝితనిజప్రాణేశసంసర్గ మ
క్షియుగీసంప్లవనోపదేశము శ్రమక్లిన్నాంఘ్రివిన్యాస మ
వ్యయనిద్రాసుఖలోల మిందుముఖి గర్భాధాన మొప్పం గడున్. ౨౧

గీ. మధురసము గ్రోలి తేలెడు మధుకరములు
గలుగు వెలిదమ్మి విరిపోలెఁ జెలువమొగము
వెలయఁ బారిప్లవాక్షి తారలఁ దలిర్చె
యాడ వేంద్ర మరాల మాప్లోన మొంద. ౨౨

క. సీమంతశిరహితం బగు, సీమంతిని కచభరంబు చెలువగు మార్గా
దామాగ్రోల్లంఘనపర, మై ముఖశశిఁ బొదువు తిమిర మన నురుతరమై. ౨౩

గీ. అబ్ధినుదయించుశశి మేననంటిపిడపఁ,దనువ్రతడియాలరాలుము త్యాలుపోలె
హంసగామినివదనంబునందునుండి,యురకపలుమాటుఁజిన్నచిట్టిములువెడలు

గీ. డెప్పరం బైనతనదు కాఠిన్యధనము
పోవఁగల దని తర్కింపఁ బొడముచింత
మొగము గందెనొ యనఁ గుచయుగము సతికిఁ
జూచుకాక్రాంతనీలిమ సొబగునొందె. ౨౪

క. కొందఱు కల దనఁగా మఱి, కొందఱు లే దనఁగ నున్న కోమలిమధ్యం
బందఱకుఁ గలుగు చే తెలి, పెం దానవ మెడలి గర్భబృంహితమగుచున్. ౭౭

గీ. అతివబింబారుణాధర మాను వేళ, మంద భావంబె చూపు ముకుందుఁ డలర
జడిమ గావించుటకుఁ దాన చాలుఁగాదె, బింబికాఫలలాలసస్పృహాజనులకు.

గీ. దరవికచపద్మవదన మృత్స్నాబుభుక్ష, యసురవైరికి నానంద మొసఁగఁజాలె
గ్రస్తనీలాభఘటలశరత్తు కరణిఁ, జిట్టుములకాలపుష్పవిజృంభణముగ. ౭౮

క. సొమ్ములు విరళముగా నా, కొమ్మ ప్రకాశించెఁ దెలుపుఁగొలుపు మొగముతో
నెమ్మెలఁ గారా కెడలుచుఁ, గమ్మవిరులగుత్తి గలుగుగహానరమ క్రియన్. ౭౯

శా. ఏకాంతం బగు వేళ వచ్చి సతిమో మీక్షించి మృత్స్నాసుగం
ధాకీర్ణం బగు మోవి యాని మురదైత్యారాతి మోదించు న
మ్మాకందద్రుమపల్లవంబుఁ గడుఁ బ్రేమం జంచునం జేర్చి యు
ల్లోకానందముఁ బొందు కోకిలమువల్లుప్రక్రియం జూపుచున్. ౮౦

ఉ. ఐదుగ్రహంబు లుచ్చగములై విలసిల్లెడుపుణ్యవేళ శా
తోదరి గాంచెఁ బుత్రకు సముజ్జ్వలలక్షణలక్షితాంగు న
ప్పైదలి దీపయుక్తదశ భానుమదగ్రిమదిక్కు నిర్భరా
మోదవిశాలజాలకసముజ్జ్వలమంజరి యయ్యె నయ్యెడన్. ౮౧

సీ. ప్రతివేళినీసమర్పితతప్తతోయహారిద్రపంకకషాయముద్రితంబు
మహిషీవిషాణకోమలధూపమాలికాలింగితాఖిలకకుప్ప్రాంగణంబు
నవనవనింబపల్లవగుచ్ఛకవచితద్వారబంధోపరిదారుకంబు
మోహాంధహారిముహుర్ముహురంఘ్రిఘట్టితవిద్రుమదేహళీభద్రతరము
మంత్రవిత్పురంధ్రిమణిగుంభితంబునై, కమలవదనసూతికాగృహంబు
నలువఁగన్న నాఁటినలినాక్షుప్రాక్కిలి, వోలె నిత్యలక్ష్మిఁ జాలనెఱసె. ౮౨

ఉ. సూనుఁడుపుట్టినం బ్రమదశోభనచంద్రనవోదయంబున
న్మానసవార్ధి యుబ్బు మధుమర్దనుఁ డాగమతత్త్వదర్శన
జ్ఞానధురీణులైన ద్విజసత్తములం బిలిపించి యిచ్చె గో
దానసువర్ణదానమహి*దానముఖాఖిలపుణ్యదానముల్. ౮౩

గీ. జలద ముదయింప నాపోవఁ జాతకములు
తుములధారాముఖాంబుబిందువులుగ్రోలి

* భువిదాన- మూ.

యలరు క్రియఁ గృష్ణునకుఁ బుత్త్రుఁ డవతరింప
భూరిఁ దనిసిరి భువిఁ గల్గుభూమిసురులు. ౮౬

సీ. ఉష్ణాగమారంభయోగంబునఁ బోలె వినమండలము మెఱుఁగెక్కి యలరె
మహిచక్రమంతయు మలయాచలంబయ్యెఁ దనుపుగాడుపులు వాసనలు చల్ల
భసితనిఘృష్టదర్పణబింబముల కాంతి నాలింగనము చేసె నఖిలదిశలుఁ
గుడివంకసుడిపెంకెఁ గొడవమకీలలు పర్వ నాజ్యమానియుఁ బోలె నగ్నులడరెఁ
బట్టు లేదని గగనంబుఁ బాసి వచ్చు, చుక్కగమి యనఁ గ్రొవ్విరిసోన గురిసె
సర్వలక్షణపరిపూర్ణ చారుమూర్తిఁ, బట్టి జాంబవతికిని జూపట్టినపుడు. ౮౭

గీ. నలువ స్వజలసీనునాఁటిసందడి వోలె, ద్వారకాపురమున బోరుకలఁగె
సురలు సిద్ధమునులు ధరణీదేవతలును, బాలుఁ జూచువేడ్క నోలిఁ బాడువ.

— సాంబకుమారుని బాల్యము —

౧. పురుడు చన్న పిదపఁ బురుషోత్తముఁడు సాంబుఁ, డనెడు పేరొసంగె నాత్మజునకు
నిద్ధరత్నమునకు నిది యిట్టి దని జాతి, యేర్పరించు నేరు పెసక మెసఁగ. ౮౮

౨. చిలుకునూనియలఁ జిమ్మిలిముద్దయునుబోలె సతతతైలార్ద్రిమ స్నకము దనర
జిలుగు వెన్నెలఁ గ్రోలు తెలితొగవిరి వోలె నుగ్గానుముఖపద్మ ముజ్జ్వలముగఁ
గాంతిపూరము నిండు కమలారియునుబోలెఁ గాలుఁ గేలల్లార్చుగాత్ర మమర
మెట్ట తామరలఁ దుమ్మెద రెక్కలునుబోలెఁ గన్నులనంజనాంకనము లొదవఁ
గదియు శ్రుతి గూడ మెఱయు శంఖంబువోలెఁ, గంఠమూంకృతికలకలోద్గారి గాఁగ
శుక్తిలోనున్న నూతనమౌక్తికంబు, వోలెఁ బొత్తులఁ బవళించు బాలకుండు. ౮౯

• నవ్యరత్నతరత్నురాణ్ణాఖముఖమున, వెలయు తలిమతలంబున నలరుపట్టి
కౌస్తుభముతోడ వటపత్రకమున నిదుర, వోవు బాలముకుందుని పోలుపు దెలిపె.

౪. పాలప్రాంశువిశుద్ధనూతనసుధాసౌధాంతరాళంబునం
దాలోలాక్షులు కృష్ణనందను మనోజారాతిసంపూర్ణలీ
లాలంకారు విచిత్ర రత్నమయడోలారూఢునిం జేసి యు
య్యాలో లాలి యటంచుఁ బాడుదురు వీణారావహేలాగతిన్. ౯౦

• విందులు విందులంచు నరవిందదళాక్షులు హస్తపద్మముల్
గ్రందుగఁ జూప వాలుఁ దెలిగన్నులు చెన్నెసఁగంగఁ జక్రభృ
న్నందనుఁ డందియ ల్మ్రోయ నవ్యకటీతటహేమకింకిణీ
సందళితారవంబు చెలఁగ న్నడచుం దలిదండ్రు లుబ్బఁగన్. ౯౧

శా. గోవత్సంబుల వెల్వఁ బంప్లు దఱుయుం, గ్రోలుం బయోధారఁ జౌ
ర్యావేశంబునఁ గన్నుఁ బ్రామి, శరవిద్యల్పన్నుఁ, బీడింపఁగాఁ
బోవుం బాములపైని, జంచలత చూపుం జెట్లకుం జెట్లకున్
లావం దెక్కుడు సాంబుఁ డచ్యుతుని లీల న్నేర్చికోఁబోలునా. ౯౨

క. మీటించుఁ బర్వతంబులు, పోటనబాతులుగ వీరపురుషాగ్రణి యా
స్ఫోటించె బాలకేళీ, నాటక మొనరించునాఁడు నాఁటికి నెలమిన్. ౯౩

క. ఉపనయనగౌరవంబున, విపుల ప్రథనొందె వృష్ణివిభునందనుఁ డా
త్రిపురాంతకుండె తానఁట, యుపనయనము చేతఁ దేజ మొదవఁగవలదే.

గీ. దినదినమునకుఁ బాల్యంబుదిగిచిపోవ, యౌవనారంభ మొదవెఁ గృష్ణాత్మజునకు
శుక్లపక్షంబునందలిసోమునందు, బింబపరిపూర్తికళలతోఁ బెరిఁగినట్లు. ౯౫

గీ. నవనవపరాగమోహచూర్ణంబు చల్లి, యఘుఁడు సారససౌభాగ్యమాహరించి
చేసెఁగాఁబోలు సాంబునిచిన్ని మొగము, నిత్యలక్ష్మీనివాసమై నింపుఁగళలు.

శా. అంబూద్గారిపయోదమేచకకచుం డాజానుబాహాయుగుం
డుం బద్మచ్ఛదచారులోచనదళుండు న్బింబతామ్రాధరుం
డుం బక్షీంద్రసమానవేగుఁడు గుణాఢ్యుం డబ్ధినిమ్నాశయుం
డుం బుష్పాయుధమూర్తి సింహగమనుండు న్సాంబుఁ డొప్పెం గడున్. ౯౭

చ. అవనికి భావికాలమునయందు డిగంగలపారిజాత మా
త్మవిటపడింభకద్వయము ద్వారకకు న్మనుమున్న పన్ప న
న్నవకపుఁగొమ్మనోయి హరినందనుబాహులపేర నిల్చె వా
ని వెలయఁజేయు సాక్షులని నిద్గలహస్తసఖాంశుపుష్పముల్. ౯౮

క. హలకులిశంబుల నిజకర, తలమున వహియించె నతఁడు తనపెదతండ్రుల్
బలభద్రుఁ డద్రివైరియు, హలి కులిశియు నగుటఁ దానునటులయ్యెనొకో.

గీ. కోరివేఁడి వచ్చి శౌరికిఁబొడమిన, యష్టమూర్తి యగుట నతనినడుము
నందు వచ్చినిలిచె నంబరతత్త్వము, నిలకు నట్టితెఱఁగుఁ దెలుపుకరణి. ౧౦౦

గీ. కన్నుఁగలువలు రాగసాగరము హృదయ
చంద్రకాంతంబులును వికాసంబు నుబ్బుఁ
గరఁగి నీరౌటయును జూప ధరణిఁ గలుగు
చామ లలరిరి యదువంశచంద్రుఁ జూచి, ౧౦౧

సీ. తండ్రి బాహాచక్రధారావిదారితబాణాసురభుజాలిబలవిరోధి
తల్లి లోకముల నుద్భవ మొందఁగాఁ జేయువనజాతజాతునిమనుమరాలు
తోడఁబుట్టినయన్న దూసితశంబరద్యుమ్నుఁడై వెలయు ప్రద్యుమ్నమూర్తి
తనపుట్టినకులంబు ధనదేంద్రజలధీశతులితయాదవవీరవిలసితంబు
రూపమనపాయమాజ్వల్యరోహణాద్రి,శిఖరమపఘన మనఁగల్గుచిన్ని ప్రాయ
మలనలజయాంతనలకూబరాదులైన, నించుకంతయు సాంబుతో నెనయలేరు.
గీ. చంద్రశీతల మయ్యు నానకలలోక, నాథుతనయుని తను కాంతి నలినముఖుల
వెన్నవోలెను గరఁగించు విపులదోః ప్ర, తాపభానుమరీచిసోదర మగుటనొ.
మ. మహితాంగాభినయాభిరామముగ నామ్నాయావలుల్ నేర్చె నా
గ్రహగర్భంబునఁ గుస్తరించె నయలక్ష్మీసిద్ధి యాచారసం
గ్రహ మూహించె ధనుఃకళాగమపరీక్షాదీక్ష వర్తించె న
మ్మహిమాఢ్యుండు గురూపదేశమతిసామగ్రీస్పృహోదగ్రుఁడై. ౧౦౪
క. సాంబునిగుణములు నిఖిలజ,గంబులఁ గర్పూరఖండకాకృతి వాసిం
చెం బూర్వపక్షమయ్యెఁ గృతంబునఁ గలరాజసుతుల తాదృగ్గుణముల్.
సీ. తారుణ్యరసగృహద్వారదేశమునందు నిడుబోకుతలుపయ్యె వెడఁదయురము
మదమహాలోక్షమునందుఁ బొదలుమూఁపురమయ్యె బలితంపుమూఁపులబటువు బిగువు
నిబిడగాంభీర్యాంబునిధియందుఁ జంద్రోదయంబయ్యె శ్మశ్రులంబగు మొగంబు
గమనమదేభరాజమునందు దంతకుంతములయ్యె దృఢభుజాదండయుగళి
ధైర్యశౌర్యాఖ్యమల్లసత్త్వములు పెనఁగు
కంబములచేగ వరియించె ఘనతఁదొడలు
లలితకంఠీరవేంద్రావలగ్నుఁ డతని
నాలుగంచులనవయావనంబునందు. ౧౦౬
వ. వెండియు నప్పుండరీకాక్షనందనుం డమందానందసౌందర్యచంద్రాతపచు
ళుకితయువతిలజ్జాంధకారధారాప్రవాహుండై త్రిభువనమోహనుండై
తల్లిదండ్రులకు నుల్లసంబును గురువులకుం బరమశుశ్రూషణంబును బాంధ
వులకు భావబంధనంబును వంశంబునకు విభవమాంసలత్వంబును బొందిం
చుచు వితరణంబునకు మణిశిఖరియు విద్యలకు విబుధగురువును వివేకంబు
నకు విష్ణునాభీసముద్భవుండును విజయంబునకు విహరణగృహంబును నై
విలసిల్లె నంత. ౧౦౭

—౹ లక్షణాకన్యావర్ణనము ౹—

శా. ఆకాలంబున హాస్తినాపురమునం దవ్యాజసవ్యాజిత
శ్రీకాంతిం బ్రథమానరూపనిధి లక్ష్మీపక్ష్మలాక్షీసదృ
క్షాకారాక్షత లక్షణాఖ్య యగుకన్యావర్య దుర్యోధన
క్ష్మాకాంతాత్మజ యొప్పు దర్పకభుజాంచచ్చాప మానేపునన్. ౧౦౮

క. భానుమతీగర్భసుధా, భానువునం దనతరిలిన బాలిక సుధయో
నా నఖిలనేత్రపేయా, నూనద్యుతి నతనుసంపదునయ మొనర్చెన్. ౧౦౯

గీ. జవ్వనమువచ్చునకుఁబూర్వశైశవంబు, పోవుటకునింతి నెమ్మనభావభవుఁడు
పంచశరియనుపంచాంగఫణితిమెచ్చుఁ, గనియెనోకానిపొందికలగ్నమరయుఁ గాక.

క. స్ఫాయముగాఁ బయనమునగా, నాయెడబాల్యంబు జాఱ నాయితపడఁగాఁ
దోయజముఖి గాత్రము మన, స్థాయిగ నస్మన్మునకుఁ దానకమయ్యెన్.

ఉ. ఆమిహికాంశికారముక్రియం దను శైశవ మోసరిల్లఁగా
నామనివోలెఁ బ్రాయ మఖిలాంగవనావలి నావరింపఁగాఁ
గోమలలీల నీలకచగుచ్ఛమిషంబునఁ బర్వె షట్పదీ
స్తోమము మోవిడా లెసఁగెఁ దోరపుమోదుగుఁబువ్వ నల్వనన్. ౧౧౨

సీ. హృత్కన్దమున మొగ్గలెలసి మీఁదికినిక్కె ననఁ బూపచను మొల్లు లంకురించె
గూఁటిలోనయుండికొదమచకోరస్సులెగయుచందమునఁ గన్నుఁగవ బెళికె
నాభికూపంబులోన మునింగెనో యన నవలగ్నయష్టి తానవము నొందె
శైశవనది యింకి చన నొయ్యఁ గాన్పించుపులినావకాశమై పొసలెఁబిఱుఁదు
గమనవిషయమునఁబదపంకజములకును,సుశిక్షితాయంచ నెమ్మెనుసోఁగతీఁగ
తావిరాకకుఁజయ్యనఁ దలుపుదెఱచె, నంబుజాక్షికిఁదొలుజవ్వనంబునందు.

సీ. నీలంపు నెఱరంగు నిగిడించు కురులును నిగనిగ వెలయించు నిటలతటముఁ
జిఱునవ్వుమొలకలుచిగిరించుమోవియుఁ బొదు లేర్పడిమెఱుంగుబటువుఁజన్ను
లస్తివాదము మానునసను నెన్నడుమును గాంభీర్యమారయుఁ గడఁగునాభి
వార్థుల్యముదయించుచాటంపుఁబిఱుఁదును మాంద్యంబు నేర్చుగమనవిభూతి
సరసభావమునకుఁ బురపుర మనుచెయుఁ, లమృతగర్భమైనయలరుఁబల్కుఁ
గలిగి క్రొత్తప్రాయ మెలయుచో దీపించె, ధార్తరాష్ట్రతనయ ధన్యవినయ.

చ. కుదురులు నిండి వచ్చుకుచకోరకయుగ్మము ధాళధళ్యముల్
పొదవియు బిత్తరంపుఁ బొలుపు ల్పచరింపనిచూపుఁగోపులుం

జదురుఁదనంపు శేఁబదను సాగియు సాగని ముద్దుఁబల్కులు
న్నదవతియందు నొప్పఁ దనుమాలిక యౌవనగంధ మూనుటన్. ౧౧౪

సీ. నన లెత్తె నేత్రకోణములఁ బుష్పాస్త్రశస్త్ర ప్రఘూర్ణోన్నమచ్చక చకములు
తలచూపెఁ గటిసీమ దానాంధభద్రదంతావళము స్వకస్థాల్యలక్ష్మి
పాకంబునకు వచ్చెఁ బరువంపుఁ జాలింప్ల లలితతాళీఫలోల్లాసముగ్ర
ధ్వనిచూపె నిజసూక్తి వైదగ్ధి భారతీవీణాకలక్వాణలపనములు
వన్నియల మించె దేహసువర్ణలతిక, యతనుగతి చూపె రతికాంక్షలాక్షవీథిఁ
గురుధరాధీశతనయకు గొనబుఁగొదమ, కలికిజవ్వనమెలమిమైఁగౌఁగిలింప.

శా. లావణ్యౌఘపము ద వేల మదనాలంకారశాస్త్రంబు ద
ర్పావిర్భావనిధాన మన్మయవిలాసాచాపధూపాంకుర
శ్రీవీథీమ్ముతవర్తి సూక్తిసుమచూళ్యంగారసింహాసనం
బావామాక్షి నవోదయోద్ధతవయోహావానుభావంబుగన్. ౧౧౫

సీ. పాపటచెంద్రంబు పల్లవద్యుతి యయ్యె నలక లాకులకప్పు చెలువమయ్యె
మందహాసాంశుసామగ్రి, క్రొన్నన లయ్యెఁ జనుదోయిపుష్పగుచ్ఛంబులయ్యె
నంగరాగము పరాగాభిరమ్యంబయ్యెఁ దనుగంధములు పువ్వుఁగావు లయ్యె
జిగిమీఱు రోమరాజి మదాలికులమయ్యె నడపు లాశ్రితకేకి నటనలయ్యె
మదభరోష్ఠోద్భవంబు చెమటలతొంత, మధుకణాసారసారసామ్యమువహించె
నాసుయోధనుపుత్రికి యౌవనోప, వనము పాయంపుటామనివచ్చిపొదువ.

గీ. మగువచూపులందు మార్గణగణములు, దర్పకుండు తీఁడి దాఁపఁబోలు
యువమనంబు లెల్ల నుచ్చిపాఱఁ దోడంగె, ధైర్యకంచుకము విదారితముగ.

క. శ్రితకుంకుమధాతుప్ర లూ, జ్జితమకరీపత్రవల్లి రేఖావృతముల్
సతికుచము లచలములకుం, బ్రతి యయ్యెను నలరునుభయపక్షవశములై.

క. ఘన మేనో యేను ఘనమో, యని జఘనముఁగుచభరంబు లడిగిన నవ్వుఁగా
దన నేరక యవలగ్నము, చనియె నెటకో సూక్ష్మదర్శి సాక్షి నుడువునే.

సీ. సతికొప్పుసరిపూనఁ జమరవాలంబులు గోరె నేనియుఁ దోఁక గోయవలదె
ముకురాస్యసుస్వరంబులఁబోలఁ బికములు మొగిసె నేనియు నోరుమూయవలదె
దీపకాంతులు సుదతీలోచనముల ఘర్షించె నేనియు నివాళించవలదె
శశి వధూమణిమోముసవతుకుఁ గడఁగెనేఁ బాదివిముక్కున మసిపూయవలదె

యనననగణ్యైకలావణ్యయౌవనోద, యాభిరామ్యసమారూఢయగుచు గూఢ
పద్ధ్వజకుమారియొప్పునా భావభవుని, జీవయుటుఁ జేయఁగాఁగాయసిద్ధియనఁగ.

చ. కమలసహాసము ల్నయనకాంతి యొనర్పఁ గపోలబింబముల్
కుముదహితాయుతంబు నోడఁగూర్పఁ బెనంగు మృగాక్షిమోముతోఁ
గమలముఁ జంద్రుఁ బోల్చు కవిగాథలకెయ్యది మేర యుత్తమో
త్తము నధము న్సమానమనఁ దాఅదె బుద్ధి యవజ్ఞ చేరదే. ౧౨౩

చ. మరుకరవాలు మన్మథుని మంత్రరహస్యము కాముదీము శం
బరరిపుభాగధేయము రమాసుతునోముఫలం బనన్యజ
స్మరణవిధానుహార్తము మనోభవుదోర్బలవైభవంబు నాఁ
గురుధరణీతలాధిపతికూఁతురు బ్రాఁతి యొనర్చుఁ జూడ్కికిన్. ౧౨౪

సీ. కురులు చీఁకటు లేని విరియకుండుట యెట్లు ముఖచంద్రచంద్రికల్మించిపర్వ
నడుమాకసంబైనఁ బడకయుండుటయెట్లు కుదురులైచనుగుబ్బకొండదోయి
కటి సైకతంబైనఁ గరఁగకుండుట యెట్లు లావణ్యవర్షకోలాహలమునఁ
దొడలనంటులయేని దూలకుండుట యెట్లు గమనమత్తేభసంఘర్షణమునఁ
బదము లబ్జంబు లేనియు నుదితనఖర, చంద్రికలచేత విలసిల్లుచంద మెట్లు
మన్మథుఁడుపన్ని యాడించుమాయగాని, కాంతగాదిది యెందునీక్రమముగలదె.

వ. ఇట్లు సర్వలక్షణసంపూర్ణశరీర యగు లక్షణాకన్యావిలాసంబశేషభువనమో
హిని యై నిజహృదయవిగాహమానమనోజతేజోవిశేషయై సాంబునందుఁ
బ్రతిబింబితమనోరథయై యుండెఁ దత్సమయంబున. ౧౨౬

—॥ సాంబుఁడు లక్షణ సౌందర్యము విని విరాలిఁ బడుట ॥—

క. కర్ణాకర్ణిగ నావర, వర్ణనిగుణమణులు జాంబవతితనయునకుం
గర్ణాభరణము లయ్యెను, వర్ణస్ఫూర్తములు నభినవంబులు నగుచున్. ౧౨౭

క. హరియించెం బ్రద్యుమ్నుఁడు, హరినందను ధైర్యవిత్త మడరగుటయు న
య్యిరువురు సవతులకొడుకులఁ, బెరుఁగదె మాత్సర్యమాత్మభేద మొదవదే.

చ. ఉరవడిసేయు తెమ్మెరల కుప్పాను నూర్చుచుఁ జంద్రచంద్రికా
ఝురములు గప్పిన న్మొగముచక్కటి వెల్వెలనై చరించుచున్
విరు లసలార హృజ్జలజవృంతపరిచ్యుతి నొంది వాడుచు
న్మరుశర మింత తాఁకుటనె మాధవసూతి తపించు నిచ్చలున్ ౧౨౯

క. సాక్షాత్కారము లేదు ని,రీక్షింపఁడు చిత్రరూప మేనియు సంభో
జాక్షతనూజుఁడు సతి ప్ర,త్యక్షం బై యున్నయట్లు తమకమునొందున్..

సీ. అంబుజంబులనింతియడుగులనుపమింపఁదలఁచియందులనిశాంధతకునడుగు
సైకతంబులఁ జామజఘనంబుసరిపోల్పఁ గ్రమ్మియందులయస్థిరతకునుడుగుఁ
గొండల నెలనాఁగకుచముల నెనసేయ వెదకి యందులధాతువికృతికుడుగు
శశినింతివదనాంబుజముసాటిసేయంగఁబూనియందలియొచ్చెమునకునుడుగు
బేడిసఁ గొమ్మకన్నులతోడ నీడు, సేయ నూహించి వలవంత చిక్కు లరసి
యుడుగునీలాభ్రకచమూర్తియుల్లమునకు,నిత్యదీపప్రకారమైనిలువనతఁడు.

ఉ. కేకికలాపలక్ష్మిఁ గనుగీఁటుచు నీలశిలాకికానవాం
త్సేకము నాకళించుచుఁ గసీసపుఁబట్టులచుట్ట మూచు నె
ట్లాకటిభాగధైర్యమున కాస్పద మాసతివేణి నాకనుం
జీఁకటి సేయు వక్రిమవశీకృతు లాంచరితాన్యనిగ్రహుల్. ౧౩౨

క. శుకవాణివదనశశి మా,మకలోచనపద్మములఁ దమము గొల్పెడుఁ జం
ద్రకమృగమదలాంఛనమున, సకలంకుల కేల గల్గు సౌజన్యంబుల్. ౧౩౩

క. శైలస్థూలతరం బీ, కాలాగురుగంధకుచయుగం బణుపరిమా
ణాలంకృత మగు నామన,మేలాగునఁ దూఱి యున్న దిది వింత యగున్.

క. కోమలతాగాహువు వద, నామృతకరుఁ బొదువ నొడియు నని మేరలుగాఁ
గామాహితుండికుం డిడు, నామర్యాదలు మృగాయతాక్షివళు లగున్.

ఉ. సారము లేని రంభల ప్రచారము లేదని చర్మకర్కశం
బై రుచిఁ గప్పు సామజకరాభినయంబు హసించియుం దదా
కారమె చూపుయాదవశిఖామణియూరుల నామనంబు సం
చారము చేయుచున్నది వశాగతి దీని మరల్ప నేర్తునే. ౧౩౬

క. చనుపకపువిరులసర మగు, వనజాయతనయనతనువు వారక మల్లో
చనమధుకరంబులకు మో, హనిరూపణమై సుగంధ మలరుచు నునికిన్.

వ. అనిమనోభవశరగరుత్సమీరణవిశీర్ణహృదయుం డై యమ్మదనజనకతనయుం
డు నెళవుననె యుండి యేకాంతంబున నిజస్వాంతంబున వితర్కించు.

ఉ. బాలికగావునం గదిసి పైఁబడ నోడినక న్నెఱింగి కెం
గేలఁ గుచాంబరాంచలముఁ గీల్కొన మ్రొలికిఁ దివ్వ వెన్కకున్
వ్రాలి మదీయధైర్యమను వాలుగుఁబట్టఁ గడంగుకాముచే
గాలపుఁజిప్పఁ బోలుసతిగాత్రము గాత్రము చేర్పఁగల్గునే. ౧౩౮

ఉ. చేరువ మోముమోముఁ దగఁ జేరిచి వాసన గ్రోలిక్రోలి దు
ర్వారమదాతిరేకమున వాతెఱ (యించుక) పంటనంటినం
గ్రూరకటాక్షవీక్షణశిఖు ల్గలిగించుచు నాజ్యకుంభముం
గా రహి నామదిం గరఁచుకామినిఁ గూడెడుజాడ యెట్టిదో. ౧౮౦

చ. కినియుడు నేను మ్రొక్కిన నొకించుకరోషము నోసరించి పా
దనలినపత్రతాడనవిధం జరితార్థునిఁ జేయుచున్నయ
వ్వనితచెమర్చుమో మమృతవర్షి సుధాకరబింబ మంచు నె
మ్మనమున సంస్మరించి బహుమానము సేయుట గల్గు టెన్నఁడో. ౧౮౧

చ. మును రతి పుష్పబంతులకు మోదుగుమొగ్గలు చేర్చిన ట్లురు
స్తనముల నే నఖాంకములు దార్చిన నోర్చి పునారతిక్రియా
జనకము లైనచేష్టలఁ బిసాళము చూపు మసారసారలో
చన మది మెచ్చఁగాఁ బెనఁగుచందము లెన్నఁడు నాకుఁ గల్గునో. ౧౮౨

వ. అని యథోక్తజపట్టి లక్షణపయింబుట్టినవలవంత బలవంతంబగుటయు. ౧౮౩

సీ. స్రుక్కు మేనున జాఱుసొమ్ములు గీలూడె నని కళాదునిమీఁద నాగ్రహించుఁ
బొరలంగఁ బాన్పుగప్పుడుచేల నులివడ్డ నుడిగంపుఁబూఁబోండ్ల నురకకినియు
వలపు చాల దటంచు నలుగు సైరంధ్రి పై యక్షకర్దమచర్చ యరుచి యైన
నమృతోపమానంబు లగుభోజ్యములు చప్పనైన మహానసాధ్యక్షుఁ దఱుము
రానినిదురలు వోవు వారణరథాశ్వపంక్తి నెక్కనకాని వే పఱపనోపఁ
డచ్యుతునివట్టిసాంబుఁడాహరిణనయన, మీఁదఁగలుగువిరాళి చేవేఁదుఁబొదవి.

క. ఇతఁ డిచట మదనశరమున్, ర్ధితధైర్యం డగుచు వగలఁ దెరలఁగఁ గురుభూ
పతిపురమునందు విష్ణు, ప్రతిమోత్సవ మాగమోక్తపద్ధతి నడచెన్. ౧౮౫

—। సిద్ధాంతదర్పణగురుప్రస్తావన ।—

ఉ. ఆతిరునాళ్ల కేగి రఖిలాగమవేదులు వీతఖేదు లు
ద్యోతితభక్తివాదులు విధూతమతాంతరవేదు లుగ్రదో
షాతపచంద్రపాదులు నిరస్తసమస్తవికారశాదు ల
ర్చాతనుపూజనాహతవిషాదులు సాదులు నైనవైష్ణవుల్. ౧౮౬

సీ. దోషాంధకారంబు దొలఁగించు చండదీప్తులు వోనిద్వాదశపుండ్రకములుఁ
దస్తధ్యగతములై ధవళాంబుజపరాగశుభ మామతించు శ్రీచూర్ణరేఖ

లపవర్గరమఁ దామె హత్తించు వరణదామములఁ బోలినతిరుమణివడములు విష్ణుగర్భత్వసంవృతి దేవకీగర్భములు వోని తిరుకగూడలబెడంగుఁ జెర్వములఁ జెంబులాదియగుచిహ్నములును, గలుగు శ్రీవైష్ణవశ్రేష్ఠులలమి కొలువ ద్వారవతినుండి చని యెనాదంతిపురికి, నపుడు సిద్ధాంతదర్పణుండను గురుండు.

శా. ఆచార్యోత్తము హేమపల్లకియు హేమాంభోజరాగప్రభా
వీచీరమ్యము శైబికాంసపదవీవిన్యస్తదండాగ్రమై
తోఁచె న్విష్ణునివాసమై యరుణదీప్తుల్పర్వఁ గాలంబుపైఁ
బ్రాచీదిక్తటనుండి వచ్చు రవిబింబంబో యనం దోఁచుచున్. ౧౫౮

వ. అట్లు చని యయ్యాచార్యవర్యుం డార్యధుర్యుం బగు వాసిపురంబున కరిగి తృణీకృతహరిహయనగర సౌభాగ్యధట్టం బగునప్పట్టణంబునందు సిద్ధాపూర్వకంబుగా విరచితానుష్ఠానుండై మహోత్సవసమృద్ధంబును సమిద్ధగరుడధ్వజశిఖరవిలిఖిత గగనతలంబును దివ్యపబంధానుసంధానబంధుర భాగవతవదనధ్వని ముఖరితగవాక్షరంధ్రంబును వైనతేయాదివాహనవ్యూహామహితంబును మిహిరమండలసువర్ణకలశదళశతాలంకృతంబును దూర్వాదళశ్యామలకోమల హిమసూమధోరణీధూసరితదశదిశంబును నమరమిథునసమాననారీనరాకీర్ణంబును నైన యాయర్ణవశాయికోయిలఁ బ్రవేశించి జనార్దనమూర్తి యగు నద్దేవతాచక్రవరిని సేవించి యుచితకృత్యంబులఁ బ్రవర్తించె నంత. ౧౫౯

క. సిద్ధిప్రదు శేషోపము, బుద్ధిన్ బుధపూజితాంఘ్రిఁ బూతచరిత్రున్
సిద్ధాంతదర్పణుం గురు,వృద్ధులు సేవించి రమరవిభులు వారిబలెన్. ౧౬౦

క. ఆయయ్యాచేతి నఖిల, శ్రేయస్సంప్రాపణైకచింతామణిచేఁ
గాయజగురుతత్త్వము ని,శ్శ్రేయసకారణము కురువరేణ్యుల కొదవెన్.

వ. వెండియు నమ్మహానుభావుం డాస్తిక్యబుద్ధి ప్రశస్తులును విద్వత్కౌస్తుభంబులు నగుభీష్మద్రోణవిదురాదులకు దనుజగిరిభిదురాకారం బగు మురారిపరమతత్త్వంబుఁ దెలిపి పంచసంస్కారసంస్కృతులం గావించి యభిగమనోపాదానవిద్యాస్వాధ్యాయభక్తి ప్రకారంబులు సుధాకరకరపోషకభాగ్యస్వరూపంబులును స్వజ్ఞానప్రాపకప్రాప్యజ్ఞానంబును నానుకూల్యసంకల్పప్రాతికూల్యవివర్జనభావిరక్షణవిశ్వాసగోప్తృత్వవరణాత్మనిక్షేపణకార్పణ్యంబులును శరణాగతధర్మంబుల మర్మంబులు ను భాగవతవాత్సల్యంబు ను బరమపూరు

మఫ్రూజానుమోవనంబును దానర్పించుటయు నఖిలేశ్వరునియందు మాయ సేయకుండుటయు హరికథాశ్రవణంబును నిస్తుతి కసమయంబున స్వకనే త్రాగవికారం బగుటయు మునుముదంబు దండంబు వొందించుటయు నత నిం జొచ్చి బ్రదుకుట యు ననుభేదంబులం గల యష్టవిధభక్తి ప్రకారంబును శ్రీ భాగవతహరిభక్తిసుధోదయంబుల యందుఁ బ్రకటించిన సకలాధిపతిం ద లంచు నవవిధభక్తియుక్తులు ను శ్రావృతపంచసంస్కారపరిత్యాగంబును మంత్రాసన స్నానాసవాలంకారాసనశయ్యాసనంబు లనునవయవంబులం గలుగు తిరు వారాధనాచర్యాదలు నాకుఁగాఁగలపరమవైష్ణవసిద్ధాంతంబు బుద్ధిగోచరం బుగఁ జేయుచుండె నంత నొక్కనాఁడు. ౧౬౭

—। లక్షణాకన్య సిద్ధాంతదర్పణువర్ణనము చేయుట ।—

౧. సద్గుణోజ్జ్వలము లై సాధుకరిత్రంబు ననుసరించు మనోహరాంబరములు వన్నియలఁ దనర్చి వారాంగనాజనంబులఁ బోలు నుజ్జ్వలభూషణములఁ గేసరోద్భేదంబు భాసింపహరికిశోరంబుల నవరించు ప్రసవములును గంధవహాశ్వంబు సంధించు తెక్కెరపరువంబుఁ బాలించు పరిమళములు నలుపయుమనూశికపువెంగులుధరించి, రాఁగనందలమెక్కి రారాజుపుత్రి గురుజనానుజ్ఞ నాచార్యవరునిఁ గొల్వ, వచ్చెనలుగడ బద్దలవారుమ్రోయ.

ఉ. వచ్చి జనార్దనాలయము వాకిట యానము డిగ్గి ముక్తి య న్లచ్చి ధరించుపంకజములాగున నొప్పు విమానముం డగం జొచ్చి ముకుందుఁ గొల్చి గుడిపూరెల హేమగృహంబులోనఁ గొ ల్విచ్చిన దేశికేంద్రుఁ గనియె నృపకన్య యనన్యచిత్త యై. ౧౬౮

క. కని కుచభారానత మగు, తనులత గంపింపఁ దత్పదములకు మ్రొక్కెన్ వనలత నిజగుచ్ఛభరం, బునఁదూలుచుఁదరువుమూలమునవ్రాలు కియన్.

గీ. మ్రొక్కుటయు నమ్మ లె మ్మప మోముచిచ్చి, నీమనసులోననుండిననిత్యపుణ్య సిద్ధిపొందెడ మనుచు నాశీర్వదించె, దర్పదూరుండు సిద్ధాంతదర్పణుండు.

వ. ఆశీర్వదించిన నాచంద్రముఖి నిజసఖీముఖంబునం దనచిత్తంబు సాంబాయ త్తంబగుట యెఱింగించుటయు నప్పంచసంస్కారచతురుండయ్యువతికిట్లనియె.

శా. ఓకళ్యాణి భవన్మనోరథము నాయుల్లంబునం దోఁచి కా దే కాంతాపృతుఁ డైనభర్త గలుగన్ దీవించితి న్నమ్ము ని న్నాకృష్ణ పభవుండు పెండ్లియగు నీ వామోహనాకారు నా లోకింప న్వలతేని చూడు మని యాలోకజ్ఞతాశాలియున్. ౧౬౯

వ. శాంతస్వాంతు లగు కతిపయాంతర్వాణులుం దాను నేకాంతంబునకుం క్రి యవయస్యాసహితంబుగ నమ్మహిళాలలామం బిలిపించి పింఛలాంఛనచరణా రవిందతీర్థంబున నయ్యిందువదనవదనారవిందసమ్మార్జనం బాచరించి యచ్చ టికి నొక నిద్దం బగునద్దంబుఁ దెప్పించి నిరీక్షించు మనుటయు. ౧౫౯

క. పక్షిరథచరణజలజ, ప్రక్షాళనవారిధార భామకు ముకురీ
కుక్షిం ద్రిజగము లొక్కట, వీక్షింపఁగ దివ్యదృష్టి వెస నొసఁగుటయున్.

క. త్రిజగద్దర్శనభయమున, గజగజ మై వడఁక రాజకన్యకపై నం
బుజనాథపాదతీర్థము, బుజుగతిఁ జిలికింప సుదతి యెద వెలి పుడిగెన్.

వ. ఇట్లు ధీరస్వాంతనుజేసి యయ్యింతికి సిద్ధాంతదర్పణుం డి ట్లనియె. ౧౬౨

గీ. సుదతి పాతాళలోకముఁ జూడు మిందు, నలరుచున్నారు కర్కోటకాదినాగ
వర్యు లీ లోకమున నున్నవాఁడు సువ్వె, బలిమహారాజువితరణప్రసవభూమి.

క. అటు చూడు మమరలోకము, కుటిలాలక వార లెల్లఁ గులిశాంకునకున్
భటు లైనవిబుధవర్యులు, చటులపరాక్రములు రూపసంపన్నహిముల్.

క. బలిరిపుబలిసదనంబులఁ, దల మొలను ధరించె ననఁగఁ దా నున్నది భూ
తల మేతన్మహిమములం, దెలిపెద విను సాధుమతి విధేయచరిత్రా. ౧౬౫

చ. జలనిధు లేడు నేడుకులశైలములు న్నవఖండమండలం
బెలయుటఁ బెన్నిధానములు నేఁబదియా అగుదేశవిశ్రుతు
ల్గల మహిమండలిం గరముఁ గన్నియ యల్లదె కంటివే నవో
త్పలదళవర్ణుఁ డైనహరితాళనిభాంబరువీడు ద్వారకన్. ౧౬౬

గీ. యాదవులువృష్ణులునుభోజులంధకులునువా రెయిచ్చోటఁదోఁచుచున్నారుతల్లి
వీరిబలపౌరుషాటోపవిజయభోగ, భాగ్యసౌభాగ్యముల నెన్న బ్రహ్మతరమె.

మ. కనుదోయి న్నిగిడించి చూడు మిట నోకళ్యాణి శ్రీద్వారకా
వనజాతాకరహంస మయ్యె నిదె దివ్యస్నవ్యసౌధంబు కృ
ష్ణనివాసం బిది విశ్వకర్మ నిజకౌశల్యైకమూ(లంబు)గా
నొనరించె న్బహురత్నసూత్నకళికాయుక్తంబు నుత్కంఠమై. ౧౬౮

సీ. కల్పవృక్షారామకటకభాగంబుల నప్సరఃస్త్రీలు లాస్యములు నెఱపఁ
గుముదకహ్లారసంకులసరోవరములఁ గిన్నరాంగనలు సంక్రీడ సలుప
వితతరత్నస్యూతకృతకాద్రికందరభూములం జారణభామ లలర
నభ్రంలిహాదభ్రశుభ్రగోపురముల గంధర్వకన్యలగాన మడరఁ

బృథులజవన త్త్వహస్త్యశ్వరథపదాతు, లక్షపనిధిసేవ్యాభినవార్థములును
గలిగి యున్నది చూచితె యలఘుచరిత, మాదరాచలధారి శ్రీమందిరంబు.
గీ. మగువయీమేడకునుబశ్చిమమునఁదూర్పు, నందుఁజూపట్టుకాంచనహర్మ్యరేఖ
వలహలాయుధునిల్లు సాత్యకిగృహంబు, నేతవాధిక్యమెన్నంగ నెవ్వఁడోపు.
ఉ. చూచితె యల్లవాఁడు మధుసూదనుఁ డాయువతీమతల్లి గా
దా చపలాక్షి భల్లుకవరాత్మజ జాంబవతీసమాఖ్య త
ల్లోచనచంద్రబింబము విలోచనుతెడవప్పు వాగరే
ఖాచలితాంగజుండు వినుమాతఁడె సాంబుఁడుగా నెఱుఁగుమీ. ౧౭౧
క. నలుఁ డన జయుంతుఁ డనఁగా, నలకూబరుఁడనఁగ శాంభవాయకుఁ డనఁగాఁ
గలరూపధన్యు లితనిం, గలియుఁ గారాకుఁ జిగురుఁగా మదిఁ గనుమీ.
క. అని పలుకు నతనిపలుకులు, తనచెవి సోఁకకయమున్న తగవీక్షణ నె
మ్మనమును జూపును యమునం, దననందనునందు నిలిపెఁ దాదృగవస్థన్.
గీ. నిట్టలపుఁగాఁక వఱువల్లి వ్రీనచ్చి, యాంబుజాక్షికటాక్షంబు సాంబువదన
చంద్రబింబసుధాబునిమ్మంద మాని, సారిగెనో సేకమొరగొనిచూడ్కి నాక్ష్మా.
క. ఆమూలాగ్రము కౌరవ, భూమీశ్వరతనయచూపు పొదివె హరిసుత
గామణిదేహమున రతి, స్వామిధనువునందు నిగుడు జ్యాలతవోలెన్. ౧౭౫
గీ. అద్దమునసాంబుఁజూపుసిద్ధాంతదర్ప, ణునిప్రభావంబుఘనమొనాథునికిఁగూర్చు
రమణికిలికించితప్రకారంబుఘనమొ, తెలియఁగాఁబోలదవి రెండు దేవుఁడెఱుఁగు.
క. జనపరివాదభయంబున, మనుజాధిపకన్య హరికుమారకు మీఁదం
జొనిపినచూపొక్కవిధంబున మదకరిఁ ద్రిప్పుపాదిపోలికఁ ద్రిప్పెన్.
గీ. కదలకున్నయుఁజెయ్యులు పిదులుతెఱఁగు, వెంఁబాటునిరంతరస్వేదజడిమ
యునువహించెనిశాలనయనని జేసు, మీఁదిమమతనొగురుభక్తిమీఁదితవిధ నో.
వ. ఇట్లార్యస్తోత్రతాపాత్రచర్య యగు దుర్యోధనతనయ ధైర్యంబు చిక్కంబ
ట్టి సిద్ధాంతదర్పణాచార్యులం గులదైవతంబులుం బోలెఁ దనతెచ్చిన వస్తు
విస్తారంబున నారాధించె నప్పు డబ్బోధశాలి వధూరత్నంబున కి ట్లనియె.
సీ. నీరజదళనేత్ర నీవు సాంబుండు నన్యోన్యంబు (గల)యుట యది ధ్రువంబ
యతఁడు నీకునుఁ దగు నతనికి నీవయ తగుదువు నీయాన తలిరుఁబోఁడి
యే ద్వారకకు నేగి యేవిధంబున నైన నిటకు సాంబుని బంతు నిందువదన
చపలంబు లజ్జలోచనలచిత్తంబు లోయింతిమీఁదటిమాటయీవయెఱుఁగు

దాఁ గలితధైర్యవై కేల వరపి కూర్మి, వెల్లివిరిసేయకుము రమావల్లభుండు
భక్తిమజ్జనజంగమపారిజాత, మున్నవాఁడు గదా నీకు నుత్పలాక్షి. ౧౮౦

గీ. శౌరి మామ గాఁగ జాంబవదాత్మజ, యత్త గాఁగ సాంబుఁ డఖిలలోక
వనితకీర్తి నీకు భర్తగాఁ గలిగిన, విభవ మేమ చూతు బింబోష్ఠి. ౧౮౧

వ. అని సబహుమానంబుగా నహిధ్వజతనయ ననిచి యనుచితోదారచర్యుం
డగు సిద్ధాంతదర్పణాచార్యుండు శ్రీవత్సధరునుత్సవానంతరంబున నపవర్గ
లక్ష్మీనయనతారక యగు ద్వారకకుం జనియె నంత నక్కడ. ౧౮౨

చ. ముకురములోనఁ గన్ యదుముఖ్యుని రూపవిలాససంపద
ల్లికుచకుచాననాంబుజమిళిందము లౌటనొ తక్కఁగాఢ్యవై
ప్రకటత చూపె నూపురులు భావము మోహతమోవికారవై
ల్యకలితమయ్యెఁ జేమనుము తామట గ్రి భ్రమించెఁ జేష్టలు౯. ౧౮౩

సీ. కరనఖరుచిపుష్పకళికాకలాపంబు తోరంపుఁగొప్పునఁ దాలుముఁగోరు
నిజముఖజ్యోత్స్నావినిర్గలచ్ఛాయచే వదనేందు నలరించి పొమ్మఁ దలఁచుఁ
గఠినపవము లను కంచుగుబ్బలు భుజాంతరకవాటంబునఁ దాగ్పఁ దివురుఁ
గటిచక్రవిక్రమగతి మనోరథకుంభముల వాని యందంద నిలుపఁ దివురుఁ
గల్పవృక్షంబు సాంబుఁ డీకల్పలతిక, నుతను వటంచు హాత్రించుచు నుతనించు
లక్షణాకన్య స్సవశగత్సుర, తీవ ముఖదారితాంగినై ధృతిఁ దొలంగి.

గీ. కన్నుఁగలువలు వదనపంకజము నొకటఁ
దెలివి వహియింప నవ్వవెన్నెలలుఁ నధర
తరుణతరణిప భయముఁ గ్రుంగ హారికుమారు
వదన మస్ఫుతకరమంచు ముదిత వొగడు. ౧౮౪

చ. కనదతనుప్రతాపశిఖఁ గాఁకలు దేఱిన సాంబుదేహమున్
గనకము నొక్కరూప యని కామిని, యెనఁ బయోధరద్వయం
బనునొరగంటిపై నొఱసి యాదులవన్నియ తేర్పరింపఁగాఁ
దనమదిఁ గోరఁజొచ్చె సురతక్రమదీక్షకు బచ్చు గావున౯. ౧౮౫

మ. పొలయల్కం దనపాదపద్మముల కంభోజాక్షపుత్రుండు ప
ల్మలచేఁ దీర్పఁగరాక మ్రొక్కటయుఁ దాఁ గోపంబు లేకుండి చే
తులకుం జుల్లనగాఁ బెనంగ వెనఁ దద్దోరంతరక్షోణికి౯
బలులెప్పంబులు సేయుట ల్పతి సదా భావించు భావంబున౯. ౧౮౬

సీ. హరినందనుఁడు మ్రోల నడ గిడినట్లైన నగవుఁజూపులఁడాలుచిగురుకొల్పు
యదునాథసుతుఁడు పయ్యెద వట్టినట్లైన నించుకతడవు చేయూఁక పెనఁగు
హలధరానుజసూతి పిలిచినయట్లైన నల్లన చెవివాల్చి యాలకించు
శ్రీవిభుప్రభవుండు చేరినయట్లైన గృహదీపములు మలిగింపఁ గడఁగు
ధరణిధరుపట్టి వేఱొక్క తరుణిపేరు
నాడివినట్లైనఁ గనుదోయికడ చెఱఁగుల
బాష్పములునించి ధరవ్రాయుఁ బదనఖమున
నింతి మోహాంధమానసస్వాంత యగుచు. ౧౮౮

చ. పలికియుఁబ్రల్ల (దాభరణ)పంక్తియుఁ దాల్చియుఁ దాల్ప దంబుజో
త్పలకుముదాంచితాంబురుహధామము నాడియు నాడ దెంచునె
చ్చెలులను జూచి చూడ దలచిల్కకుఁ బద్యము చెప్పి చెప్ప ద
న్నెలఁతుక సాంబుపై నిగుడు నెయ్యము తియ్యముఁ జేయురాయిడిన్.

సీ. జలజాక్షి డెందంబు చిలుకపల్కుల సరంధ్రత దాల్చె బిసకాండలతికఁ బోలె
విరహపాండిమముచే వెలఁది దేహము పాదరసము సోఁకినకమ్మపసిఁడిఁబోలె
నిట్టూర్పువడ దాఁకి నెలఁతుక కెమ్మోవి పరువమందినదొండపండుఁ బోలెఁ
జింతాజ్వరంబుచేఁ జెలువపాలిండ్లు చీఁకటికి లోనైనజక్కవలఁ బోలె
దినముయుగమయ్యెఁబక్షంబువనజగర్భ,కల్పనిభమయ్యెనెలయునుగల్పకోటి
యయ్యెఁదరియింపరానిపియయ్యెమోహ,సాగరతరంగఘటలురాజన్యసుతకు.

ఉ. మారుఁడు క్రూరబాణముల మర్మము లేయఁగ నైనవేదనా
భారముచేత నంబుదుహపత్త్రదళాక్షికి నొప్పదయ్యెఁ గా
శ్మీరము నీరము న్మృదుసమీరము వాసితవారిపూరముం
హారము హీరము న్వనవిహారముఁ గీరము గంధసారమున్. ౧౯౧

గీ. ఈతెఱంగున లక్షణ యిక్షుధన్వు,బారి కగపడి శిఖిశిఖాప్రాంతలతిక
వోలెవసివాడుటకునాత్మఁజాలనడలి,పాటలయుమాల్యవతియునాఁబరఁగుసఖులు

వ. ము న్నానిష్ఠాంతదర్పణుండు దర్పణోదరంబున నాదర్పసారసౌరభకుని నిరీ
క్షణాతిథిఁ జేయ సాంబు నాయాయి తెఱంగులు తా రెఱింగినవారు గావున
వారిజానన కి ట్లనిరి. ౧౯౩

చ. గురుకృప గల్గుదానవు చకోరవిలోచన నీతలంపు వే
గిరము ఫలించె నేమిటికి ఖేదము నొందెదు నీవు వెంచి ము

న్నతయుచకోరపోతకము లాఁకలిగొన్నవి మందహాసపుం
బరువపువెన్నెలల్ చిలుకుమా కమనీయకపోలరేఖలన్. ౧౯౪

చ. స్మరసమితేక్షుచాపలత చయ్యన వ్రయ్యలు వార నందులన్
జొరజొరఁగాఱు తేనియలచొప్పులఁ దప్పుల నోర్చు పల్కులం
దరలతరాయతాక్షి వడ దాఁకిననీగరువంపుఁజిల్కకుం
బొరలినడప్పి మాన్పు మెగుబోదయ కావున వాఁడె నెంతయున్. ౧౯౫

క, గమనాధ్యయనము మఱచెం, గమలేక్షణ నీవు దిద్దు కలహంసంబుల్
మము నొల్ల వేమిసేయుదు, మమృతరసము గొన్ననోరి కామ్రము చవియే.

శా. పూవుంగొమ్మకు వచ్చియున్నయపి యంభోజాక్షి నీవెంచు లేఁ
దీవ ల్రవ్వత్తర హేమకుంభజల మర్థిం గోరెడి న్నీవురా
గా వెన్నానియు కాని పోఁదగదు మా కగ్రంబునన్ బాలవ
ల్యావాలంబున నీరునింపు పతిభృత్యన్యాయసంపన్నతన్. ౧౯౭

చ. వెలఁదుక పల్లకున్నయది వీణియ మూసినము త్తైమై భవ
ల్లలితకరాంగుళీనఖరలాలన లేకయొ త్వత్కుచోపరి
స్థలిఁ దగ విశ్రమింపమినొ తావకకంఠవిముక్తగానల
క్ష్ములు దను పోఁకకుండుటనొ మోహవశం డగుసాంబుఁ బోలుచున్.

క. ధవళలోచన సిద్ధాంతదర్పణుండు, నాకు నెఱిఁగించె నాజగన్నాథసూతి
భవదసాధారణోదారవివిధసుగుణ, నాటకమునకు మోహించినాఁడటంచు.

వ. వెఱవకుము నీతలంపు శుభోదర్కం బయ్యెడు నని యాశర్కరాధర లాకర్ణ
శస్తని నూరార్చి. ౨౦౦

గీ. అలరుఁబన్నీరుచే నక్కు నక్షియుగము, దడిపి తనకంకణంబులు బడిసిపోవ
వైచుటయునింతవడదేఱివాలుఁగంటి, పలికెఁ జెలికత్తియలఁగొ ర్కి బయలుపడఁగ.

చ. తొలుతటివుట్టువం దఖలదుర్లభ ఘోరతపంబుచేయు పు
ణ్యులకయకాక కల్గునె మనోరథసిద్ధి ముకుందసూతినిం
గలుచుట కెంతనోఁచితినొ కాక తదంగకసంగలాభముం
గలిగెడునంతనోము లవి కానఁ గదా గతజన్మవృత్తముల్. ౨౦౨

గీ. మీరు నున్నారె కాదెయపారమహిమఁ, బరఁగుసిద్ధాంతదర్పణగురువరుండు
దర్పణంబున జాంబవత్తనయపట్టి, మించురూపంబు నను గనిపించెఁ గాదె.

క. ఏ మున్ను విన్నరూపము, నామకురములోనఁ దోఁచునారూపు సమం
బై మెఱచె మెఱచె నేనియు, నేమి గలదు స్వప్నదృష్ట మిది నిజ మగునే.

సీ. సొబగుని తెలిమోము చూచితినయ కాని యానఁగల్గెనె మధురాధరంబు
కాంతునినిడుఁ గేలు గనుఁగొంటినయ కాని దొరకెనే పరిరంభపరమసుఖము
విభునివక్షఃపీఠి వీక్షించితినె కాని వ్రాలుట యొదవెనే రతుల నరసి
ధవునిపాదంబులు దర్శించితినె కాని యొత్తుట గల్గెనే మెత్తఁ గేల
నెండమావుల నీరనుచుండియాసఁ, బఱచుహరిణంబ నైతి నో భామలార
వైష్ణవాచార్యదర్శిత విష్ణుతనయ, మూర్తిదర్శనచాపలంబునఁ జలించి.

ఉ. పాండవపక్షపాతి యని పంకజనాభుని నీసడించు ను
ద్దండభుజావిజృంభణవిదారితవైరి సుయోధనుండు క్రూ
రుం డతఁ డేల యిచ్చు నను రూపకళావితతప్రసూనకో
దండునకు న్సురాంతకసుతప్రవరేణ్యునకుం బ్రియంబునన్. ౨౦౬

క. ఏనేమి బ్రాఁతి జాంబవతీనాథతనూజునకును దీవ్రతరవియో
గానలశిఖ కాహుతిగా, మే నిచ్చెద సకియలార మీరలు మెచ్చన్. ౨౦౭

సీ. మత్తరావర్తిత మణికుంభజల మాను బాలరసాల మేపాటు వడునొ
మత్పుచంబులమీఁదమలయుకిన్నెర(కాయ)యిటునటువైవంగ నేమియగునొ
మద్భూషణంబుల మరఁగిన నుడ్డిల్ల యొంటిమె (నేయెడ) నుండఁగలదొ
మన్ముఖప్రీతి కామనిసేయు నద్దంబు పాటింపకునికి నేపగిది యగునొ
మలయువలమానపవమానములకు నెదిరి,నిండుగుండియయుండు నేనిలిచినప్పు
డమలార నాకూర్చినకొమ్మలార, యే మరునిగెల్తు మీ రుండుఁ డెలమికలిమి.

మ. అని డగ్గుత్తికతోడ మూర్ఛిలుసుమధ్య న్సాంద్రచంద్రాంబుసే
చనసంక్షిప్తి నఖేదఁ జేయుచు వయస్యల్ శైశికాంతారఖే
లనదంభంబునఁ దాప మార్పఁ జని రమ్లానాంగరేఖాలతా
జనితామోదము దిక్కులన్బరఁగుల న్సంపూర్తి నొందింపఁగన్. ౨౦౯

—॥ వనితలవనవిహారవర్ణనము ॥—

సీ. బటువుఁగొప్పులు చూచి బర్హిబర్హములంచు వింట*బర్హిణములు వెన్నడింప
నుదుటుఁ(గన్ను)లు చూచిమదచకోరములంచు వెన్నెలపుల్గులువన్నెడాయఁ
గుచభరంబులు చూచి కొదమజక్కవలంచుఁ జక్రవాకంబులు సందడింపఁ
నలసయానము చూచి హంసడింభములంచునంటిమరాళములెవ్వెంటరాఁగఁ

* విన్నబర్హిణములు-మూ.

బలుకుకులుకుల నమృతంబుగులుకరింపఁ,దనుతటిత్కాంతిధళధళధళయనంగ
శంబరారాతిమోహనాస్త్రములరీతి, వనిత లేగిరి యుద్యానవనమునకును.

క. పొదిఁ జొచ్చు మదనచండ,ప్రదరంబులకరణిఁ జకితబాలమృగాక్షుల్
త్రిదివోపవననిభంబై, యొదవిననిష్కుటముఁజొచ్చి రుల్లము లలరన్. ౨౧౧

చ. తనురుచిఁ దీవపిండు, హసితంబులఁ బువ్వులుఁ, గేలుడాలుసాం
పునఁ జిగురాకు, మైవలపు పొల్పునఁ దావుల, నుబ్బఁజేయుచు
న్వనితలు చొచ్చి రవ్విపినవాటము మున్నయ మించి ధారుణీ
జనములచేత మీఁద నరి చాలఁ గొనంగలరాజులో యనన్. ౨౧౨

క. చిలుకలు పండులు గొఱికెం, గలవీణాక్వణనతులితకాంతామృతభా
షలు దమపలుకులఁ దెగడిన, నలుక న్మిగ మెట్టఁజేసె ననఁ గుటమందున్.

గీ. మందమందంబులైన భామాజనంబు,నడపులకు నోడు టఖిలజనంబులకును
బ్రకటితంబుగవనమయూరములుపాముఁ,బట్టఁగాఁజొచ్చెఁగేకాశపథములెసఁగ.

క. కాండములఁ జొచ్చుఁ దుమ్మెద, తండంబులు లక్షణాగతవ్యథ యను పె
న్గండముమాన్పం దలఁచి యు,నిండుఁగొలఁకుఁ గెంపుఁదమ్మినివ్వాక లనఁగన్.

సీ. కలయఁగఁ దేనెబొట్టుల సుళాకించిన పుప్పొడితిన్నెలపొంతలందుఁ
జల్లనిగాడ్పులు తళ్ళుగొట్టు రసాలసాలనిరంతరచ్ఛాయలందుఁ
గేసరచ్ఛటలచే గిఱికొన్నమాధవీలతికానికుంజసంతతులయందుఁ
బరువంపునెత్తావి గరువంబు దుళుకించు గురివెందపందిళ్ళపొరువులందుఁ
జలువకలువలకొలఁకుల కెలఁకులందుఁ, బాటలావృతగంధద్రువాటులందు
లక్షణాన్వితముగ నాకళాధినాథ,వలయవదనలు గ్రీడించి రెలమికలిమి.

గీ. నారి కడమపనులు నారికడమునీడఁ, జేయఁ దలఁచె దేమొ చిగురువాలు
శంబరాసురారి జళిపించుచున్నాఁడు, తగునె నీకు డాఁగఁ దలవ రెదుట.

గీ. ఏల తాంతభావ మీలతాంతంబులు, గోయవమ్మ నీవు తోయజాక్షి
యలరువిలుతుబాణములును నిందొకకొన్ని, నిలుపవమ్మ తాల్మిదెలుపవమ్మ.

క. చూతము నీసాహస మీ, చూతమునకుఁ బోవఁగలవె సుదతీ యందుం
జేతోభవాహ్వయం బగు, భూతం బున్నయది మున్ను వో రెవ్వారున్.

క. వకుళంబుఁ జూడు మిది దే,వకులంబును గల్పలతను వాంఛింపదు దీ
నికుసుమసౌరభసంపద, లకుఁ జిక్కెనె యని హరిణలాంఛనవదనా. ౨౨౦

క. సురపొన్నవిరులపుప్పొడి, హరనిటలకృశానుశిఖల నడలిన మరుమే
నిరజంబువోలె విరహ,జ్వరహేతుక మయ్యెఁ జంద్రవదన తెలిసితే. ౨౨౧

వ. అప్పు డుప్పొంగు వియోగవిదాహ మూర్ఛిత యై లక్షణాకన్య య వ్వనాంతరంబున. ౧౨౨

గీ. గాటమగుచిలుకపోటులుగలుగుదాడి, మీఁఫలమువృక్షరాజిలో మెలఁగుచుండి
చూచిశంకించె మాధవసూతినించు, నఖముఖములంటుతనదుచన్గవయటంచు.

చ. చిలుకలపల్కులన్ మనసు చిల్లులువోవఁగ డిల్లపోవునె
చ్చెలిఁ బరికించి మాల్యవతి చేడియ రాఁగదవమ్మ మారుపూ
ములికి మనంబు నాటెనొ విమోహమునొందెదు వావిలేని య
క్కలువలవిందు నీయెదకుఁ గాఁతియ నించెనొ గాడ్పు నొంచెనో. ౧౨౪

ఉ. మారుఁడు క్రూరుఁ డీమలయమారుతముల్ హాతకంబు లంబుజా
తారి వికారి కోయిలవిహారము ఘోరము చంచరీకఝుం
కారము కార మేకరణిఁ గాచెద మన్మ మనోరమ న్బహి
ష్కారము చేయుఁ బూన్కి కలకంఠవధూకలకంఠి యియ్యెడన్. ౧౨౫

గీ. అనుచుఁబాటలయిట్లునధిపతనయఁ, జూచియోచెలియీమావియేచియున్న
యసమసాయకుతేజోహాయములఁగట్టు, డాలుమీఱినతోఁపుగుడారువోలె.

గీ. తరుణి చూడు మల్లెవిరిమీఁద నొక తేఁటి, తేనె లాని యాని మేను మఱచె
దర్పణమున సొంబు దర్శించి చొక్కునఁ, గదురు నీకనీనికయును బోలె.

క. నీయధరము చవిగొనుయను, నాయకనందనుఁడు వోలె నలినేక్షణ యీ
కాయజహాయంబు బింబని, కాయము ముక్కునఁ బగిల్చి గబ్బున నుబ్బెన్.

వ. అని వెండియు నయ్యెడల వెడవిల్తు ధనుష్టంకారంబులుబోని భ్రమరఝంకారంబు లాదరించియుం బంచశరమహావీరసింహనాదంబుచుంబోని పికనికాయ కుహూకారంబు బహూకరించుచు సంపదచేడియకొడుకునడగని సకిలింతల వంతుకువచ్చు పచ్చపులుఁగుల రవళికి నవిరళప్రమదంబు నొందుచు నుద్యానవిహారోద్యమంబునం బ్రవర్తించిరి వెండియు. ౧౨౯

మ: మకరందాశ్రులుఁ బుష్పరేణుకణసంపర్కాభిరామాంగులు
న్వికసచ్చంపకమాల్యభూషణలు నీవీబంధసంబద్ధన
ద్వకుళశ్రేణులు నై చరించిరి వనీవాటంబునం బుష్పసా
యకబాణాగ్రవిలోకన ల్మదభవాహంకారసంకీర్ణ లై. ౧౩౦

శా. కాకుత్స్థాధిపగేహదైవతమ లంకానాథదత్తానుకం
పాకళ్యాణ కణాదకశ్యపముఖబ్రహ్మర్షిరాడ్ధ్యేయ మా

యాకంఠీరవరూపకుంఠితమహేంద్రారాతివక్షఃకవా
టాకీర్ణాగ్రహ (నిగ్రహ)వ్యసనలోలాకీర్ణహంసాంబుదా. ౨౩౧

క. కౌండిన్యవరద మకరీ,కుండలఘృణిమండలానుకూలకపోలా
పాండవరక్షక లీలా,తాండవనిర్దళితభోగితలభోగివరా. ౨౩౨

పృథ్వి. సమగ్రమహిమోదయా సకలభోగభాగ్యాశ్రయా
రమాకుచకృతాస్పదా రచితతాపసాంతర్ముదా
యుమాముఖనుతాకృతీ హుతవహప్రపూర్ణాహుతీ
నమజ్జనసురద్రుమా నయభయానుకారిక్షమా. ౨౩౩

గద్యము. ఇది శ్రీమత్తిరుమల శ్రీనివాసాచార్యవర్యకరుణాపారంపర్యపాత్రాత్రేయ సగోత్రాపస్తంబసూత్రపవిత్ర సకలకళాభోజ రామరాజరంగప్పరాజప్రణీతంబైన సాంబోపాఖ్యానంబునందుఁ జతుర్థాశ్వాసము.

శ్రీరస్తు.

# సాంబోపాఖ్యానము.

---

## పంచమాశ్వాసము.

క. శ్రీహసితలసితకారణ, మోహవదీహాభిరామ్య మునిహృద్గమ్యా
వ్యూహమయరంగమండల, గేహా మణివలయకోరకితనిజబాహా. ౧

వ. దేవా భావికథాక్రమంబు నీదివ్యచిత్తంబున నవధరింపుము. ౨

గీ. వనవిహారంబు చాలించి వనజవదన, లంబుకేళికిఁ జేరి పూలవులఁ జొనిపి
ఫులుకడుగఁ దెచ్చుమరునితూపులనుబోలి, సొమ్ములెడలించియునుజాలసొబగుగనిరి

— వారికేళీవిహారము —

క. చరమాద్రినితంబంబుల, నెరసిన మెఱసంజకెంపునిగ్గులుబోలెం
దరుణీజనకటిబింబో, పరితలములఁ జెంద్రకావిపావడ లమరెన్. ౪

క. వలిపపుఱవికలలోన, న్నలనాకుచకుంభవసుకలశములు దనరెన్
జిలుగునునునురుపుపొదివిన, వెలితామరమొగడపింఛువిన్నాణమునన్.

క. కొలనవుడు కామినీజన,ములు చొచ్చినఁ గలఁగె జఘనముల వారి దృగం
చలములను గలఁగుపులినో, త్పలములకుం గలుగునెగులు తల్లిది గాదే. ౬

గీ. కఠినకుచకుంభకరిశిరోఘట్టనమున, కోర్వలేకయె కొలనినీ రోడగిల్లి
పల్లవోష్ఠుల నాభికూపముల నడఁగె, సరసులకు నేల కర్కశజనులపొందు.

క. కచరించి తోడిసకియల, నెచరించుచు నోలలిడుచు నెత్తిలి నగుచుం
గుచకుంభప్లవవతి యలి,కచ యొక్కతె గడవ నీఁదెఁ గమలాకరమున్. ౮

క. చిన్నములుఁ బాతికెలు బలె, నన్నునఁ జనుగుబ్బలందు నధరములందు
న్మన్ననఁగుగోరుపలుసోఁ,కున్నిగ్గులు బయలుపడుట కొమరొదవించెన్.

మ. చరణాంభోరుహలాక్ష లోచనసరోజన్యస్తకాలాంజనం
బురువక్షోరుహకుంకుమావృతి కపోలోత్కీర్ణపత్రచ్ఛటల్
గరఁగించెన్ జలకేళి దాన మిగులన్ గంజాక్షు లింపొందియొ
ప్పిరి యుత్తేజితమన్మథాసిలతికాబృందంబుచందంబునన్. ౧౦

గీ. ఎపుడుఁ బాయకయుండునయ్యిందిరకుచు, నిడినతలగడవోలెఁ బూర్ణేందువదన
యొకతె కరపద్మమున నేత్రము నిచి యొప్పె, సలిలకేళీవిహారావసరమునందు.

క. పక్షునఁ దాఁకినఁ బగిలెన్, లక్కకరవటంబు లోక విలాసిని మేనం
జక్కెరవిలుతుని తూపుల, వ్రక్కలగు వియోగిహృదయవనజము లనఁగన్.

సీ. ఆమ్రేడితంబయ్యె నంభోరుహములకుఁ దావి వక్త్రాబ్జగంధముల చేత
ద్విస్త్రిరుక్తం బయ్యెఁ దేఁటిబోదలకును గప్పుచెల్వము గొప్పకొప్పుపసల
వెలసెఁ బౌనఃపున్యవిహ్వృతు లుత్పలములఁ జపలనేత్రాంశుకజలసమృద్ధిఁ
బునరుక్తివిధ మయ్యెఁ బులినవేదికలకు భ్రమిగొనుఘనజఘనములకలిమి
మదనమోహనశక్తిసమానయువతి, జనవతంసంబు లఖిలలోచనసరోజ
వికసనారుణకాంతులై వివిధగతులఁ, గొలని నీరున జలకేళి సలుపునపుడు.

క. జలకేళి మాని తీరం, బులకుఁ జనిరి చంద్రముఖులు పొదిగొని నాచుం
గలువలుఁ దమ్ములు జక్కవ, పులుఁగులుఁ గచ్ఛపము లొక్కప్రొ గగులీలన్.

సీ. పీడించి నురువుగప్పిన సైకతములనఁ బిఱుఁదులు వెలిపట్లు బిత్తరింపఁ
దెలిసంజముంచిన దిశలన మేనులు మెయిపూఁతచే మిఱుమిట్లు గొనఁగ
సెలయేఱు లీనుకొండ లనంగఁ గుచములు తారహారశ్రీలఁ దళుకుచూపఁ
దతిఁ బూచుకల్పకలతలువోలెఁ గచంబు లతులపుష్పాసక్తి ననఁగి పెనఁగ
లక్షణాకన్యమానసలగ్నతాప, శాంతి కుదయించు వస్త్రల చంద మొంది
యంబుజాక్షులువొలిచిరయ్యంబుజాక,రంబుతీరంబునందు నెయ్యంబుతోడ.

క. తదవసరంబున సంధ్యా, మదవతి యేతెంచి కమలమందిరలక్ష్మిం
బొదివికొని చనియె హరరో, షదళితమతి గిరిజఁ దుహినశైలసతిక్రియన్.

ఉ. కాలధనంజయుం డదనుగాంచి దివాకరమత్స్యయంత్రముం
గీలెడలించి సంధ్యయను కృష్ణ నుదంచితరాగవిభ్రమ
శ్రీలలితాంగిఁ గైకొనుడుఁ జేరి తమఃపటలీవిరోధిభూ
పాలకసేన లేయు సితభల్లములం బలెఁ బర్వెఁ దారకల్. ౧౮

సీ. కరులు కొమ్ముల వ్రేయ విరియు గందపుఁగొండ తరురాజిపువ్వులతావికొంత
తెగటుపూఁబోఁదుల మొగడచన్నులపూఁతపసుపుగమ్మఁదనంబుపసయుఁగొంత
జముదిక్కునేనుంగుగమకంపుఁజెక్కులఁ గాఱు చిక్కని జిడ్డు గబ్బుకొంత
వాటంపు మున్నీటివలని చెల్లెలికట్టఁ గలిగిన నళికల వలపు* కొంత
కూర్చి పెక్కు కదంబము గ్గుస్తరించి, యుపవనంబునఁబయ్యెర యొరసెఁబ్రొద్దు
తల్లికడుపునఁ బడియెడు తఱిని దొఱఁగు,మగువలకు నెల్ల నెమ్మేనిసోగటు దీఱ.

గీ. వనవిహారవేళ వనజాకరవిహార, వేళఁ గురునృపాలవాళితనయ
సక్తగాకయుండె సంసారసౌఖ్యంపు,టురులఁ దగులువడని యోగివోలె. ౧౯

* గలుగు నలర్చుల వలపు- మూ.

గీ. ఎగుర వైచె నప్పు డింద్ర దిక్కామిని, సహజకాళిమాళిసంగతంబు
నిజకళాకలాపనిబిడమరందాంబు, ఖనియు నిందుకుంభకందుకంబు. ౨౦

గీ. విసనకఱ్ఱ లయ్యె విపినవిహారంబు, లాజ్యధార లయ్యె నంబువిహృతు
లహితతాకుతనయయాయల్లకానలో, ద్భూధమానకు రచితబాధమునకు.

గీ. పాటలయు మాల్యవతియు నప్పద్మముఖికి, నూని వలవంతబలవంతమైనఁదలఁకి
విన్ననై మానసంబులఁ జిన్నవోయి, యొకరసాలద్రువాటికనొయ్యఁ గదిసి.

లఘుసీసము.

గని వెరల పరువమును గనకమయకదళితరు
కుసుమముల వడి నెడయునిసుమదియు ముదమొసఁగ
లకుచముల వికవికలు లవలితరుచకచకలు
సకలవిరహులకు నలయికసొలయికల నొసఁగఁ
జనుపకపు ననవలపు పెనుఁబసలు మదివదలి
హాలహాలములగుచుఁగడు హాలహాలికఁ బుటమెగయ
వకుళ (కుసుమములఁ) గడువడిటొరుగు మధువు వన
సరణులకు నధికవిలసనమొసఁగి ముసురుకొన
నెసఁగు నొకకేళివనమున కేగి యందుఁ
జంద్రికా(దరహాసను) సకియఁ దేర్చి
పాటలయు మాల్యవతియును బలికి రిట్లు
మదనకార్ముకనినదసమానఫణితి. ౨౩

సీ. పెంపుడుగున్న లిపికనికాయము వీని (యులివు) కుహూభయం బొసఁగకున్నె
మధుమతిములు మలిమసము లి తేంట్లును దెగి మనోంబుజము గందింపకున్నె
నిలుకడచాల దీమలయానిలమునకు వికటభావంబున వీవకున్నె
యంగహీనుం డైనయసమాస్త్రు పని యెంత పాండురుక్షుండిందుబలిమి యెంత *

వ. అని యసమశర సింహాసనంబునుం బోని కిసలయతలిమతలంబున సతలోదరి నునిచి నెయ్యంపు తి... వయస్యజనంబుల నాలస్యంబునం జంద్రాస్యకుం బ్రసవ యుధశిఖిరేఖాశిఖాతిజ్వరంబు శాంతిసేయం గడంగి. ౨౪

చ. విరులును వెల్లువఁ దామరపాకులు న్ననో
హారబిసకాండకాండములు నబ్జపరాగముఁ జందనంబుఁ గ

* ఈసీసములోని గీతము లేదు. “ వినిమ్రమునకు నెగడభూరిగోప్పృథుకచపలనయన ” అని మాత్రమున్నది.

స్ఫురము హిమాంబు బోరనునుంజిగురాకుఁ గల్పపూ
సురటులుఁ గ్రొత్తకావులు విశుద్ధవినూతన హారవల్లులున్. ౨౮

వ. తెచ్చి యమ్మచ్చెకంటిదగు పచ్చవిలుతువెచ్చ యుచ్చలితంబు సేయునపుడు.

గీ. వెలుఁగు దివ్వియమీఁద గుగ్గిలపురజము, చిలికినట్లయ్యె నొకయింతి
వపూ సల్లిన భగ్గురనుచు, మలసిమదనాగ్నికీలాసమాజమురక.

గీ. తరుణిసందులఁ గట్టిన తమ్మితూఁడు, గొనల మొగములఁ జిలచిలమనుచునిరవు
వెడలె విరహజ్వరానలవేదనాప్తి, చంద్రకిరణాలనమృతంబు జాఱునట్లు. ౨౯

గీ. అతివ డెందానఁదామరపాకువైవ, ముదురుఁదాపంబు చెమచ్చముడుఁగుటమరె
లలితకుచలక్ష్మిదమ్మిమొగ్గలనొసంగ, వేళఁ గని కేలఁ బిల్చినవెరవొయనఁగ.

ఉ. ధాతుపటంబుచేఁ బొదువఁ దామరసాక్షి చలించె మన్మథో
ద్యోతితదోఃప్రతాపశిఖి యొక్కట ముంచినలీలఁ దచ్ఛిఖా
జాతనవీనధూమలవశంక నొనర్చెఁ దదంగసౌరభా
యాతమధువ్రతంబులు నిరంతరధారఁగఁ జెసి క్రమ్మఁగన్. ౩౦

—॥ లక్షణాకన్యకు శిశిరోపచారములు. ॥—

గీ. చికురశైవల ముఖపద్మ పికచహాస, ఘనవళీభంగ గతిహంస మన నటించు
నతివలావణ్యసరసిమత్తాళులయ్యె, నతను తాపాగ్నిఁబొగచూరుహారమణులు.

క. ధాతుజల మబలమేనున, నాతి యొకతె చిలికెఁ బుష్పనారాచశరా
ఘాతక్షతముఖములఁ గడుఁ, దోఁతెంచునసృగ్గలంబుతోఁ గవగూడన్. ౩౩

గీ. కళలుపైనిండ నెఱసినఁ గందునిందు, వలనఁదొరఁగినకందు వెన్నెలయుఁబోలె
సకియ నెమ్మేన నలఁదిన చందనంబు, కాయజుని వేఁడిఁ గస్తూరిచాయయయ్యె.

మ. చివురుంబోఁచలు కిలకిలములుగాఁ జిల్కించుపన్నీరు చే
తివిదిర్పం జలధారగా సురటులన్ దీపించు లేగాడ్పు నా
శవశద్వాయువుగాఁ గరంచె నట బాలాగాత్రహేమంబు న
వ్వావుశిల్పాఁడు కళాదులీలఁ ద్రిజగద్భూషాకృదుద్యోగియై. ౩౪

క. శిశిరోపచార మతివలు, శశివదనకుఁ జేయుటయును జల్లాఱుక క
ర్కశ మయ్యె విరహతాపము, కృశ మయ్యె స్మను మరుఁడు గినిసినరీతిన్.

సీ. సలసలనెసరుగాఁ దలచూపు చెమటలఁ జగురాకుఁబొరకలు చిమిడిపోమెఁ
గుప్పలుగాఁ దెచ్చి కుప్పళించిన కమ్మవిరులెల్ల సొరువులై ధరణిఁ దొరఁగెఁ
దప్తలోహంబుమీఁద విదిర్చుటనుఁ బోలె హిమవారి చివ్వన నివిరిపోయె
సున్నంపుఱాళుల చెన్నున మణిహారఘుటిక లేపటి తొటతొటన రాలెఁ

బొక్కెఁ జేతులు చెలులకుఁ బుష్పఁ దోఁట, దవశిఖాలీఢమగు రీతిరవులుకొని యె
నంగనామణి నెమ్మేన ననలుఁగొనలు, నై నవిరహజ్వరానలవ్యాప్తి దనర.

గీ. సాంబజస్నేహపాత్రమై యంబుజాక్షి, మేన దీపించె నవదశామేళనంబు
శంబరారి ప్రతాపాగ్ని జ్వాలగాఁగ, ధైర్యతిమిరంబు విరియ సుస్తంభయుక్తి.

క. ఉరరీకృతశోకాహతిఁ, గురరీగతి నడలి రపుడు గొమ్మలు విరహ
జ్వరరీతియుఁ జేతోభవ, శరరీతియు మాన్పలేక చంద్రాననకున్. ౩౮

సీ. గుడినుండి గుడిత్రాళ్లు గోయంగ నేటి కోయతనుండ సతిచిత్త మాశ్రయించి
మొగమోట లేక యోతొఁగలనెచ్చెలికాఁడ భవబాభవదనపైఁ బగ యదేల
మీపల్లులోనిది మెలఁత మీ రేటికి సూడు వాటింపంగ శుకములార
చెలువయూరుపుల నెచ్చెలిపి జగత్ప్రాణ సుడియఁగాఁదగునెయసూయనింత
యేమి సేయువార మెవ్వరఁ గనువార, మెట్టివేల్పుఁ గొలుతు మేది తెరువు
హేమసారవర్ణ కీబారి దప్పింప, నేరు మొక్కొ ప్రియ మొనర్తు మొక్కొ. ౪౦

మ. అనుచుం బెగ్గిలి యుందు నంగనల నయ్యబ్జాక్షి వీక్షించి యో
యనుఁగున్నెచ్చెలులార మీరలు సరోజాలిన్మనోజాతుఁ గ్రొ
న్ననలం జిల్కలఁ గోకిలప్రతతి నిందల్సేయఁగానేల నా
తను వేసిత్యము ప్రాణమేమి ధ్రువమా తర్కింపుఁడీ యీదెసన్. ౪౧

క. ఏనొక తెరువునఁ జసియెద, సూనాయుధుఁ డెగడనేల సోముని దూఱం
గానేల కమ్మఁదెమ్మెర, పై నలుగఁగ నేల వట్టి పగ యేమిటికిన్. ౪౨

వ. అని నిర్వేదంబు నొందె యామందగమన గమనోన్ముఖి యై రానేరక. ౪౩

గీ. గోలుగోలున నేడ్చునక్కోమలాంగి, వెడఁదకన్నీరు కుచపాళి మడుఁగుగట్ట
నందుఁ బ్రతిబింబితంబైన యతివమోము, స్వాంతగతనాథుపూజాంబుజాతమయ్యె.

ఉ. లక్షణ యిట్టనుం జెలువలం జెలులార శశాంకుఁ గంటిరే
పక్ష మొకింత లేక ననుఁ బాదగతిం దపియింపఁ జేసె నీ
యుక్షవిభుండు దాహగుణహేతువు వీఁడుదయింప నబ్ధిరా
ట్కుక్షి జ్వలించుచున్నయది ఘోరతరౌర్వశిఖిచ్ఛలంబునన్. ౪౪

సీ. బలిమిమై సురలెల్లఁ బాఁకులు వైచి లోఁగొనినసిగ్గెఱుఁగని కుటిలుఁ డితఁడు
దక్షాధ్వరధ్వంసి తాఁపున గులగుల లయ్యును నెఱచూపుహతకుఁ డితఁడు
ఖరకరబింబ సంగతిఁ జాలఁ జిముడుచుఁ జెవవోనాడు దుర్భావుఁ డితఁడు
చటుల విఘుంతుదాస్యదవాగ్నిఁ గరఁగిన నెలసిపో నుమియునుచ్ఛిష్టమితఁడు

ఫాలలోచనుఫాలాగ్నికీలపొరుగు, వేఁడిఁబొగచూరునట్టి దుర్వృత్తుఁ డీతఁ
డితనికేటికి దొరకునే యింతులార, విరహిహృత్ప్రీణనం బొకపిసనమైన.

క. గురుతల్పగమనదోషా, వరణము హరిణాంకుమేన వర్తిల్లెడుఁ గం
టిరె వాలుఁగంటు లీరలు, హరిణ మనం బడమినీడ యన శశమునఁగన్.

ఉ. మున్నువిధిప్రసూహరణముం బ్రకటించిన కీడుపుర్వ మి
త్రోన్నతి సైఁపలేని యదయుం డలగోవధ సేయుపాపసం
పన్నులపాలివేలుపు విభాకరతప్తనభోంబరీషలా
జోన్నయ మీనిశాకరునియొచ్చెము లెన్నఁగ నేల సారెకున్. ౮౯

క. ఒడ లెఱుఁగఁడు మధువశుఁ డీ, వెడవిల్తుం డీతఁ డేయు విషమాస్త్రంబుల్
తొడిమలకుఁ జిదిమి వైతమ, యుడుగుఁగదా యంతవానియుబ్బున్ గబ్బున్.

శా. పూమొగ్గల్ శరముల్ గరుద్రథకులంబుల్ సైన్యముల్ వింటియుం
దేమాత్రంబును జేగ యుండకయు నిక్షేడ్పించు నియ్యంబికా
స్వామిద్రోహికి నాజ్ఞ యెయ్యది యొకో చంద్రాననల్ మీర లీ
కామాకారపుదొంగఁ బట్టి తునుమంగాఁ జాలరే యెల్లరున్. ౯౦

గీ. అతనుచంద్రహాస మంగనలార నా, హృదయపంకజంబుఁ గుదిలపఱిచెఁ
బఱుప కేలయుండుఁ బాథోరుహములకుఁ, జంద్రహాసములకు శాత్రవంబు.

ఉ. క్రూరహరాక్షివహ్నితతిఁ గ్రొంబొగచూరినమేన నామది
న్మారుఁడు దూఱి యేరికిని మానుపరాక జ్వలించుచున్నవాఁ
డోరజనీశబింబసదృశోల్లసదాననలార యేక్రియ
న్వారణసేయువార మనివార్యము లేతదుదారశౌర్యముల్. ౯౧

సీ. మదిదప్పిచనుఁగానిముదురఁబాఱినబింబములు దెచ్చి పోయుఁడీచిలుకలకును
డగ్గుత్తికలు వడి డయ్యుఁగా చిగురాకు నొగరాన్పుఁడీ పికవ్యూహములకుఁ
దేనెలో నీఁగలై తెగుఁగాని పుష్పాసవములు నింపుఁడు మదభ్రమరములకు
భువిఁదూటుఁబోతులై పోవుఁగానిమరాళములకు మేపుఁడు తూఁటిమొలకలుఱక
పుష్పాదులు గ్రుమ్మరింపుఁడు పొలయుమలయ, మారుతాంకురములకు సమగ్రమగుర
జోవికారాపయశమాని స్రుక్కుఁగాని, వీనిఁ బాటింప నేటికో వెలఁదులార!

వ. అని యనవధికవిరహవేదనా దూయమానమానసయై యాకిసలయోష్ఠి
దశమదశకు వచ్చియు నదృష్టవైభవంబున ధృతప్రాణయై సఖీసమేతంబు
గా నిజనికేతనంబుఁ బ్రవేశించి మనోరథపరంపరాసోపానంబుల ననంగుం

గొని తెచ్చి హృదయహర్మ్యంబునందుఁ బ్రతిష్ఠించి ప్రతిముహూర్తంబును
నారాధించుచు నుండె నంత నిక్కడ ద్వారకానగరంబున సాంబకుమారుం
డొక్కనాఁడు. ౫౪

—౹ సాంబునకు సిద్ధాంతదర్పణుఁడు రాజనీతిఁ జెప్పుట. ౹—

గీ. ఉద్ధవాదిసుధీమణు లోలగింప, భృగుముఖులు చేరి సేవింపఁ బెంపుమిగుల
నాదినారాయణుఁడువోలె నమితమహిమఁ, గ్రాలుసిద్ధాంతదర్పణుఁ గదిసి మ్రొక్కె.

వ. మ్రొక్కిన నక్కుమారు నిరీక్షించి యన్విచక్షణుండు కృపాకటాక్షంబున నా
దరించి యేకాంతంబున నిట్లనియె. ౫౬

శా. అన్నా! సాంబకుమార సంతతవిచారాయత్తచిత్తుండవై
యున్నా వంచుఁ బ్రజ ల్వచింపుదురు నీ కుద్వేగ మింతేల సం
పన్నశ్రీ లభియించుఁ దావక మనఃపర్యస్తము ల్గొగ్గలే
ను స్నీభావ మెఱుఁగుదుం దలఁపునందుఁ జాయుల న్నన్నలన్. ౫౭

సీ. నీకీర్తికలశాంబునిధి పయఃకణ మిందుఁ డీమొడ ని న్నేమి సేయఁగలఁడు
గురుగభీరమయూఖఖరము నీమానసం బసమాస్త్ర హేతి యెం దాడునోటు
నిర్జరాచలసారనిధి నీశరీరంబు కంపించునే కమ్మగాడుపులకు
వివిధవేదాంతార్థవిబుధపూర్ణములు నీశ్రుతులు చిల్లులపల్లు చొచ్చుటెట్టు
లన్నియును జక్కనయ్యెడు నతిరహస్య, వృత్తిఁ గురుపతిపురి కేగి చిత్తవీథి
నీవు గోరెడి లక్షణాసిలవేశిఁ, దెచ్చు రాజుల కెదలోనఁ దెగువ వలదె.

క. సామము దానము భేదము, నామీఁదట దండనియతి యనునయములలో
భీమప్రతాప లక్ష్మీ,వ్యామోహితులకును నాల్గవదియే యొప్పున్. ౫౯

క. అరిఁ దజితో నొక సింధు, స్ఫురణముమై నొత్తవలయు భూపతి చంచ
త్తరవారిధారఁ దద్బల, తరుమూలము లెల్లఁ బెకల దర్పము దివియన్.

క. కోపంబు లేనిపతియును, శాపాక్షరశక్తి లేని సంయమివరుఁడుం
దాపంబు లేనివహ్నియు, రూపింపఁగ నొక్కరూప రూపధనాఢ్యా. ౬౧

క. పతిబాహుశక్తి పెరిఁగినఁ, జతురంగబలంబు లెల్ల జయమహితంబుల్
పతిబాహుశక్తి తఱిఁగినఁ, జతురంగబలంబులెల్ల జయరహితంబుల్. ౬౨

చ. జనపతిపోటు మున్నయి ప్రశస్తి వహించిన నెట్టిపందవాఁ
డును రణవీథిలో బలకఠోరతమై జయ మిచ్చు భర్తకున్

జనపతి మెత్తన న్వొనుకసాగిన నుత్తమవీరకోటికి
న్ననసు గలంగఁ గానఁ బతి మానధనుండయి కాఁదగుం దగన్. ౬౩

గీ. పాముఫణమునందుబలిమిఁ జూపకయున్నఁ, దోఁక యేమిసేయుఁ ద్రొక్కువడియు
రాజు చేయి మున్ను రానేరకుండిన, భటులబలము కలనఁబనికిరాదు. ౬౪

గీ. విభుఁడుసప్తాంగసంపద వెలయునేని, భూమిభారంబు నిస్తంద్రముగవహించు
నక్షమాయమగురథమెక్కి చలితదివస, రాజ్యకృత్యము నీడేర్చురహియిగుర్వ.

గీ. విశదభూతిసమగ్రంబు విపులకామ, దాన్తదర్శనమును నై ధరాధినాథు
నీతి పంచాంగనిర్ణయఖ్యాతి దనరుఁ, బంచవదనుని వదనప్రపంచ మనఁగ.

క. శక్తిత్రయపోషణి యగు, యుక్తి గలుగురాజు వెలయు నుడుగని కలిమిన్
శక్తిత్రయపాలనసం, సక్తిముదిత హరహరాబ్జసంభవనిభుఁ డై. ౬౭

క. అరివిత్తాహరణస్పృహా, ధరణీపతి కునుపఁదగు సదా హృదయమునన్
వరవిద్యావరణాదృతి, పరిణతి విపులమున్ బోలెఁ బౌరుషశాలీ. ౬౮

క. అరివర్గము నమరీకుచ, గిరిదుర్గము లెక్కఁ బతుపుక్షితినాథున కి
ద్ధర దుర్గచతుష్టయసం, భరణము గావలె జయానుభావాయతికిన్. ౬౯

క. వనితాధరసుధ పలుసోఁ, కునఁ జుఱుకుట్టించి ప్రియుఁడు గ్రోలుకరణి భూ
జనము మదిఁ ద్రాస మించుక, గనిపించుచుకొయ్యఁదిరియఁగాఁదగుఁబతికిన్

క. కనవలయుఁబరులహృదయము, దనమదిమొగులెఱుఁగనీకదాఁపఁగఁదగుదం
డనమునఁ గ్రోధము లాలన, మునఁ బ్రమదముఁజూపుటొప్పుభూపాలునకున్.

క. పతి సేదవడియుఁ దలఁకక, ధృతిఁ దనసరివారివలనఁ దేజము గను స
న్మతిబహుళపక్ష కార్శ్య, స్థితచంద్రుఁడు తరణిఁ జొచ్చి తేజము గనఁడే.

క. క్షితిఁ బాలు వితిగెనే నొక, గతి జున్నై యొసఁగుఁ గౌతుకంబు ప్రజలకుం
బతి యని వితిగెనయే నా, స్థితక్షీరక్షీర మవనిఁ జిందఁగఁ బోయున్. ౭౩

క. ఏల విచారము జయమున, భూలోకసుఖంబు లెల్లఁ బొందఁగ వచ్చున్
వాలికశరవిధి నీల్గినఁ, గేలు గమియు రంభ నృపతికిం గుశలమతీ. ౭౪

క. కినిసిన దావానల మాఁ, జన విచ్చెనయేనిఁ బూర్ణచంద్రాకృతి యా
జననాథుని సాత్వాద్వి, ష్టునిఁ గా మదిఁ దెలియవలయు సూరినిధానా. ౭౫

క. ఆహారి యూహాపోహ భేద, శ్రీహవణించుటను సకలసిద్ధులు గనెడున్
ఊహావిశేషములెఱుఁగు చు, హాహాపజయశాలి గాంచు నభిమతలబ్ధుల్.

క. తనపౌరుగురాజు నాచలి, జననాథునిపొందు సేయఁజను నరపతికిం
దను సామంతుఁడుపొదివినఁ, గనలియకండతనిష్ట్రాఁదఁగవయుటకొఱకున్.

వ. ఇదియె కాదు, మఱియు శుక్రబృహస్పతి ముఖ్యులు వక్కాణించిన నయము లు ధర్మోక్తితార్థసాధనంబు లనేకంబులై లోకంబునం బెంపు వడయు, నీతె ఱం గెఱింగించెద వినుము. ౭౮

గీ. సీరి పెదతండ్రి తండ్రి లక్ష్మీవిభుండు, సత్యకిసుతుండు పినతండ్రి శంభుమాఱు బోండె నీవు రణాంగణభూమినిన్నుఁ, దాఁకి గెలుచునె దివిజబృందంబులైన.

క. తిరునాళ్లకేగి సామజ, పురమునఁ గనుఁగొంటి నేను బుష్పాయుధమం త్రరహస్యవిద్యఁబోలిన, కురుపతిసుత లక్షణాచకోరనిభాక్షిన్. ౮౦

వ. ఆకొమ్మ మమ్ము సేవింప వచ్చి యచ్చట శ్రీవైష్ణవానుగ్రహాపోషితసౌభా గ్యవిశేషయై యేకాంతంబున లతాంతవిశిఖశిఖిశిఖాపీడిత యగుచు నాతో డంబ్బ్రువుంబోని యాబింబాధర సాంబుండు మత్ప్రాణావలంబం బని నొ డివె నీవును వడిగల తురంగంబులం బూనినయరదం బెక్కి యుక్కుమెఱసి క క్కసు లగు నొక్కకొందఱు వీరవరులం గొని కూరిమికి సార మైనవారిచే తం బరివారితుండవై భేరీమృదంగపణవాదికంబు లగు సద్భటచిహ్నంబు లడంచి వంచనాప్రకారంబున లతాకాంతారవీథికి మాధవమధుసమారా ధనకు వచ్చు నచ్చపలహారిణలోచనం దెమ్ము. ఏతదర్థంబులు శుభోదర్కం బుల య్యెడు నని యయ్యష్టమూర్తిద్వితీయావతారునకు శ్రీమదష్టాక్షరం బు నుపదేశించి మున్ను విశ్వామిత్రుండు దశరథపుత్రునకుం బోలెఁ బ్రశ స్తశస్త్రాస్త్రాగమప్రకారంబు లన్నియు నెఱింగించి కించిద్దరహసితాననుం డై యాచార్యపంచాననుండు దీవించి యంచిన నాప్రతాపశాలి వికాస భాసమాన హృదయుండై యాప్రొద్దె కదలి కతిపయసైనికసమన్వితంబు గం గరిపురంబున కరిగి యక్కక్కసపు జవ్వని రాకఁ గోరి యేకాంతంబున నొక్కయిక్క నుక్కళంబు గాచి యుండె నంత నిక్కడ. ౮౧

—॥ సాంబుఁడు హాస్తినాపురమునకుంజనిన బలభద్రాదులయలజడి ॥—

క. ఇంద్రప్రస్థపురంబున, కింద్రానుజుఁ డటకమున్న యేగెను నాఁ డ య్యింద్రోపము లగుపాండున, రేంద్రతనూభవులఁ జూడ హితకరుఁడగుచున్.

క. బలభద్రుఁ డొక్కఁడయ దో, ర్బలభద్రుం డగుచు నగరరక్ష యొనర్చున్ హలముసలలలితనిజభుజ, బలమునఁ జంద్రాతపప్రభానిభయశుఁ డై. ౮౩

గీ. అంబుజాక్షతనూజుండు సాంబుఁ డెందుఁ, జనియెనో యనిపౌరులాశ్చర్యరసని మగ్నమానసులైరి ప్రేమమునజాంబ, వతియువత్సరహితగవాకృతివహించె.

క. బాలశశి లేనిపడమర, వోలెన్ ద్వారవతి చాలఁ బోలుపఱి యుండె
న్నాళీకనాథనందన, కేళీరసరహిత మై యకించనత మెయిన్. ౮౯

క. కొందఱు (హరితోఁ)జనిరె మ్ము,కుందసుతుఁడంచు ఱొక్క కొంద ఱరులచే
తందూలెఁగొమరుఁడందురు, కొందఱతఁడ జేయుఁడట్లగు నెయుం బ్రబలన్.

వ. వెండియు నందఱు నన్నివిధంబుల నితనిం గానమికి మనికితపడుచుండి రప్పు
డుప్పొంగు విచారక్రోధంబు లనుయూథనాథంబులు నిజమానసంబుం గలం
పఁ దలంపరాని యుద్రేకంబున బలభద్రుండు తుహినాద్రికి మొలచిన మణిశి
ఖరంబు చందంబున వివిధరత్నఘటితంబగుకిరీటంబు మీఁటి మోవ రేవతీము
ఖదత్తగంధోత్తమాగంధ ధురంధరం బగు వదనబింబంబు పరిమళ పరిపూరిత
సితాంబుజంబునోజ రాజిల్లం బద్మరాగ పల్లవస్థగితంబు లగుచు ధగధగ మె
ఱచు కుండలంబుల తఱచు మెఱుంగులు ముకురగర్భ ప్రతిఫలిత తరుణత
రణి కిరణంబుల కరణి గండమండలంబులం బ్రతిఫలింప నలఘు తేజోమయ
వలయవలయితంబు లగు నాజానుదీర్ఘంబు లగు భుజాదండంబు లలంకృత శే
షద్వితయంబుం బోషింప నిలింపాధిప ధనుర్లతాపరివారిత హరిశిఖరసాను
స్థలంబుం బరిభవించి కనకవనమాలికాలింగితోత్తుంగ వక్షఃపీఠంబు కనో
రాకారంబై తోరంబుగ నిజవామ చరణాంబుజంబున నుద్దండ తేజోమండలం
బగు గండపెండేరంబు ఖండపరశుసకు నురగమంజీరంబునుం బోలె రం
జిల్ల నుల్లక్షిత మధుకరమాలికా కమనీయకల్పవృక్షసపక్షంబై కప్పుదుప్పటి
గప్పినమే నుప్పొంగ నాస్థానమండపమ్మునకు నేతెంచి పంచాననపీఠం బలం
కరించి యుచితాసనాసీను లగు నుద్ధవాదిబుద్ధినిధులతో శంఖధ్వనిభాస్వ
రం బగు వికస్వరస్వరంబున ని ట్లనియె. ౯౦

క. హరి యింద్రప్రస్థమ్మున, కరిగె న్ననమీఁద భార మంతయు నిడి యే
వెరవొకొ కుమారునిం గను, మురు వది దా నీళ్లలోని మ్రొల్లె యుండెన్.

చ. చనియె దినంబు లైదు దను సంభవుఁగానక భల్లుకేంద్రనం
దని మదిఁ జింత వంతఁబడి తాంతలతాంతసమానమూర్తి య
య్యె నకట సాంబుఁ జూచుటకు నేది తెలుంగొ విరోధి యెవ్వఁడేఁ
దన పెనుమాయ దార్పఁడు గదా యలశంబరుఁ డంగజుంబలెన్. ౯౨

క. వ్యసనము లెఱుఁగఁడు విద్యా, భ్యసనములయ కాని యట్టి పట్టిఁ గనమి గ
న్నసతికి నోర్వఁగవచ్చునె, కసిమసఁగుంగాక శోకకల్పానలమున్. ౯౩

క. హరి వచ్చి సాంబుఁ జెచటికి, నరిగె నొకో యనిన నేమి యనువారము దు
ష్పరిభవముగాదె యీశ్వర,వరలబ్ధుని మోసపోక వరమతులారా. ౯౧

మ. స్మరజిన్మూర్తిధరుండు విక్రమకళామత్తేభవిద్వేషి స
ద్గురుభక్తిప్రవరుండు ధైర్యవిజితక్షోణీధరేంద్రుండు భా
స్కరతేజుం డతిదీర్ఘబాహుఁడు జగత్శ్లాఘ్యుండు సాంబుం డతం
డొరుచేఁ జిక్కెనె యేమియో (యెఱుఁగ) మీ రూహింపుఁడా ధీనిధుల్.

క. అనిరుద్ధుని తెఱఁగైనం, జని యానిర్బంధకారిఁ జక్కడఁచి కుమా
రుని దెత్తు భుజాంచలసం, జనితబలము నారదప్రశంసకు నెక్కన్. ౯౩

స్రగ్ధర. కలఁగింతు న్వారిరాసు ల్గహనదహనరేఖ న్విజృంభింతుఁ గొండల్
నలఁతుం బెండూళిగాఁ బన్నగనిలయముల న్వట్టి మల్లాడుదు న్నా
తల మెల్లం గ్రొత్తు ద్రెంతున్ దశదిశలు హరిత్పాలకావాసపంక్తిం
దలక్రిందై యుండఁ దార్తుం దనయుని మగుడన్ ద్వారకావీథిఁ జేర్తున్.

క. జమునిల్లు సొచ్చెనేనియు, భ్రమితముసలసరభసాగ్రపాతంబుల నా
కమలాప్తసంభవునిమై, చమరుక పడనడఁచి సాంబుఁ జయ్యనఁ దెత్తున్.

క. పేరాహితగళవాగుర, సీర మిది గదాయుధప్రసిద్ధోరగజి
హ్వారంగనటి మహాహవ,ధారుణి నాకెదురె దైత్యదానవు లైనన్. ౯౬

చ. అనుడు సభాసదు ల్వలికి రంతటివాఁడవు నిక్క మీవ యే
యనువున నైన సాంబు తెఱఁ గారయ నేర్పఱు లైనవారిఁ బం
పనతగు వేగిరింపకు మమానుషవిక్రమ నీదుక్రోధవ
హ్ని నిగుడు నేనియు న్నిట(లనేత్రుని కేనియు) నోర్వశక్యమే. ౯౭

వ. అని యీచందంబున నుద్ధవాది విద్వద్బృందంబును రోహిణీనందనుండు నూ
హాపోహగా విహ్వలహృదయులుగా నున్నయెడ. ౯౮

గీ. గగనభారతి వల్కె లక్షణగుణించి, యాహరించుటకై సాంబుఁ డరిగినాఁడు
హస్తిపురమున కతనికి నచటఁ   బ్బు పోరగుఁ గలుగుజయము. ౯౯

క. బలభద్ర నీవు పొమ్మని, పలుకుటయును నెల్లజనులుఁ బలునాశ్చర్యా
విలచిత్తులైరి హాలి   రిని ప్రమదరభస   తమకిదై. ౧౦౦

గీ. కొడుకునునికి కలరి కోటానఁగోటులై,యదుబలంబు గొలువ నపుడు గదలి
కరిపురం   నాథుఁడై, నడువఁ దొడరెఁ దూర్యనాద మడర.

వ. అంత నద్దంతిపురంబునందు. ౧౦౨

శా. ఆదుర్యోధనపుత్రి కూరిమివయస్యల్గొల్వ నుద్యానవా
టీదేశంబున కేగుదెంచి మణిశాటీపుష్పకస్తూరికా
శాదాదుల్గొని యాదిలక్ష్మిని భజింపం బర్వకాలంబు గాఁ
గా దీక్షావిధి నవ్వెమె రథారూఢయై. ౧౦౩

గీ. ఇట్లు విజయలక్ష్మి నిందీవరాక్షియు, ద్యానలక్ష్మి గుడికి నరిగి యచటఁ
బూజసేయఁ దొడఁగెఁ బుష్ప(ములఁగొని,) నిఖిలలోక కామినీమతల్లి.

సీ. కమ్మగొజ్జఁగనీటఁ గావించె జలక మంభోరాశికూరిమిపుత్రికకును
దడియొత్తె (మేటిసుగ్గడి)తంపువలువల వనజాక్షవక్షోనివాసినికినిఁ
గలహంసచిత్రితకౌశేయ మర్పించెఁ బుష్పాయుధుని గన్న పుణ్యనిధికి
సాంకవమ్ము బద్మాలయకును
సకలజననికి రత్నభూషల నొసంగె, నిధికటాక్షకుఁ గర్పూరనికరశకల
ఘటితనీరాజనము ధూపకల్పనాప్రపూర్వముగఁ ద్రిప్పె నాకశాపూర్ణవదన.

క. జయమంగళాదిగీతు లు,దయదమృతస్యందముగ వయస్యల విష్ణు
ప్రియమ్రోలం బాడించెను, నయనద్యుతజితచకోరనందితధారన్. ౧౦౬

గీ. మృదులకరపల్లవాంజలిం బొదివి పట్టి, భామ పూవులు పైనించెఁ బద్మగృహకు
నమ్మనిపట్టినను సేయునాశుగంబు,లిపుడుమీఁచూడుమనిచూపు లెసక మెసఁగ.

క. పరమాన్ననివేద్యంబులు, పరిమళసంభారభరితబహువిక్రంబుల్
శరనిధితనయకుఁ గౌరవ,వరతనయ యొసంగి చరణవందన పరయై. ౧౦౭

చ. కనుఁగవ మోడ్చి నెమ్మనము గౌఁగిట నాథుని జేర్చి యోజగ
జ్జనని విలాసమన్మథు యశఃకలికాఘనసారసారచం
దనరసలిప్తదిక్తటు సదాశివమూర్తి ముకుందనందనుం
బెనిమిటిఁ జేయుమీ తనకు బృంహితసాధుకదంబు సాంబునన్. ౧౦౯

వ. అని నిశావసానంబునఁ బావనాంతరంగయై యాకురంగనయన నయనం
బులు విచ్చి తనకుం బచ్చవిలుతుతల్లి శుభసూచకంబుగం బెట్టిన ప్రసాదం
బు సాదరంబునం గైకొని యాకైటభాంతకకాంతానిశాంతంబు వెలువడి
వచ్చునవసరంబున. ౧౧౦

— సాంబుఁడు లక్షణాకన్యను హరించుట —

క. అదనెఱిఁగి మున్న యచ్చట, మధువని నివసించుహరికుమారుఁడు గదిసెన్
మదకరికలభము పద్మినిఁ, గడియుకరణిఁ గేలుఁదమ్మిఁ గబళించుటకున్.

గీ. కలలఁ గన్యరూపు గనుఁగానసాంబుండు, ముకురనిభకపోల ముకురకుక్షి
నధిపుఁ జూచెఁగాననమానమింతయుఁ, గలుగదయ్యెవారుగదియునపుడు.

చ. హరి మును రుక్మిణీజలరుహానన నోర్తునె తెచ్చెఁ గాని యా
హరితనయుండు లక్షణఁ బ్రియాళియుతంబుగ వేగఁ దెచ్చి బి
ట్టరదముమీఁదఁ బెట్టె నది యట్టిద పుత్త్రుఁడు తండ్రికన్న ని
ర్భరబలశౌర్యధైర్యగుణభాగ్యరమన్ ఘనుఁడైనఁ జెన్నగున్. ౧౧౩

గీ. అపుడు సాంబుండు నిజబలం బలఘుశౌర్య
సారసముదగ్రమై మహాస్త్రముల వెడలు
దీధితులు భాస్కరాంశులఁ దివిచి మ్రింగు
చుండఁ దను గొల్చి రా రథసోగ్రుఁ డగుచు. ౧౧౪

క. తరలెన్ ద్వారక కేగెడు, తెరువున లక్షణయుఁ దాను దేరెక్కి నభోం
తరమున రోహిణితోడం, బెరసి సతారముగ విధుఁడు బెళికెడుసరణిన్.

గీ. అంత లక్షణవెంట మున్నాదిలక్ష్మిఁ, గొలువవచ్చినవారెల్లఁ గలఁగి పఱచి
యద్దిరా యెంతపని పుట్టె ననిపురంబు, సొచ్చిసాంబుని తెఱఁగెల్లనుచ్చరింప.

చ. ఉరగఫణాగ్రలగ్నమణి నుద్ధతి సిద్ధుఁడు గొన్నలీల శ్రీ
శ్వరసుతుఁ డాత్మనందని నసాధ్వసుఁడై కొనిపోయె నంటకుం
గెరలి మహోగ్రుఁడై యురగకేతుఁడు భీష్మసహోదరాంగరా
డ్గురుసుతబాహ్లికాదులుఁ దగుంబరివారము వెంట నంటఁగన్. ౧౧౫

క. చిచ్చార్పవెడలు కైవడి, వచ్చెఁ బురము నిర్గమించి వసుధావలయం
బెచ్చటఁ జొత్తునొకోయని, యచ్చువడె న్గమనవేగరేఖారభటిన్. ౧౧౬

గీ. ఒకఁడు సంభ్రమమున నొఱలోనిపట్టెంబు, వెఱికిపాఱ వైచియుఱికయొఱయె
పట్టె మనుచుఁ గేలఁబలుమాఱుజళిపించెఁ, గెలని ప్రజలుగాంచి(కెరలి)నవ్వ.

గీ. అనికిఁ దమకించు నుద్రేక మడరి యొకఁడు, వెనుకకాళ్లకుఁ గట్టినవీతినెక్కి
తఱటుచేయంగనదిబద్ధచరణమగుట, నెగయుటయకాని మ్రోలికినిగుడదయ్యె.

క. ఏనుఁగుపల్లము వాజికి, నేనుఁగునకు హయముపల్ల మిడి పల్లింపం
బూని యవిపొంకపడమికి, నానావిధవిహ్వృతి నొకఁడు నలఁకువఁ బొందెన్.

శా. వీరావేశముతోడ మోవి గొఱుకు న్స్వేదించుఁ గంబంబు ఘో
రారావంబుగ బొబ్బవెట్టుఁ బదవిన్యాసక్షతక్షోణి యై

హారంబు త్రెగి రాల మల్ల చఱచున్ హర్మ్యావళీద్వారకల్
బోరుం దల్పులు మూసి యున్నఁ జనఁ దోఁపుం జూపు నొక్కఁడొగిన్.

గీ. శూరుఁ డొకఁడిల్లు వెడల వాచూరు దాఁకి, పగిలె ఫాలంబు నిజవైరి బాణనిహతిఁ
బగులు నీరీతి నని తెల్పు పగిది నపుడు, దారుణారుణజలకణాసార మురుల.

గీ. విభుఁడు వెడలి రాఁగ వెలఁది యాతనికట్టు, చీర చెఱఁగుఁ గేల సెలకుఁదిగిచెఁ
జంద్రుఁ డస్తమింపఁ జనఁ గైరవిణి మొగ్గ, నతనియంశుకంబు నలముకరణి.

వ. ఇవ్విధంబున నయ్యూథనాథులు వివిధవిచిత్రక్రియాసనాథులై యాయుధప్రభావిభవంబున నభోమణివిభావిభవంబు నవరోధింపఁ గంపితకరవాలురై వాకిళ్లు వెడల నేరక యిఱుకటంబులకు నోడి కోటగోడలు డిగనుఱికి యురక యురుగువారును బాదంబుల బొమిడికంబులును శిరంబుల జోళ్లును బొదివి వికృతవిహారులై కరవాలధారల నెదురైనవారల విదళించుచు నిది త్రోవగా దిది త్రోవ యగు ననువివేకంబు జాఱి వీరావేశకలితహృదయులై పతి నెదురువారును నంగంబుల శృంగారం బర్ధం బంగీకరించి చేసిన విసరూపుల నెసంగువారు నై వీరు లుగ్రాకారులై యేనికపీఁకు వెడలి పుడమితేసిం గదిసి రట్లఖిలసైన్యసమేతుండై ధృతరాష్ట్రసుతుం డర్ధయోజనమాత్రంబు చని పత్రిరథపుత్త్రు నిజపుత్త్రికాహరణముదితహృదయుం బొదివెం బొదువుటయు. ౧౨౫

—సాంబుని దుర్యోధనాదు లెదిరించుట—

గీ. సాంబుఁ డపుడు నిజబలంబుల లక్షణ, కన్యకామణికిని గావలిడి మ
హోగ్రరోషరేఖ నొకరుండ రథమెక్కి, యెదురు నడిచె శత్రుభిదురలీల. ౧౨౬

క. పూనికొని దూఁదితిట్టల, పై నడరు కృశానుపగిది భల్లుకపుత్త్రీ
సూనుఁడు గవిసెం గౌరవ, సేనలపై వింటిమ్రోఁతఁ జెవుడుపడ దిశల్. ౧౨౭

సీ. ధైర్యపర్వతకూటతాదాత్మ్యమై శిరస్త్రాణంబు మణికీలితంబు దనరెఁ
బ్రబలతేజశ్చిత్రభానునిం బొదివిన ధూమధోరణి యయ్యెఁ దొడినజోడు
కఠినసత్త్వగజంబు కరమునఁ బెకలించి పట్టుసాలం బయ్యెఁ గట్టివిల్లు
వివిధసంగరకళాపశదోరగములుంచు పుట్టలై యమ్ములపొదులు వొదలె
నసమనేత్రుండు త్రిపురసంహరణమునకుఁ, గడఁగుకైవడి యదువంశకమలహేళి
యతిరథశ్రేష్ఠుఁ డరివీరహననవిహార, ణాభిముఖ్యంబు వహియించు నవసరమున.

మ. తురగంబు ల్గరులు న్రథంబులుఁ బదాతు ల్మించిన న్భూరజః
పరమాణుచ్ఛట లేసరేఁగ రవిబింబం బుజ్ఝితద్యోత మై
తెరలో దివ్వియ యయ్యె బిట్టు గదిసెన్ దివ్యాస్త్రజాలంబు లు
ద్ధురవేగంబుగఁ గల్పసంక్షయఘనస్తోమాశనిప్రక్రియన్. ౧౨౯

క. కురుబలవిలయాంబుధికిని, హరిసుతుఁడు మహావరాహ మగుటనొ దంష్ట్రాం
కుర మయ్యె విల్లు నిగిడెను,శరములు మై విద్రుప రాలు జలకణము లొకో.

క. కరిబృంహితరథఘుంకృత, హరిహేషాదికరవంబు లన్నియు నడఁగెన్
హరిసుతునివింటిమ్రోఁతలఁ, గరువలి యురగాధిపతిముఖంబులఁ బోలెన్.

వ. ఇత్తెఱంగున నుత్తరించి యప్పంచశరసహోదరుండు దుర్యోధనవరూథిని
నిరోధించిన న్విరోధించి కల్పాంతకుపితకృతాంతాకారుం డై తేరు దఱిమి
విల్లుఱుము లుమియ నమేయంబు లగుశరనికాయంబులు దొరఁగించినం
గుంభకూటమ్ములు వగిలి కొమ్ములు దునిసి కరంబులు తెగి చరణంబులు
విఱిగి ఝంఝానిలవిశకలితవలాహకవ్యూహంబులుం బోలెం బుడమి నొర
లుచు నొరఁగుకరిఘటలును నిటలంబు లవిసి నెన్నడుములు వ్రస్సి వాలం
బులు సీలి మోరలు ముడింగి బెడంగు దప్పి కుప్పఁగూలిన పోలు తురం
గంబులును, ఇరుసులు విశీర్ణంబు లై చక్రంబులు వ్రక్క లై కూబరంబులు
రూపఱి సూతులు చదిసి హరులు గెడసి పొడ వడంగు నరదంబులును,
గపాలంబులు విపాటితంబు లై కడఁతలు పెటిలి కరంబులు జర్జరితంబు లై
కాళ్లు వ్రాళ్లై కరవాలకుంతముసలముద్గరగదాదిచ్ఛేదంబులతోడం గమరిన
భటసముదయంబునుం గలిగి నెత్తురుల యొత్తరంబు *మెదడుల పొదువును,
నెమ్ముల దుమ్మును గండల మెండును నొండొంట నిండఁ గంకాళగృధ్రగరు
త్సమీరప్రేరితంబు లై చామరచ్ఛత్త్రావయవంబులు పాయవడం గటకగ్రై
వేయకేయూరాదులం బెల్లు డుల్లు మణిపల్లవంబులు భల్లంబుల పెల్లువ
యనుచిత్తజల్లునకుం బ్రథమరూపకంబు లగునింద్రగోపకంబు లై దీపింపఁ
దత్ప్రతాపబడబానల జ్వాలలకుం గల్లోలమాలి యయ్యునుం గురుబలంబు
చలంబునం బోక పెనంగునవసరంబున. ౧౩౨

క. శంఖధనుర్గుణనిజరథ, పుంఖితఘోషంబు దిశలఁ బొదువఁ బలభు
క్త్రంఖాణహితసుతుండరి, శంఖమహాశంఖములను సమయించు ననిన్.

---

*నెరదుల.

గీ. లాచి యొకని గళము లక్ష్యంబు గావించి, గాఢముష్టి నేయఁ గత్తివాతి
వెడఁదతూఁపు ద్రుంచు వేవురతల లిట్టి, వింటివాని నెందు వినుట గలదె.

గీ. బలియుఁ డతఁ డేయు నెఱవాతిములుకు లదరి
మించి నడుములు రెండుగాఁ ద్రుంచి చనిన
ధార గానఁగరా దసృగ్ధార గాఱ
నురక ప్రాణానిలమె పోవు యోధులకును. ౧౩౫

క. అరిఁబోసి సునిశితము లగు,శరము లతం డేయ శిరముఁ జరణముఁ దొడయుం
గరము నురము దునియఁ గళే,బరములు వడఁ బవనభగ్నపాదపసమతన్.

క. తత్తఱమున నతఁ డేయఁగఁ, దత్తాదృగ్విశిఖశిఖరదళితము లగుచు
న్మత్తకరికుంభకోటులు, ముత్తియములవాన గాటముగఁ గురియించున్.

క. హరినందనశరముఖజ,ర్జరితాంగము లగుచుఁ గూలు జవనాశ్వము లు
ద్ధురమృగభుజ్నఖరదళిత, శరీరగవయానుకృతిని సమరధరిత్రిన్. ౧౩౬

చ. పృథుభుజుఁ డమ్మహారథుఁడు పెక్కుశరంబుల నుక్కు సూపిన
న్రథికసహస్రము ల్వడియె రథ్యము లన్నియు మిథ్యయయ్యె సా
రథులు పరాసు లైరి నవరక్తనవాభ్యుదితోగ్రరేఖలం
బృథివియుఁ దొప్పదోఁగె సురబృందము లార్చె నభఃస్థలంబునన్. ౧౩౭

వ. వెండియు నక్కోదండవిద్యాకుండలికుండలుండు కుండలితధనుర్ధరుం డై చం
డకిరణమండలంబు గనినకొండొకలుం బోని కాండప్రకాండంబు లొం
డొండ నిగిడించుటయు నజ్జిగితూఁపు లేపు రేఁగి తెలిదమ్మివిరుల వెలివైచు
కలహంసంబుల వైఖరి చిత్రధవళచ్ఛత్రంబు లుత్తరించుచుఁ, గాశకుసుమ
విసరంబులం గసిమసంగు సుగకరువలివిసవిసల పరువునఁ జామరంబులఁ బో
మీటుచు, ధవళోరగంబులం గబళించు గరుడంబులనడువునఁ దోరంబు
లగుహారంబులఁ ద్రెంచుచుఁ, బువ్వుఁగొమ్మలు దెగవైచు కుఠారపాణుల
కరణి వివిధభూషణాలంకృతం బగుయోధవ్రజంబు భుజంబులు దునుముచుఁ
గరికపోలవిపాటనమహావిహారంబులును హయహరిణవిదారణమృగాదనం
బులును శతాంగప్రతిపీఠదహనజ్వాలలును బాదాతసైకతవేదివృష్టిపాతంబు
లును నై కకుప్పు లప్పళించి గగనంబు వగిల్చి గాడ్పులం గీడ్పఱిచి ధర
ణి గెరల్చి యారపాతలపాతి నూతన రక్తధారాసారంబులచేతం బాతాళఫ
ణాధరభామినీకుచకుధరకూటంబులం బంకజరాగరత్నమాలికల పోలిక లై

ఘనీభవింపం జేయుచు మంచిచీఁకటులు పుట్టించుటయుం గాండిశీకంబు లై కౌరవానీకంబులు కరవాలంబులు విఱిగియుఁ గత్తులు ముత్తునియ లయ్యును గద లదవద లయ్యును గడలు గెడసియు వింట్లు బెం డ్లయ్యును వంకియలపొంకంబు లడంగియును దరవారులు మురు వేదియునుఁ గాలభైరవకరాలాటోపంబున రూపఱు ప్రాణిజాలంబులీల నిస్త్రాణంబు లై తలలు వీడియుఁ దప్పుతప్పు లాడియుఁ దడంబడియుఁ దత్తఱించియుఁ దెరలి యు మరలియు నలిచియు ప్రేఁగు గఱచియుఁ బఱచిరి యందు న్గొక్కొందఱు పోక నిలిచి పెలుచందనంబున ననేక ప్రహరణ ప్రవాహంబులం బ్రవాహగర్భిత మహాకారునింగాఁ జేయుటయు నాకుమారకేసరి యాశాపూరకంబుగా ఘోరాంబుదధ్వని చూపి చాపజ్యానాదంబు త్రిదివపురంధ్రీశుద్ధాంతసౌధ గవాక్షంబులఁ బ్రతిశబ్దంబులు పుట్టింప నుట్టం దఱిమి మొగు లుఱిమిన పొచ్చున నార్చి యర్చిష్మజ్జ్వాలాసఖంబు లగునానావిశిఖంబుల నవ్వీరవరులం జేఁటుటయు నగ్గాయంబులు తత్తాయంబు లనుకాసారనికాయంబులకు నభినవకహ్లారకోరకోదయం బయ్యె నయ్యెడ. ౧౮౦

చ. తెరలినసేనల న్వెఱపుదీఱిచి యొయ్యన నాలుకొల్పుచుం
గురువరనందను ల్సమరకోవిదు లయ్యునరాజు మున్నుగా
శరమయవృష్టి ముంచి రఱజాము యదూత్తమునిమీఁద నాతఁడుం
దిర మయి నిల్చె మంచునకుఁ దీల్పడునే రవిబింబ మెయ్యెడన్. ౧౮౧

క. తనతమ్ము సూతు నరదం,బును హయములఁ గాచి శార్ఙ్గిపుత్త్రుఁడు వొల్చెం
బెనుమొగులుతోడి గుణగ,ర్జనజర్జరితంబు గాఁగ జగ మఖిలంబున్. ౧౮౨

మ. కరిగాత్రంబులు చించి యుబ్బిచనుచుం గంఖాణరింఖ ల్ధరం
దొరుగం జేయుచుఁ బుష్కరాథరథపంక్తు ల్ద్రుస్సి తూటాడుచుం
బురుషశ్రేష్ఠుల సింహవిక్రముల రూపు ల్మాపుచుం గౌస్తుభా
భరణప్రోద్భవుతూపు లద్భుత మొనర్పం జాలె దివ్యాలికిన్. ౧౮౩

క. పటపటయ లయ్యెఁ బడగలు, విఱిగిపడియె గొడుగు లఖిలవీరులసొమ్ముల్
నుఱుమయ్యె నాయుధంబులు, నఱిగె నవనిదొప్పదోఁగె నరుణాంబువులన్.

వ. ఇవ్విధంబున వివిధవాదిత్రఘోషఘోరగర్జితంబును గరాళకరవాలపటల తటిదలంకృతంబును శరాసారోదారంబును నైనకౌరవసేనావారివ్యూహంబును నిజాశుగవేగంబునం బఱపుటయు నందుఁ గొందఱు యోధు లై దుస్సాధు లై పంబి జాంబవతేయుం బొదివి. ౧౮౪

క. సారథిపై హయములపైఁ, దేరిపయిన్ యాదవాబ్జతీవ్రాంశునిపై
నూరక కురిసిరి బాణా, సారము జలరాశిఁ గురియు జలదములక్రియన్.

క. సాంబుండు గినిసి తద్విశి, ఖంబులు ఖండించి వారిగాత్రంబులు రం
ధ్రంబులుగఁ జేసె వజ్రము, ఖంబులునుం బోని కనకఖచితాస్త్రములన్.

క. కొందఱు వింట్లను విఱిగెం, గొందఱకంటకము లఱిగెఁ గొందఱయలుఁగుల్
ద్రుంచె మఱియొక్క కొందఱ, కుం దనువులు సిరిగె నతనికోలలచేతన్. ౧౪౮

వ. అప్పు డాదుశ్శాసనదుర్మర్షణదుష్ప్రహులు దక్కం దక్కిన మూఁక లన్నియు వెన్నిచ్చుటయును. ౧౪౯

క. ధీరుం డవ్వీరుఁడు కం, ఠీరవనాదం బొనర్చె డెందంబులు మూ
ర్ఛారసమగ్నము లయ్యెం, గౌరవులకు విదితసత్త్వగౌరవుల కనిన్. ౧౫౦

సీ. దుశ్శాసనుని రెండుతూపుల నొప్పించి దుష్ప్రహు నొకకోలఁ దూలపఱిచి
దుర్మర్షణుని మూఁడు మర్మభేదశిలీముఖము లేసి మేన రక్తములు దొరఁగఁ
జేయుటయును వారు సింహనాదవిశీర్ణదశదిశాభాగు లై దట్టకెంపు
కన్నుల జనియింపఁగా నోరి పడుచ నీకింతేల యని బిందు లెక్కవెట్టి
యైదు నాలుగు నాఱును నంబకములు, సాంబుపై నేసి సూతురథంబుహయచ
యంబుఁగప్పిరి నలువదియస్త్రములఁ దశాసుగములను షోడశోగ్రాస్త్రములను.

క. ఆవేఁక కలిగి జాంబవ, తీవల్లభనందనుండు తెగనిండ ధను
ర్జ్యావల్లిఁ దొడిగి శితబా, ణావళిఁ దొరఁగించె దుష్ప్రహాదులమీఁదన్.

వ. తొరఁగించుటయు నవ్విపాతంబులు. ౧౫౩

చ. తనువులు చించి కేతువులు దంచి హయంబుల నొంచి కేలిబ
ల్ధనువులు గీసి జోళ్లు శకలంబులు చేసి సమస్తసూతులం
దునుకలుగాఁగఁ గోసి యతిదుస్సహవేదన నొందఁజేయ వా
రనిపని మాని ముక్తరథు లై చని రర్కజుఁ డున్నచోటికిన్. ౧౫౪

వ. ఇట్లు కురుకుమారమానమర్దనదుర్దాంతుం డగుజనార్దనకుమారుండు త్రిపురసంహారవిహరణహారి యగుహాలహాలగ్రీవుండునుం బోలె వెలుంగుచుండె నంత. ౧౫౫

## —। కర్ణునకు సాంబునకు యుద్ధము ।—

క. యువరాజు విఱిగి వచ్చిన, రవితనయుఁడు యదుకుమారరత్నముఁ బొదివెం
దివిరి నభోరత్నముపైఁ, గవియుతమం బనఁ జమూనికర మెసఁగంగన్,

క. తురగస్యందనభటకరి, పరివృతుఁ డైనట్టి కర్ణు వాఁడిమి లవముల్
సరకుగొనఁ డతఁడు మెఱుఁగుడుఁ,బురుషులుశశినేమి సేయుఁబున్నమ రేలన్.

ఉ. కర్ణునిసేన త న్బొదువఁగా మణిపుంఖసమీరవిస్ఫుర
త్తూర్ణిశరాగ్ని నాతఁ డెసగ్రమ్మఁగఁ జేయుడు లీలఁ దత్సమూ
హార్ణవ మింకె బాడబశిఖాహతవారిధిలీలఁ బద్మినీ
పర్ణవసత్పయఃకణవిభాతి జగంబులు దూలె నన్నియున్. ౧౮౮

క. ఆరాధేయుఁడు క్రోధర,సారంజితనేత్రుఁ డగుచు యాదవకులకం
ఠీరవము తేరికిం దన, తే రభిముఖముగ నొనర్చి ధృష్టతఁబలుకున్. ౧౮౯

శా. ఈహీనంపుబలంబులం దునిమి నీ కే లుబ్బ భల్లూకరా
డ్దౌహిత్రా విను భల్లుకంబు చెదలుందండంబులన్ మ్రింగి యు
త్సాహంబుం బచరించుఁగాక మదహృద్యత్కుంభికుంభస్థమాం
సాహారోగ్రవిహారకేసరికిశోరాటోపముం జూపునే. ౧౯౦

చ. అన నతఁ డాతనిం బలుకు హా తెలిసె న్వివు సూతపుత్ర నీ
కెనయునె జోడు మేన వలయే తగుఁ డ్రెడ్డటువెట్టి విల్లుచే
నునిచితి వేల యెవ్వ రిఁక నోడలు దొప్పెద రన్వయార్హ్మవ
ర్తనల నదీనులై నడుపరా నినుఁబోలు సుధీవరు ల్భువిన్. ౧౯౧

గీ. అనుచు నాక్షేపములు పల్క నర్కసుతుఁడు
నర్కశశిలోచనసుతుండు నహాహ చేయుఁ
జేయి వ్రేసినఁ జప్పుడు చెలఁగుఁగాక
యందుఁ గల్గునె తారతమ్యంబు తెఱఁగు. ౧౯౨

శా. ఈపోల్కిం బరుసంబు లాడుచు రమాధీశానపుత్రుండు రా
ధాపుత్రుండును విండ్లమ్రోఁతలు సుధాంధఃపద్యఁ బర్వంగ బా
ణాపాతంబుల భీతచిత్తులుగఁ జేయంజాలి రీక్షించు కాం
క్షాపూర్తిన్ దివి దన్నియున్న దివిషద్గంధర్వయక్షేశులన్. ౧౯౩

సీ. తనవలుఁగాల్గులను దలఁ బొట్టలోఁ జొన్పెఁ గదలక శాంబరీకచ్ఛపంబు
భోగంబులు ముడించి బొక్కలు చొరఁబాఱెఁ బవనపారణలోకపరివృఢుండు
దానధారాసముద్రము లింకఁగాఁ గాడి నెఱియలువాఱె దిక్కరికటములు
సీలంపుగవిసెన నించినమించుటద్దపుఁబిల్ల వోలెఁ బద్మప్రియుండు

తార లుడివోయె గగనకాంతారవాటి,గిరులవని౯ గేలికందుకాకృతివహించె
నంగరాజు ననంగప్రియానుజుండుఁ, గెరలి పోరాడు నుద్భటక్రీడఁ దలఁకి.

చ. పడగయు విల్లుఁ ద్రుంచె హరిపట్టి యినాత్మజుఁ గిట్టి కర్ణుఁడుం
బడగయు విల్లుఁ ద్రుంచె మధుభంజనసూనుని ముట్టి వేఱ బ
ల్పడగలు విండ్లుఁ దేరులును బాణిపుటంబుల నుండఁ జేసి ర
క్కడిదిబలాధికు ల్పటనికాయము సొంపున నేర్పు పెంపునన్. ౧౬౫

క. చిందంబులు పూరింతురు, డెందంబులు వగులఁ గడువడిగ నార్తురు మా
కుందియు నిందీవరరిపు,నందనుఁడును విశిఖవిహితనానాదిశులై. ౧౬౬

క. నలుఁదూపు లేసి కర్ణుఁడు, చలియింపఁగఁ జేసె సాంబుసారథి నతఁడు
న్నలుఁదూపు లేసి యాసుసఁ,జలియింపఁగఁ జేసె సూర్యసంభవసూతున్.

క. ఉర మేయుడు నుర మేయుచు, శిర మేయుడు శిరము నేసి చెలఁగుచుఁ గలహిం
చిరి సాంబకర్ణు లిరువురు, గిరులు గిరులఁ గేసరులును గేసరులు ననన్.

క. ఆలోఁ గాలానలకీ,లాలీలాశాలి యయి వెలయు తూపున న
బ్బాలకు ఫాలము నూతకు, లాలంకారము వగిల్చి యార్చిన నతఁడున్.

క. కర్ణునికర్ణాభరణముఁ, గర్ణాంతాకృష్టఘోరకార్ముకుఁడై యా
యర్ణవశయనాత్మజుఁడు వి,శీర్ణంబుగఁ జేసె నిశితశిఖరాస్త్రములన్. ౧౭౦

గీ. రథములును రథ్యములుఁ జక్రరక్షకులును
సారథులు గాసిఁబడ సాంబసవితృసుతులు
పోరి రాలోనఁ గర్ణుఁ డంభోజనాభ
పుత్రుపై నల్గి బాణముడి పొడమ నుదుట. ౧౭౧

ఉ. ఈసువహించి యగ్నిశర మేయుడు నవ్విశిఖంబు పేర్చి యా
ర్యాసఖఫాలభాగజనితానలకీలలువోని వహ్ను లు
ద్భాసితలీల నీనుటయుఁ బద్మదళాక్షతనూభవుండు న
త్రాసమనస్కుఁడై జలధిరాజశిలీముఖ మేసె నేసినన్. ౧౭౨

క. ఆయాగ్నేయాస్త్రముఁ ద,త్సాయకము హరించి భువనశాంతి యొసఁగ రా
ధేయుఁ డజేయబలోద్ధతి, వాయవ్యాస్త్రము యదుప్రవరుపై నేసెన్.

గీ. ఏయుటయును దాన నెల్లశైలములకు, సివము పుట్టె దిశలు చెవుడుపడియె
నర్ణవములు గలఁగె నవనియు దిద్దిరఁ, దిరిగెసాంబుఁడొకఁడ తెరలఁడయ్యె.

క. ఆయమ్ము భుజగశరహతి, మాయించిన నలిగి భానుమత్సూతి తమ
స్సాయకమునజగములుగను,మూయుటయునుసాంబుఁడలుకమోముననిగుడన్.

గీ. భాస్కరాస్త్ర మేసి ప్రభలు వర్వఁగఁ జేసి, చీకువాలుటమ్ము వీఁక చెఱిచె
హరిపదాబ్జభక్తి నజ్ఞాన మెడలించి, బోధ మొసఁగు సాధుబుద్ధి వోలె. ౧౭౬
క. ఏయస్త్ర మేసెఁ గర్ణుం, డాయస్త్రముఁ దద్విరోధి యగునస్త్రమునన్
వే యడఁచె సాంబుఁ డచ్చెరు, వై యుండెం దత్ప్రభావ మఖిలంబునకున్.
శా. అంత న్యాదవపుంగవుండు యమదంష్ట్రాభీలనానాశుగా
క్రాంతి న్భాస్కరసూతిఁ గప్పుటయు వి ఖండించి మై చించి యిం
తింతల్గా మణికేతువుం దునిమి తే రిట్టట్టుగాఁ జేసి వి
భ్రాంతి న్ముంచెఁ దదస్త్రవహ్నికణము ల్రాధాతనూసంభవున్. ౧౭౮
క. మతిఁ గలఁగి తేరుడిగి యిన,సుతుఁడుఱికెమ్రుగేంద్రుకడిమిసుశీసియునొకసం
గతి బ్రదికి పఱచుకరిక్రియఁ, గుతలమద్రువ గగనచరులుకోయనియార్వన్.
సీ. ఎవ్వాఁడు జనియించె నెల్లలోకములకుఁ గన్నైన పద్మినీకాంతువలన
నెవ్వాఁడు నేరిచె నిషువిద్య లన్నియు హైహయభేకకాలాహిచేత
నెవ్వాఁడు పాయనిహృదయశల్యం బయ్యె రాజసూయాచారరాజితునకు
నెవ్వాఁడు విశ్రాణనేందిరాదేవత వసియింపఁ బద్మనివాస మయ్యె
నంతవాఁడును నని నొకయింతవాని, చేత నభిమాన ముడివోయి చెదరిపఱచెఁ
బిన్న పెద్దనరాదు గెల్పింప నోడఁ, జేయుటకుఁ గర్త యీశ్వరచేష్టితంబు.
క. కులనగముఁ దఱిమి నిలిచిన, కులిశాయుధమూర్తి వోలె గోవిందసుతుం
డలఘుబలదళితశాత్రవ,కులుఁ గర్ణుని దఱిమి ప్రమదగుంభితుఁ డయ్యెన్.
శా. నిశ్వాసం బఱ నిక్కి యంగకముల న్నెత్తుర్లు గ్రమ్మంగ న
స్త్రాశ్వప్రోద్భవుఁ డేగుదెంచుటకు నత్యాశ్చర్యనిర్మగ్నుఁ డై
యశ్వత్థామ బలాభిరామముగఁ దూర్యశ్రేణి మ్రోయంగ న
వ్విశ్వాధీశ్వరసూనుఁ దాఁకె భువనోద్వేగావహాహంకృతిన్. ౧౮౨

—( కర్ణుఁడు పాఱిపోయిన, నశ్వత్థామ సాంబునెదుర్చుట )—

క. గురుపుత్త్రుబలము త్రిభువన,గురుపుత్త్రుని బొదువుటయును గోదండకలా
పరమేష్ఠి యతఁడు నానా,శరముల నుఱుమాడె నహితసైన్యము నెల్లన్.
సీ. ఉరములు భేదించె నొకకొన్ని వే ఱొకకొన్ని శిరంబులఁ గూలఁ ద్రోచె
భుజదండములు కొన్ని పొడిపొడిగావించెఁ బదము లొక్కొకకొన్ని చిదిమివైచె
నొకకొన్ని బరిమెమ్ములుతకనుగ్గుగనొక్కెఁ గొన్నిచన్నులపైఁ గుదురుకొనియె
నూరుకాండంబుల నొకకొన్ని చక్కాడెఁ గటిఅంతరంబులఁ గాఁడెఁ గొన్ని

ప్రళయజలధరగళితనిర్ఘాతపాత, పాతములు జాతవేదప్రపంచవంచ
కప్రభలుగల్గుయదుకులాకల్పముక్త, బాణములుద్రోణిపురికొల్పుబలముఁబొదివి.

క. సారథుల రథులఁ దేరుల, వారువముల వారణముల వసుమతిఁ గూల్చెన్
ధారాశుద్ధము లగున, న్నారాయణతనయునిశితనారాచంబుల్. ౧౮౭

ఉ ఎత్తినభీతిమై బలము లేపఱి తూలిన ద్రోణి యాగ్రహో
యత్తమనస్కుఁడై యరద మమ్మహిమాధికుమీఁదఁ జొన్పి తే
లత్తుకచాయ కన్నుఁగడలం గడలొత్తఁగ నూర్పువేఁడి మి
ట్టొత్తడిసేయఁ బల్లు నొకయుగ్రశరంబు గరంబుఁ గూర్చుచున్. ౧౮౮

క. కల్పాంతకీలికీలా, కల్పము నిదె చూడు నాదుకాండ మురగరా
డ్తల్పసుత చంద్రలేఖా, కల్పుఁడు నిటు చూచెనేని గనుమూయుఁ జుమీ.

గీ. చేయరాని చేతఁ జేసి వెండియు నిట్లు, చెప్ప కరుగు దెంచి చెలఁగె దహహ
యీమహాస్త్రమునకు సెఱ గాఁగ నినుఁ జేసి, కౌరవేంద్రుమనసుకలఁకఁ దీర్తు.

ఉ. నావిని యాతఁ డిట్లనియె నవ్వుచుఁ దావకబాహుశక్తికిన్
భావమునందు నే వెఱవ బ్రాహ్మణతాగరిమంబు చూచి కా
దే వెఱపయ్యెడు న్నిను మదాశుగలక్ష్యము సేయ నన్న భూ
దేవకులోత్తముం డలిగి దీప్తబలోదయమాననమానుఁడై. ౧౮౯

ఉత్సాహ. కురిసె భానుభానుతులితఘోరవిశిఖవృష్టి ని
ర్భరకఠోరగుణవిరావపాటితాఖిలాశుఁడై
కురియుటయును శరవిహారకోవిదుం డతండు వే
తెరలఁజేసె శరసమీరధిగధిగన్మహాగతిన్. ౧౯౦

చ. తెరలిచి ద్రోణిపైఁ బఱపె దేవకిమన్మఁడు గ్రీష్మకాలభా
స్వరకరకాండచండతరకాండము లుగ్రధనుర్గుణధ్వనుల్
హరిదవధిద్విపేంద్రకరటాంతరభృంగకులంబుఁ జోప బె
ట్టరదము చిత్రవిభ్రమణహారిగతి న్నలుదిక్కుఁ ద్రిప్పుచున్. ౧౯౧

క. శాతతరసాంబవిశిఖ, వ్రాతంబునఁ జిక్కి స్రుక్కి వలలోపులుఁగై
యూఁతం గ్రమ్మిన మీనై, గౌతము...... ౧౯౨

వ. ఇవ్విధంబున నిప్పుఁ జెద లంటుట యుం బిడుగులు పిడికిట నడఁగుట యు
నైన నత్యాశ్చర్యధుర్యం బయ్యె నంత నాయా.........చ్ఛనికరంబులు
తుత్తునియలు కావించి యుదంచితరోష హాసభాసమానుం డై శంఖంబు

పూరించి సింహనాద......భుటు లాఘవలక్ష్యశుద్ధు లేర్పడఁ జేయుటయు
నాదర్పకానుజుం డవియును నవలీలం దునిమె నంతకు మున్ను వె......
మానంబు వాటించి యమ్మేటిమగనికి బాసట యై యమ్ముం గోలసేయుటయు
నలిగి యాలో నబ్బాలకుండు. ౧౯౩

చ. ముస న్గురుపుత్రుచేతిబ
ల్విలు దునుమాడి వేఱొక శిలీముఖముం బరఁగించి బిట్టురః
ఫలకము నాట నో
జలజము నిర్గ జాలుసురందరసంబు కైవడిన్. ౧౯౪

క. కొండొకవిలుగొని యవ్వీరుం డతని
కాండములు నొవ్వనేయఁ బ్రచండామర్షమున వృష్ణిచంద్రుఁడు నగుచున్.

క. గురుసుతుసారథి మూర్ఛిల, హరులతను
రురులఁగ శరీరకీలకశుక్రతరువున ననలెగయ నేసెఁ దాదృక్ఛరముల్.

క. ఆయశ్వత్థామ శిరస్త్రోయరుహము మెచ్చు మై విఘాతముగఁ దటి
చ్ఛాయాదాయాదము లగు, సాయకముల మూర్ఛ దేల్చె జాంబవతేయున్.

వ. ఇట్లు సాంబుండు పొరుగు నాలో నమ్మేటి కంకటాంతరధారి యై సారథిం బ్ర
చోదించునంతన సిద్ధాంతదర్పణప్రియశిష్యుండు మూర్ఛదేటి తేరిమీఁదఁదిన్న
నై నిలిచి పొలిచి వికటభ్రుకుటిఘటితనిటలుం డై ఘటసంభవసంభవుంగనుం
గొని బెట్టు గిట్టి. ౧౯౫

సీ. కాలదండాకారకాండాష్టకమున ఖండించె సింగ పుఁదోఁక టెక్కెంబుఁ
దేరివాహమ్ముల దేహంబు లాఱాఱుశరముల నొంచె నెత్తురులు గురియ
సారథి నధికమూర్ఛాతమంబున ముంచె మించి నాల్గమ్ముల మేనఁ జొనిపి
యరదంబు నలువదియంబకంబులఁ గప్పె నెక్కడ డెక్కడ యని చెక్కలెగయ
విల్లుఖండించె జ్యాఘోషవిహృతి చెలఁగఁ, గుశకుమారసమానవల్గుప్రచారుఁ
డై నయవీరుఁగొనియా జెనమరమాని, ద్రోణనందనుఁడప్పుడత్యుగ్రుఁడగుచు.

గీ. శమనదండసమం బైనశక్తిఁ బరఁగ
వైవ నవ్వీరుఁ డదియును వమ్ముచేసె
గదఁ బ్రయోగింప సాంబుఁ డగ్గదయుఁ దునిమె
బాణసంధాన రేఖాప్రవీణుఁ డగుచు. ౨౦౦

వ. ఇట్లీశ్వరసంభవుం డగునశ్వత్థామ నిస్సీమం బగుతనపరాక్రమంబు వక్రిమ వహించుటకు సహింపక గాంధర్వి యగుమాయం బ్రయోగించిన జగం బంతయు నంధకారమయం బయ్యె దానివలన నుల్లోకంబు లగు భల్లూకంబులును నుర్వీధరనిభంబు లగునిభంబులును నుగ్రకంఠారవంబు లగుకంఠీరవంబులును నుత్పాతితజగద్వేదనంబు లగుమృగాదనంబులును నుత్పాతకేతుభీమంబు లగుసర్పస్తోమంబులును మున్నుగాఁగఁ గ్రూరసత్త్వంబు లుప్పతిల్లి యాబల్లిదునిఁ బొదువుటయు నతం డఖండప్రభావనిష్ణాత యగువైష్ణవమాయం బ్రయోగించిన నందువలనం దాదృశంబు లగుహింస్రంబు లుద్భవిల్లె నయ్యిరుదెఱంగులకు ననన్యజన్యం బయ్యె నయ్యెడ. ౨౦౧

సీ. గంధాంధగజఘటాఘుముల యొత్తడికోర్వ కఖిలదిక్తటులు నట్టిట్టు చనఁగఁ
దురగపరంపర గొరిజరాయిడి నుల్కి మేదిని రేణువై మిన్నుఁ బ్రాఁక
రథపతాకాచామరంబు లంబరనదీజలములఁ దలలపైఁ జల్లుకొనఁగ
భటహతిఁ గాళిమ ప్రబలినై ముంప హేళిం బొగలొంది స్ఫులింగములను
దూరమున నల్పగతిఁ దోఁచి తోన కదియఁ
దమయథాస్థితిఁ గనుపట్టి దాఁటి మరలి
చూడ శైలవనాదులు సూక్ష్మములుగ
నరుగు హాలితేరుఁ బొదివి సైన్యములు నడచె. ౨౦౨

—॥ బలరాముఁడు సాంబునికడకువచ్చుట ॥—

సీ. కవిసి దిక్కుకు రాళి గవిసెనలకుఁ దార్చె దివి దన్ని పెందూళి తిరుపుగట్ట
జలధిఘోషము గ్రింగి శైలగుహలఁ దూర్యకోలాహలము పల్లటీలుగొనఁగ
నిభమదవాహిను లేఱు లన్నియు దాఁటి పుడమియవ్వలికడఁ బుటముచూప
భటరోషశిఖి శిఖిప్రభల గ్రింగి బలారికులిశధారలమీఁదఁ గోపులెత్తఁ
జనియె నంభోజసంభవసర్గదివస, సంభవత్ప్రాణిసమ్మర్దసన్నిభంబు
భద్రశౌర్యోగ్రుఁడగుబలభద్రుబలము, పురుషజయరేఖహస్తినాపురమునకును.

వ. తదవసరంబున నట్లు యదుమహర్తికప్రయత్నవైష్ణవ మాయ నిజమాయను మాయించుటయు నుం జేయునది లేక యాకలశసుతసూతి విలయపవనప్రేరిత కులశైలశిఖరంబు కరణిం దెరలి పఱచుటయుం జటులపరాక్రమక్రీడావలంబుం డగుసాంబుండు కంబుధ్వని జ్యాఘోషశోషిత సప్తానిలస్కంధబంధురం బై నిజరథ్యసారథిరథంబుల నశిథిల సన్నాహముహితంబులు గావించి

వెన్నడించి యొక్కసమస్థలంబున నిలిచి చెఱంగు విసరి వీరులం బోరికి రమ్మని పిలుచుచు బాలస్త్యమూలబలసంహారం బొనరించిన నాఁటి తాటకారియుం బోలె వెలింగె నట దుర్యోధనవరూథినియు నప్పురుషవృషభు నతిమానుషపౌరుషంబునకు వేసవిమఘవువడువున మానసంబు లింకం బఱకించుచు నుండెఁ దనకొడుకుపరాభవంబునకుం గనలి ద్రోణుండు కుపితస్వాంతుండునుం బోలె నాగ్రహించి యరుణతురంగమ వల్గువల్గన చటులంబును హాటకవేదికాలంకృత ధ్వజపతాకారాజితంబును నైన మహారథంబు నెక్కి దిక్కులు వ్రక్కలుగా గుణధ్వనినాదంబుగ నార్చుచుం బేర్చి దర్పంబునం జనుదెంచి గాంగేయబాహ్లిక భూరిశ్రవః ప్రముఖులం గలపికొని చతురంగసహస్రసంకులంబుగ రాజుం బరివేష్టించి యనికిం గవియించె నాలోన.

౧. పగటఁ జీఁకటిచేసెఁ బ్రాణిలోకములకు విశ్వవిశ్వంభరావిపులధూళి
మనుజసింహము గన్న దనుజసభాస్తంభముఃరవంబులను దూర్యములు చెలంగెఁ
గ్రమ్మి తేజఃసృష్టి గావించె నఖలంబు కరవాలవల్లికాగాఢరుచులు
జడివాన గురియించెఁ జటులమత్తేభరాడ్గండస్థలీదానకర్దమములు
రథపతాకలు చుక్కలు రాల్పఁ దొడఁగె, సెలసె వీరరసాబ్ధివీచికలుహరులు
రౌద్రరసశాలి యై బలభద్రుఁ డనుజ, తనయుదగ్గఱవచ్చుతత్సుయమునను.

౨. అదె భూరేణుప్రతూర్యఘోష మదె దీవ్యన్నవ్యశస్త్రాగ్ని య
ల్లదె మాతంగశతాంగసప్తు లవిగో నాఁ బర్వెఁ బాదాత మ
ల్లదె యావచ్చు మహారథంబు పయిఁ జంద్రాకారముం బోలె నే
మెవియో యొక్క మహామహం బడరెఁ గాదే సీరి వీఁ డారయన్. ౨౦౬

. తాళధ్వజ మదె యగు నగుఁ, దాళాంకుం డనుచుఁ జాలఁదలఁకి కురుమహీపాలునిదళములు భయరస,కోలాహలతరళితముగ గుజగుజ యోయెన్. ౨౦౭

. అకలకల మాయదు సే,నాకిలకిలములు నెటింగి నరపతి చింతా
వ్యాకులుఁ డగుటకు భీష్మం, డా కౌరవవర్యు నిట్లు లను ధీరుండై. ౨౦౮

. కౌరవనాథ యేఁ గలుగఁగాఁ గలశీతనయుండు గల్గఁగాఁ
బౌరుషసవ్యమూర్తు లగు బాహ్లికముఖ్యులు గల్గి యుండఁగా
నూరక కుందె దేటి కిది యోధులచందమె సీరసాధనున్
వారణచేసి సాంబు నని వ్రాలిచి లక్షణఁ దెమ్ము క్రమ్మఱన్. ౨౦౯

క. అరదములఁ గరుల హరులం, దిరముగఁ జేయింపు వేగ ధీరభుజబలో
ద్ధురము లగుకొన్నిమూఁకలు, నరుగు మనుము సీరిఁబొమనవనదియెట్లనినన్.

సీ. దుశ్శాసనుంగూర్చి తొమ్మిదివేలు నేనుంగులు లక్షతురంగమములుఁ
బదివేలు రథములుఁ బాదాతకోటియుఁ బెడతలవీఁకగాఁ బెట్టి యనుపు
మంతియ యైనసైన్యము సుశర్మనుగూర్చి పనుపుము దక్షిణభాగమునకు
నుత్తరంబునకు బహూత్తమ షష్టిసహసంబు లిరువదియాఱువేలు
తేరులు పదాఱువేలుబల్వారువములు,గరులుపండ్రెండు వేలునుగౌతమునకు
నిచ్చి పొమ్మను మెదురుగాఁ జిచ్చువనముఁ,జొచ్చుగతినీవు నేనునుజొత్తమలవి.

వ. ఆచార్యుం డవార్యధైర్యంబుగ సాంబుమీఁద నరుగవలయు నది యట్టిద
యేని యట్టు నిట్టుఁ గదలనేరక సీరి సబలంబుగ వలకుం జేరినపుడుఁ గాను
నీ వతనికి శిష్యుండ వేని ప్రాణంబులు కలుగక పట్టి విడువు మను నయ్యవస
రంబున నయ్యసమశౌర్యునకు వసువులు సన్నిధి యై సఖీతాంబూలరససిక్త
రదరత్నావళి ధనురాకాంక్షం దత్తరంబు నొందుచు సకలసేనలు వినంగ
ని ట్లనిరి. ౨౧౨

సీ. సర్వసర్వంసహాచక్ర మేబలశాలిశిరసుపైఁ దిరమాటఁ జెదర దనియు
నేకాధిపత్య మై యేదివ్యమూర్తికి నారసాతలరాజ్య మమరు ననియు
సకలోన్నతుం డైన శార్ఙ్గికిఁ బాను పేపుణ్యునిదేహ మై పొదలె ననియు
హరువింటికిని మౌర్వి యై యిచ్చెనేగుణోదారుండు సంగరోత్సాహమనియు
ఎందురయ కాదె మీర లవ్విషధరాధి,రాజు నాశేషుఁడయ జగద్రక్షణార్థి
యదుకులంబున బలభద్రుఁ డై జనించె, నాతనినిగెల్వనోపఁడన్నలువ యైన.

వ. మీర లతనిమీఁద నెంతటివారలు ముందటఁ గార్యభరంబు చాల నున్నది,
యవ్వీరుం డెదురకయమున్న మరలుం డని యంతర్ధానంబు నొంది రంత
నిచ్చట. ౨౧౩

క. మునుకొని వసువులమాటయు, వినక పెనఁగఁదివురు రాజవృషభులుమదిలోఁ
బెనుదిగు లొక్కటి పుట్టినఁ, జని రెల్లరు భీష్ముఁదొట్టి సామజపురికిన్. ౨౧౪

గీ. లక్షణాకన్య పొందు దొలంగి వగవ
మూర్ఛవొందిన పురలక్ష్మి మూసెఁ గన్ను
లనఁగఁ దలుపులు మూయించె నహిపతాకుఁ
డిభపురమునకు బలరాముఁ రభస మెఱిఁగి. ౨౧౫

—॥ బలరాముఁడు సాంబుని గలిసికొనుట ॥—

చ. కురునృపకన్యఁ జౌర్యగుణగుంభితవృత్తి హరింపఁగాఁ దనుం
బొరసిన దుర్యశంబు రణభూమి గతాగతయోధయూథసం
హరణముచేతఁ బోఁదఱిమి యద్భుతశక్తి దలిర్చు సాంబునం
బరమణితేజుఁ గాంచె బలభద్రుఁడు సైన్యసమన్వితంబుగన్. ౨౧౭

క. హలి యేతెంచినఁ బ్రమదం, బొలయను హరిపుత్త్రునాత్మ యుద్ధాగతభూ
తలనాథకంఠదళనో, త్కలికాభర మెక్కు డౌటఁ దత్సమయమునన్. ౨౧౮

ఉ. కేలం బట్టినవింటితోఁ దనువునం గీల్కొన్న బల్గోదుతో
వాలుందూపులతూణియుగ్మకముతో వ్యాకీర్ణరత్నప్రభా
జాలాలంకృతభర్మనిర్మితశిరస్త్రాణంబుతో వచ్చి య
బ్బాలుం డానతుఁ డయ్యె సీరికి రిపుప్రాణానిలాహారికిన్. ౨౧౯

క. ఈకైవడి మ్రొక్కిన సుతు, రాకాచంద్రోపమాను రా రమ్మని బా
హాకులిశపంజరమున ద, యాకులహృదయముగఁ దార్చి హలధరుఁడనియెన్.

ఉ. చెల్లరె యింతసేయుదురె సింహకిశోరసమప్రచార నీ
తల్లియుఁ బౌరులు న్సఖులు దాదులు నాదిగ నెల్లవారు ఘూ
ర్ణిల్లిరి తీవ్రవేదనల నీతెలిముద్దుమొగంపు చిన్నిజా
బిల్లిని గానలేక వెఱపింతురె యీక్రియఁ గన్నవారలన్. ౨౨౧

ఉ. గౌరవహార నేనెఱుఁగఁ గాని సుయోధనకన్య నీమన
స్సారసహంసి యై మనుప్రచార మెఱింగితినేని నాఁడె మ
చ్ఛీరముఖంబుచే నడవఁ జేయనె ద్వారక కుగ్రవైరిసం
హారవిహారకారణరణాచరణస్ఫురణోగ్రమూర్తి నై. ౨౨౨

క. అని సాంబుమౌళి మూర్కొని, తను నను బరికింప కెట్లు ధౌర్త్యంబు సుయో
ధనుఁ డాచరించెఁ దనసుత, కును దగవా నీవు విమలగుణరత్ననిధీ.

క. నిను మోహించిన తననం,దన నీవిటు దెచ్చుటెల్లఁ దగుఁ దగువనితా
జనములు తారయ కామిం, చినఁ జేతోభంగ మెట్లు సేయఁగవచ్చున్.

చ. లలితగుణాంగలక్షణకు లక్షణకుం దగు దీవు నీకు న
మ్మెలఁతుక యెంతయేని దగు మీరలు మున్నొనరించునోములం
గలసుకృతంబు నేఁడు ఫలకాలము వచ్చిన సంఘటిల్లె నో
యలఘువిచార బ్రహ్మలిఖితార్థము వే ఱొకత్రోవఁ ద్రొక్కునే. ౨౨౫

క. కాదేని మనము తప్పొక, టేదేనియుఁ జేయునెడ నహిధ్వజునికి సా
మాదరణంబున మెల్లన, గా దిది యనరాదె మనసు గలసినచోటన్.

ఉ. శౌరికిఁ గూర్చునట్టి సువిచారులఁ బాండుకుమారులం దనుం
జేరఁగనీక వారలకుఁ జేటయ కోరు తను న్గదారణో
దారచమత్క్రియాచతురతాధికుఁ జేయుటఁ జేటు మాకుఁ జే
కూరెఁ గుమార కౌరవులు క్రూరులు వారలఁ గాననేటికిన్. ౨౨౭

వ. సమూలఘాతంబుగఁ గురుకులంబు గ్రొచ్చి వైచెద నిందు సగణంబులుగ లలాటలోచనుండు వచ్చినం ద్రోచెద నీవునుం దే తెక్కు మని యతనిని యోగించి సాంబదర్శనావసరంబున నాదరాతిశయంబునం జేసి యవతీర్ణుం డగుటఁ దానును నారూఢస్యందనుండై రోహిణీనందనుండు. ౨౨౮

క. సరభసగతిఁ జని సేనలఁ, గరిపురికి ద్వితీయసాలగతిగా విడియిం
చి రథంబు డిగ్గి నాఁగలి, కరమునఁ గొని నిలిచి పేఁక గమకించుటయున్.

—। బలరాముఁడు నాఁగలితో హస్తినాపురము గ్రొచ్చుట ।—

సీ. తొటతొట రాలె దిక్కటములు పేటెత్తి యందులకరులకు నణఁగె మదము
పటపటఁ బగిలె నంబరతలం బంతయు నందుల రవిచంద్రు లార్తి గనిరి
తటతట వడఁకె సంతతధారగా ధాత్రి యందుల గిరు లిట్టునట్టు నయ్యె
జొటజొట వడిసె శేషుని మేన వేచెము రంపుల కుప్పసం బవిసె నురక
సాగరోపరిసంజాతచటులరోష, ముద్రితాకారుఁ డగు రామభద్రుఁ బోలి
దంతిపురి గ్రొచ్చుటకుఁ బ్రయత్నంబొనర్చ, నాప్రలంబాసురారాతియాగ్రహమున.

గీ. యమున కొకయింత యోరఁగా నడుగు లూఁది
సాలమూలంబు నాఁగటం జాల గ్రొచ్చి
యీవ తుదఁ గేలఁ దివిసిన నీషదార్తిఁ
గ్రేళ్లుమసలుచు వెస నొడ్డగిల్లెఁ బురము. ౨౩౧

గీ. హలధరు హలాగ్రహతిచేత నంటువడలు
ధరణిసందునఁ దోఁచె నయ్యురగకులము
కదలఁ ద్రవ్వినతాపసకందమూల
వీథిఁ బోడకట్టు నందలి వేళ్ళపగిది. ౨౩౨

గీ. గర్భమున నున్న ప్రజలు వెక్కస మగుటయు
నురక తలవాంచి వెడలంగ నుమిసి పిదప

యమునలో (పలఁబడునొక్కొ) యనఁ బురంబు
మిగులఁ(గాఁ)గెడవగుచుఁ దెట్టగిలఁబడియె. ౨౩౩

క. అలకర్ణనిరథచక్రం, బిల విక్రియఁ గ్రుంగుఁ గలన నిది నిజ మనుచుం
దెలుపు క్రియయమునకుమొగమై,కలకలజనఘోషమడరఁగం బురియొరగెన్.

వ. ఇట్లకాండసంవర్తహారవిహారచండం బగు నయ్యేకకుండలు నుద్దండభుజాదండ బలపాండిత్యంబునకు నోటువడి యప్పీట నుండ నేరక సకలజనులు సాధ్వసవికారవివశకలితహృదయు లగుటయు. ౨౩౫

ఉ. ఆయెడఁ గానుక ల్గొనుచు నాత్మజబాహ్లికకుంభజన్మగాం
గేయసుయోధనాదులు ప్రకృష్టహలాంచలలగ్నమూలుఁ డై
వే యమునానదీసలిలవేశిక నప్పురిఁ ద్రోయుచున్న నా
గాయుతసత్త్వుఁ గాంచిరి మహాహవవిశ్రుతదోర్బలు న్బలున్. ౨౩౬

మ. కని యంతంతన చాఁగకట్టుగ నమస్కారంబు లర్పించి లో
చనగోళంబుల నీరు గ్రమ్మ వదనాబ్జంబు ల్గసుంగంద నో
యనఘప్రాభవ నిన్నెఱుంగని విమోహాంధాత్ములం గావు మా
పని యింకెయ్యది దేవ పిచ్చుకలపై బ్రహ్మాస్త్రము న్నింతురే. ౨౩౭

చ. కినుక మరల్పు మాపయి నొకించుక చల్లనిచూపు చూపు చే
సినయపరాధము ల్మఱచి చిత్తమున న్మము నీజనంబుగాఁ
గనుఁగొను రేవతీరమణ కంధియ మేరకు మీఱె నేని యే
యనువునఁ ద్రిప్పఁగాఁ దరమె యవ్వల బ్రహ్మకు బ్రహ్మతండ్రికిన్. ౨౩౮

క. అని పడియుండినవారలఁ, గని కరుణాహరణహృదయకమలుం డగుచుం
దనహలము దిగిచి కరిపురి, నునిచె యథాస్థానమున బలోన్నతుఁడగుచున్.

చ. అనుపమకీర్తి యాదవకులాంబుధిచంద్రుఁడు వారి గౌరవం
బునఁ (గరుణించి) తద్రచితపూజలు సైకొని వారితోడ ని
ట్లను నను మీఱు మీకు మరియాదయె నాకును మిమ్ము మీఱఁగాఁ
జనునొకొ నీరు లెం డగునె శాతకృపాణము(చేత ప్రే)సినన్. ౨౪౦

ఉ. నావిని ద్రోణభీష్ము లభిసంధ్యబలుల్ హలిఁ బల్కి రార్తర
క్షావిభవంబు దుష్టజనశాసనముం బచరింప భూమి భా
షావిభుప్రార్థన న్వఱలు చక్రికి నన్నవు నీవు (మేము) నీ
సేవకవృత్తివార మని చిత్తమున న్మముఁజూడు మెప్పుడున్. ౨౪౧

మ. కరశాఖాంబురుహత్వమూలము మణిగ్రైవేయకాంతిచ్ఛటాం
కురరేఖాకిసలంబు కీర్తిసుమనోగుచ్ఛంబు సౌభాగ్యబం
ధురతానవ్యఫలంబునై పరగు నీదుర్యోధనామర్త్యశా
ఖి రహిం జూపుఁ గదా భవద్గురుకృపాక్షీణాల(వాలంబు)గన్. ౨౮౨

క. మును సగదము చేసితి వీ,యనకర మి ప్డితని డెంద మగదము చేయం
జను నందునకు నుపాయం, బనఘా యితనింటఁ బెండ్లి యాడింపు సుతున్.

చ. (అడిగిననిచ్చు)వాఁడ తనయ న్వినయాన్వితలక్షణాఖ్య మా
కొడుకునకు న్సుయోధనుఁడు కూరిమి వెల్లువ ధైర్యసేతువుం
గడననుజేయు దానె మును కాని
యడరుట వెన్న గల్గె నిది యా నని కా దని యారయుం డెదన్. ౨౮౪

క. అన్నియు నూ నేరములందు, మన్నన నవి మఱచి నీవు మాయింటికి(నిన్)
మున్నువలె న్వేంచేయు ప్ర,పన్నుల రక్షింప నీకు భారము గలదే. ౨౮౫

వ. అనినం బ్రసన్నహృదయుండై యాసదయుండు సుయోధనావసథంబునకు సాంబసహితుండై సముచితజనపరివృతుండై చనియె సలక్షణ యగులక్షణయు సౌవిదల్లప్రయత్నంబున నిజనివాసంబు నలంకరించెఁ గలంక లుభయపక్షంబుల జనంబులకుం దొలంగె నయ్యవసరంబున. ౨౮౬

—॥ లక్షణకు సాంబునకుఁ గల్యాణము ॥—

గీ. కొలనిలో పలితోవలుఁ జెంగలువవిరులు
వెలఁది వెన్నెలఁ దిలకించువిలసనమున
లక్షణాసాంబుల వివాహలక్షణమునఁ
గౌరవులు యాదవులు వింతకాంతిఁ గనిరి. ౨౮౭

మ. కలతూర్యధ్వనిపత్త్రిఘోషము దళత్కంజేక్షణల్వ్రద్ధినుల్
చలితాగుర్వభిరామధూపములు చంచచ్చంచరీకంబు లు
జ్జ్వలభూషామణిదీప్తి చెంగలువపూజల్గాఁ బురం బొప్పగుం
గొలఁకుం బోలి వివాహకౌతుకశరద్గుంభంబు జృంభించినన్. ౨౮౮

గీ. అపుడు శుభముహూర్త మైదాఱుగడియల, కరుగు దెంచునంచు నాగమజ్ఞు
లయినవారునొడువ నాకన్యకామణి, నిందుముఖులు జలకమింట నునిచి.

గీ. కమలకర్ణికఁ గొలువున్న కంజసదనఁ, బోల బంగరుగద్దియఁ బొలఁతి నునిచి
రచితకల్యాణగానాభిరామలీల, మున్నుగా మంగళస్నానమునకుఁ గడగి.

క. ఆనెలఁతకుంతలంబులఁ, జానయొకతె నించెఁ గమ్మసంపెఁగనూనెన్
సూనశరుగుణమునకు రతి, యానెఱిఁ బూఁదేనె దెచ్చి యలఁదినపగిదిన్.

క. శిరసంటిరి జలకము లా, ర్చిరి తడి యొత్తిరి శశాంకశీతల మగుపూ
సురటులగాడ్పుల నలకలు, గరగరగాఁ జేసి రబ్జగంధికి నతివల్. ౨౫౨

గీ. జిలుగుబంగారుప్రాఁతయాంచలఁదలిర్చు, నంచులను జెఱఁగులుఁగలయట్టి తెల్ల
బట్ట గట్టిరి సతికటిఁ బద్మముఖులు, ఫేనవలయితసైకతశ్రీ నటింప. ౨౫౩

క. కన్నియను నతివ లలఁదిన, నున్ననిగందంబుచేఁ దనూలత యలరు
న్వెన్నెలల యోరలొంటిన, క్రొన్ననవిలుకానివాలుగొన బొనగూడన్.

గీ. పడఁతి బిగియారుకొప్పులో భామ లపుడు
కలయఁ దుఱిమిన కమ్మచెంగలువవిరులు
*దనరెఁ దద్దర్పముఖ వ్రాల్చు తరణి నీల
పేటి గందర్పగణములు పెట్టి రనఁగ. ౨౫౫

గీ. సుదతిసీమంతమునఁ జేరుచుక్క యొకతె
నిలుపుటయుఁ జూపులకుఁ జాలఁ జెలువ మొనఁగెఁ
దిమిరపుంజంబుఁ దలద్రొక్కి తీఁడిరించు
చంద్రకిరణకుమారకచ్ఛాయ యనఁగ. ౨౫౬

క. ఇరుసుఁదొడిపయిని దొడిగిన, మరురథచక్రములు వోలె మానిని వీనుల్
పరఁగు మణిమయపుఁగమ్మల, మురువునఁ జూపరులడెందములు ముద మొనవన్.

గీ. పలుదముత్యాలపేరిందువదనగుబ్బ
చన్నుఁగవ నొప్పె నక్షత్రచారుకాంతిఁ
దరళమాణిక్యరుచిశిఖం దళుకుమిగిలి
సాంబుఁ డొత్తెడు గోరొత్తుడంబు వోడమ. ౨౫౮

క. లీలావతి కెంగేలునఁ, గీలించిరి యతులరత్నకీలితభూషా
జాలములు మరునిబొట్టియ, †కోలలకు న్వీరులు చుట్టుకొలిపినపగిదిన్.

క. కామునియింటికిఁ బెట్టిన, హేమప్రాకార మనఁగ నిందుముఖికటీ
సీమ నవరత్నకాంచన, దామక మభిరామ (పుష్ప) దామకమయ్యెన్. ౨౬౦

---

* దానం దత్కర్పముంవాల్చుదరణలీల, పెట్టంగదర్పగుణములు పెట్టిరనంగా—మూ.

† బొద్దియకోల—మూ.

క. శింజితకూజనములతోఁ, గంజేక్షణయడుగుఁదమ్మికవహంసకముల్
రంజిల్లె మొగపుఁగెంపుల, మంజిమ నిజచంద్రకాంతిమంజరిగాఁగన్. ౨౬౧

వ. ఇవ్విధంబున సర్వాభరణభూషితాంగి యగు నయ్యంగన యంజనాంచిత విలోచనకంజంబు లలర ముకురావలోకనం బాచరించె నంత జాంబవతీనం దనునకుఁ బరిణయోచితశృంగారం బొసఁగి రప్పుడు. ౨౬౨

సీ. మ్రోసె నానాతూర్యములు శోభనాంభోధిసంభవచ్చటులనిస్వనము గాఁగఁ
బాడిరి గంధర్వభామినీగాంధర్వగర్వనిర్వాపణకంఠ లతివ
లిభతురంగరథంబు లెక్కి యాదవకౌరవాధీశు లేగుట యధికమయ్యె
నేడుదీవులనుండి యేతెంచువస్తువర్గములచందంబునఁ గ్రంత నడచె
నంకురార్పణ పాలికాసంకులంబు, పూజనాకుంభరాజవిరాజితంబు
నైనరత్నంబుచవికెకు నరిగెసాంబుఁ,డఖిలబంధుసమన్వితుఁ డగుచు నెలమి.

మ. కురువృద్ధుల్ గురువు ల్బుధప్రవరులుం గోటానఁగోటుల్ మహీ
సురవర్యుల్ బలిగాయకు ల్సచివులు న్సూను ల్సఖు లోసదరు
ల్పరివేష్టింప సుయోధనుం డమరె నజ్ఞాతావనీమధ్యమం
సరుచిం దద్భవనంబు నిండుఁగొలువై సమ్మోద మొందింపఁగన్. ౨౬౪

గీ. హరిదంతదంతిపరివృత, హరిహయకరిపోలె గురువు లాప్త్యులు సఖులున్
దొరలును భజింప నీలాం,బరుఁ డోలఁగ మిచ్చెఁ దత్సభాభవనమునన్.

వ. అప్పుడు వీణామృదంగశంఖభేరీ ప్రముఖవాదిత్రనాదంబులు మేదురంబు లయ్యెఁ బద్దదళాక్షులు లక్ష్మీకళ్యాణధవళప్రబంధంబు లనుసంధించిరి, భూసురాగ్రేసరు లాశీర్వాదంబులు గావించిరి, వందిమాగధనైతాళికకలకలంబు చెలంగె నంత. ౨౬౬

సీ. స్రక్చందనంబులసారాంశ మెక్కఁ జోఁ గరువువోసినరీతిఁ బరఁగువాని
వినయవివేకదోర్విజయంబు లొకచోట ముచ్చటకై యున్నమురువువాని
వైభవప్రాభవౌజ్జ్వల్యంబు లొకచోటఁ గూడఁబెట్టినభాతిఁ గొఱలువానిఁ
గాంతిప్రతాపశృంగారంబు లొకచోటఁ బూదెగట్టినయుక్తిఁ బొలుచువాని
సాంబు యాదవవంశావలంబుఁ గాంచి, తానొనర్చినచేఁత చిత్తమునఁ దలఁచి
సిగ్గువడుచు సుయోధనక్షితివరుండు, కూరిమితనూజ నతనికి ధారవోసె.

క. హారకరసుధఁ గ్రోలెడుశా,క్వరముకరణిఁ గ్రోలె యాదవవృషభరాజం
బు రథేశదత్తమధుప, ర్కరసము నిష్టార్థసౌఖ్యకల్యాణదమున్. ౨౬౮

క. జ్యోతిర్లతలు వహించిన, శీతాచలగహనరమల చెలువు వహించెన్
నాతిగమి సాంబపర్శ్వన,జాతస్వేదాంబుధవళజాలధరము నై. ౨౬౯

క. అందఱుఁ గురుపతివారల, యిందీవరనేత్రలెల్ల నేత్రోత్సవ కై
కొందఱు సాంబునివారలుఁ,గొందఱు లక్షణకుఁ గూర్చుకొమ్మలు నగుచున్.

వ. పురంధ్రీకృత్యంబులు నత్యంత ప్రమదంబున నిర్వహించి రయ్యెడ.

గీ. పతియు సతియును గౌతుకబంధనములు, కేలుఁదమ్ములఁ బూనిరి కిసలయాబ్జ
కాంతి నిజకరమున్నిత(ఁ)గాతు ననుచు, నతులకృప బద్ధకంకణు లైరొ యనఁగ.

క. చేలాంచలబంధనములు, బాలకు యదుపాలునకును భాసిల్లె మిథః
కీలితదృఢానురాగ, శ్రీలసితము గానుపించు చెలువం బమరన్. ౨౭౩

గీ. అసురపతియును శచియును నాభిముఖ్య,మున నునుండంగ గాలికెమ్మొలకఁ దెరలి
నడుమ మొగులడ్డమైవచ్చు బెడఁగు మెఱసి, పతికి నతివకుఁ దెర యడ్డపడియె నడుమ.

గీ. పుష్పబాణుండు రతియును బ్రోల్పికోల
సాదనలు చేయుతఱి నట్టిసాధనములు
బెరయుగతిఁ దెరఁ దొలఁగింపఁ బెరసె నొకట
మగువ చూపును సాంబకుమారుచూపు. ౨౭౫

క. పోతుతెర పెంటితెర లు,ద్భూతపయఃకణములొలుకుపోల్కి హారితనూ
జాతుఁడు దుర్యోధనతను,జాతయుఁ దలఁబ్రాలునోయుసంభ్రమ మడరెన్.

గీ. పసిఁడితాళిఁ గట్టెఁ బతి యింతిగళమున, వడఁకుగదురుహా స్తవనరుహమున
జాంబవతికిమున్ను శార్ఙ్గపాణియుఁబోలెఁ,దంష్ట్రిఁబోలుటొప్పఁ దనయునకును

గీ. పులకితప్రకోష్ఠముఁ జకోరలోచన, కెంపుకేలుదొడికెఁ (గృష్ణసుతుఁడు)
శితకరుండు కంటకితనాళ మగునెట్టు,తొగఁ గరంబు సాఁచి తొడుకుకరణి.

క. హోమం బొనర్చునప్పుడు, భామకపోలంబు ధూమపటలము వొదివెం
గాముఁడు ధరించుహారిగల,పై మించునఁ గనఁగవచ్చు పసిమిదలిర్పన్.

గీ. హోమ మొనరించువేళ నయ్యుత్పలాక్షి
మొగము వంచెను మది సిగ్గు మొలచి కాదు
*(మేళ)బింబాభిరాముని జేశచరణ
నఖరచంద్రావలోకనానందమునకు. ౨౮౦

గీ. నెలఁత తోడ వసంతుండు నిష్కుటాంత,రాళకిసలయకలితరసాలశాఖఁ
జుట్టివచ్చువిధంబున సుదతిఁగూడి, ప్రదక్షిణ మొనరించెఁ బావకునకు.

---

* చెసభిబ్బాబిరామ-మూ.

గీ. పతికరాసక్తపాదాబ్జపల్లవంబు, జలజరాగమయుం బైనసన్నెకంట
మెట్టఁగాఁ బూని నేరకి ట్టట్టు జడిసె, నంప్రిరక్తిమ గలయుఁగ నావటింప.

క. ధ్రువదర్శనంబుతఱిఁ బ్రతి, ధవళాక్షియు ధవళనయనదామముఁగాఁ జే
యు వితానంబై పొదివిన, నవకాళం బొరయుచుండె నతిమాధ్గ్యమునన్.

క. మరుపై రతిపై నవకే, సరము లలులమ్రోఁతతోఁ గుజము లొల్కు క్రియన్
ధరణీసురు లార్ద్రాక్షత, లిరువురకు సమంత్రకముగ నిచ్చుట యొప్పెన్.

చ. అనఘ భవత్ప్రితాపరని నక్కడు డాయఁ దలంచి యున్న నా
యనఁ బరివారయుక్తముగ నన్నిటిఁ దెచ్చినవార మంచు ది
గ్వనితలు చూపుచందమునఁ గాంతలు కాంచనపాత్రయందు నిం
చినమణిదీపపంక్తి యసుసింపున కిచ్చిరి సంతసంబునన్. ౨౮౫

వ. అమ్మహోత్సవం బఖిలజననయనానందచంద్రోదయరాకాశర్వరియు నమిత పదార్థసార్థవినియోగవిశ్రాణనపాదపవాటియు ననివార్యసల్లాపములయోని లాగోపపల్లవితసరసహృదయోపవనంబును నర్థార్థిచాతకజలధరసమయం బును నయ్యె నప్పుడు భోజనావసరం బగుటయు. ౨౮౬

ఉ. తోరణరాజితం బగురుధూపసుగంధిగవాక్షమాత్తకా
శ్మీరపటీరనీరకణసేచన ముజ్జ్వలహేమపాత్రవి
స్తారము రంగవల్లిలలితంబు వితానలతాప్రతానవి
స్ఫారము నయ్యె భోజనముశాల విశాలదృశ ల్పొనర్చుటన్. ౨౮౭

—( పెండ్లిలోని మేలములు, భోజనములు )—

క. చిఱునగవులతోఁ గన్నుం, గిఱుపులతో సాళగంబు గేరడములతోఁ
దఱచయ్యె జాణతనములు, నెఱతన మిరువంక బంధునివహంబులకున్.

సీ. గుహ్యకేశశ్రీలఁ గోరగింపుము నీవు పరమభద్రము ప్రజాపతి యొసంగ
సర్వేంద్రియప్రీతి చాను కియ్యది యిచ్చె గురుతరగుణరత్నకోశమీవు
లలితశష్పశ్యామలం బిచ్చెలువకొప్పు కామపాలకవృద్ధి గలుగునీకుఁ
గుడుపుసుఖంబు నీకునె కాని లేదెందు లలితంబు పంచాంగుళంబు నీకు
నవ్యబిందుత్రికోణార్చనాప్రశస్తి, శాశ్వతం బగుఁగా కంచు జాణతనము
లాడిరిరువంకసరసులామ్రేడితముగ, భుక్తిగృహకాయమానాగ్రభూములందు.

ఉ. పచ్చనినారికేళదళపంక్తి నొనర్చినమాయపాము వే
తెచ్చి మృగాక్షి యోర్తు............... ౨౯౧

చ. ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...
.........నృతపీఠము వెట్టినఁ గూరుచుండి వె
క్కసముగ మ్రొగ్గఁ గూర్మగతిగాఁ గని నవ్విరి వాని నందఱున్.

చ. పదనలినంబుల న్వెలచి పావలు మోట్టుచుఁ బోయిపోయి లేఁ
గొదమపిసాళియాదవుఁ డొకొం డొకకొండొకగుబ్బలాఁడి వ
య్యెదచెఱఁ గింత తాఁకుటయు హేమమృగంబును బోలె ధైర్యమం
దదుకులు గాఁగ మ్రొగ్గె మలయానిలకంపితచందనాకృతిన్. ౭౯

సీ. పెడమర్లి చూచుచోఁ బెడమర్లి యేయు నయ్యాసమబాణాసవిద్యకుఁదలంకి
యభిముఖక్రీడల నాభిముఖ్యమ్మున నేయువేగమునకు నెదచలించి
యిరుప్రక్కయొరయుడు నిరుపురినంటసిలఁగ నేయుచాతురులకును నదరి
చూచిపోయినపోటుచూపుల వెంట నారాచంబులేయు దుర్ధరత నెరిసి
వారయాత్రికకీటులకుఁగార వేంద్రు,నూడిగపుఁగొమ్మలకుఁబొందులొకటఁ జేయఁ
దమకపడుకంతునకుఁగార్యదాహ భరము, చాల వెక్కసమయ్యె నాసమయమునను

గీ. *ఆసుమోధనపుత్రుఁడింపారలక్ష్మ,ణాఖ్యసుకుమారుఁడవ్వారయాత్రికులకు
నాంతరప్రాప్తి యెఱిఁగి తానామతించి, యావటించెను వివిధపాత్రాసనములు.

సీ. నడుములు నులియక నసుఁబ్రాయిచూపక జంటలు పొదువక చాఱలేక
ముక్కలు మురియ కామోదంబులు మెఱయ వదలక చిముడక చెదరిపోక
యడుగంటిపోక యూష్మాసక్తి వదలక నూఁకతో నుడుకక ప్రేఁకఁదనము
నొందక వైశ్లథ్య మొందక యపచన గాక శ్లిష్టముగాక కాటువోక
దివ్యమై భవ్యమై సుధాదీప్రమాచు, స్వాదుతరమైన చొక్కపుటోదనమ్ము
ప్రియము నొదవించె వారలనయనములకు, వారయాత్రికపాత్రప్రవర్తియగుచు.

సీ. నివురుచుఁగలయంగ నెయిచిల్కి తియ్యఁగూరలతోడఁగొంతతొల్త్రాలి భుజించి
రమణీయతరమధురవ్యంజనములతో నాసక్తి నొకకొంత యారగించి
సస్నేహమున నమ్లసారశాకములతో సంతసంబున నొకకొంత సిరిమి
రసపరిపాకసంరంభంబుతోఁ గొంత యలవోకబలె నొయ్య నాహరించి
శిఖరిణులుఁగ్రోలియఁ బళ్లుజిహ్వఁజలికి,గమయుకలవంటకములతోఁగొంతదీఱఁ
గ తినబప్ప యణీదధిఖండమిళిత,హితమితాన్నంబు గబళించి రెల్లవారు.

* ఆసురయోధనపుత్రుఁడింపారలక్ష్మణుఁడనుకుమారుండు వారయాత్రికులకంత, రాంతర
ప్రాప్తియెరిగి యావటించె-

మ. పెసరుంబప్పున నేతఁ దేనియల గబ్బెపైన చాఁపట్లు సా
రసనేత్రీకరగత్తము ల్గొనిరి సాంద్రప్రీతి భోజాన్వయో
ల్లసనాపాదకు లైనయాదవులు ఖేలన్మన్మథాయోధన
వ్యసనక్రీడకు *నుబ్బు గాథముగ భావఙ్గోణిఁ జింతించుచున్. ౨౯౮

గీ. కాంత యొకరూపలావణ్యకంతునకును
మిషము ప్రకటించి మంచియామిషము నొసఁగ
రిక్త మగు చట్టియే క్రమ్మరించెఁ గాని
పూర్ణపాత్రంబు నెఱుఁగదు పొదలుతమిని. ౨౯౯

క. అనముచిరిపునకును లే, దాన యిది యటంచు నొర్తు హాలపాణికి బె
ట్టానించెఁ బలలసారము, మానితమధుపానమత్తమానసుఁ డగుటన్.

క. హాలతాళాంకున కొకసతి, కలితాళుల తేనెతువర కన్నటు వొదువన్
మిలమిలదత్తుం డతఁ డగు,దళదళితప్రాతరబ్జతాదాత్మ్యముగన్. ౩౦౦

చ. లులివడ వెల్వెలంజలుగులో హావణించిన వెండిమండెఁగల్
హాలధరునెయ్యుఁ డైనయొకయాదవవృద్ధున కెత్తి పెట్టుడున్
ములుచ యతండు వానివిధముం బరికింపక వీఁగుఁబండులం
బలిమిఁ గిలించి తివ్వ మునిప ల్లొకటూడిన నవ్వి రందఱున్. ౩౦౧

చ. కలమృదువాణి యొర్తు సహకారఫలంబులు తెచ్చి పట్టుడుం
జెలువుఁడు యాదవుం డొకఁడు చేకొని గోరున నొక్కుచుండెఁ ద
త్ఫలములలోనఁ బండొకటి భావకు లారసి వీఁడు దీనిచ
న్గలఁతియ జంద్రరేఖ లిడఁగా దమకించె నటంచు నెన్నఁగన్. ౩౦౨

క. ఒకఁడు కవోష్ణము లగుమో,దకములు గొనగొటి సోఁకుతాఁకుల సెలసెం
బ్రకటితయావనభారో,ష్మకలితజలజేక్షణాకుచంబులు వోలెన్. ౩౦౩

వ. ఈలక్షణంబున నుభయపక్షంబులందలి (విందులును) బక్ష్మలేక్షణలు గో రేక్షురసద్రాక్షాపానకమధురాధరయు, నసాధారణారుణాస్వాదన గోధూమమోదకపయోధరయు, వింశదుపదంశకవివేకపాకవిలాసమానసయు నగు భుజిక్రియాతోయజవదనం బొదివి నిజరసనాంచలశయ్యాసాంగత్యంబునకుం దార్చినఁ బేర్చినసంతసంబున నుల్లసించుచు నుండి రట వివాహమహోత్సవంబు వివిధవిలాసినీలాస్యవిలాసంబులవలనఁ బ్రకటపటహాఝల్లరీఝర్ఝరీ

* నుబ్బుగాణముగ-మూ.

స్ఫూర్జితంబులవలనను సరససల్లాపాటోపంబులవలనను బరమానందదీపకం
బై ప్రవర్తిల్లె నంత దివసచతుష్టయానంతరంబున. ౩౦౪

చ. కురుపతి యిచ్చె నల్లునకుఁ గూఁతునకు న్నరణంబు సైంధవ
ద్విరదశతాంగహేమమణిధేనురథంబుల నవ్యయావనో
ద్ధురతరుణీసహస్రములఁ దోయరుహాకరవృక్షవాటికా
సరసరసాలసాలవనసంవృతముల్ బహుపట్టణంబులన్. ౩౦౫

—॥ బలరాముఁడు సభార్యుఁడగు సాంబునితో ద్వారకకు వచ్చుట ॥—

గీ. పరమకళ్యాణనిధులదంపతులఁగొడ్చుఁ, గోడలినిదోడుకొనియదుకుంజరంబు
మరలెద్వారకకవనిసమ్మర్దహేతు,వాహినీఘోషపూర్ణదిగ్వలయుఁడగుచు

చ. ఎదురుగ నేగువారలును హేమనగోపమహర్మ్యరేఖలం
దుదనన నెక్కువారలును దోరపుఁబ్రోవులు గట్టి రచ్చలం
గదలక నిల్చువారు నయి కన్నులు వచ్చినయంధు లట్లుగాఁ
బాదలిరి పౌరు లాహాలి సపుత్రకుఁడై విజయంబుసేయఁగన్. ౩౦౭

గీ. ఇరుఁగెలంకుల సాత్యకి యుడినతోడు,చూపుపౌఁజులనడుమవచ్చుచుబలుండు
మలసె నీలాభ్రపంజరమధ్యవీథిఁ,జక్కఁ జనుదెంచుపూర్ణిమాచంద్రుఁబోలి.

క. హలహాలికతోఁ బదాతులు, కలగొన సేవార్థ మెదురుగాఁ జిమ్ము పటాం
చలముల తళుకులు వొదివెన్, హలిఁ బురలక్ష్మీదృగుత్పలావళి వోలెన్.

వ. ఇవ్విధంబున మధుమథనాగ్రజుండు యాదవావసథంబుఁ బ్రవేశించి రథా
వతరణం బొనర్చి యథోచితంబుగాఁ బరివారంబు వీడ్కొని కోడలిం గొడు
కునుం దెచ్చి జాంబవతి కిచ్చుటయు. ౩౦౮

సీ. అనుపమప్రీతి సత్యభిరామచైత్రుండు రోహిణీపరివృతరురుధరుండు
దేవసేనాన్వితత్రినయనపుత్రుండు వాసనావశగంధవాహభర్త
విష్ణుభక్తిమిళద్వివేకప్రరోహంబు వేలానుకూలకల్లోలమాలి
వల్లీమతల్లికావ్యాపామరద్రువు రూఢరత్నద్యుతిరోహణంబు
నన సభార్యుఁడైన యాత్మనందనుఁ గాంచి,పరమహర్షపూర్ణభావ యగుచు
జాంబవతి చెలంగె. సంత్యక్తపరితాప, యై పురంధ్రిజనము లాదరింప.౩౦౯

క. నవచంద్రికాపరిస్సృత, ధవళాంశుసనాథకులిశధరదిశకరణిం
బువుఁబోఁడి యొప్పెఁ గురుభూ,మివరసుతాకలితసాంబమిళితసవిధ యై.

ఉ. అంచితభక్తి భల్లుకవరాత్మజ కోడలుఁ గూర్చిపట్టి వ
ర్ధించుటఁ గోరి లౌకికవిధిక్రమ వైదికమార్గసూక్తిఁ జే
యించె గృహప్రవేశమున కెయ్యది యుక్తము దాని నెల్ల ని
ర్వంచితవైభవావయవభాసురభూసురరాట్కుటుంబి యై. 303

గీ. భూసురశ్రేష్ఠు లొసఁగిన సేసఁబ్రాలు,కరము శుభకర మగుటను శిరమువంచెఁ
దల్లిపదపద్మములతావి తనివిఁ గ్రోలె, సాంబుఁ డస్పందదాశీరవంబు కలిమి.

సీ. శ్రీభర్త ప్రార్థింప శివుఁడు ప్రసన్నుఁడై జనియించె నీతఁడై జాంబవతికి
వేదధనుర్వేదవిద్యారహస్యంబు లితనియాకృతియందు యిరవుకొనియె
నభివృద్ధిఁ బొందె లోకానందకరలీల నీతఁడు శుక్లపక్షేందునట్లు
లితనికతమ్మున నీయదువంశంబు రత్నకీలితసువర్ణంబు వోలె
నెవ్వనితరంబు దక్కెఁగా కితని కౌనె, కౌరవానీకపాథోధిగాఢశౌర్య
మంథరముల మథించి సమగ్రవిజయ,లక్ష్మి గైకొంటయనిజనుల్సాంబునంద్రు.

వ. ఏవంభూత ప్రభూతజనవ్రాతస్తోత్రపాత్రీభవచ్చతురుం డగుసాంబుం డంబుజో
దరాతిరిక్తప్రభావిభాసమానుం డయ్యెనంత నొక్కశుభదివసంబునఁ బ్రాథాం
గన లాగూఢపదశయను తనయునకు నవోఢాసంగమాంగీకారంబు గలిగిం
పవిశాలరమణీయం బగునొకకేళిభవనంబు గల్పించి రది యెట్లనిన.

—గృహప్రవేశవిశేషములు—

రగడ. పొదిగొనఁ జుట్టినపువ్వుందోఁటలు, మదకలకీరసమాజమునాటలు
నినుపగు గొజ్జఁగనీటికాలువలు, పెనఁగొన వనరులు పెనుచునీలువలు
వలయు జాళువాబంగరుకోటలు, కలపుంస్కోకిలగణములపాటలు
సాలభంజికలసయ్యాటంబులు, లాలితకేకికులాఘాటంబులు
హారినీలభ్రమరాలంకృతములు, సరసఁ బసిఁడియంచలకేంకృతములు
కీరలు మరులుచిల్కెడుశారికలును, బరిమళభరసంపద చేరికలును
రతిమన్మథచిత్రమయపుటెడుపులు, వితతరత్నభృతవేదుల నిడుపులు
ఓంచినకస్తురి నిగరపుఁ దలుపులు, మించిన వీణియమేళపుఁ గొలుపులు
జిలుగుకావి మంజిష్ఠల తెరలును, మొలచుహిమజలముసురులపెరలును
మగువలు నుసిరుచు మరుపైఁబదములు,గగురుపొడుచుశృంగారపువిధములు
పొగయనిసిరి కర్పూరపుదీపములు, చిగురుకొనిన మణిశిల్పరూపములు
కుహూనామహిళలకోలాటంబులు, రహిగేహీకుధరములకూటములు

పొదలుఁబదునుపుష్పాడిదుమారములు, నిదురలమలయానిలకుమారములు
సకినలమంచముజమలివల్లములు, మొకరము వైభవముల ... యారపులను(?)
బంగరుఁదళియలుఁ బ్రసవమాలికలు, సంగతి          పాలికలు
చవిగల విడెముల జాలవల్లికలు, కువలయగంధులగొనబుటల్లికలు
కలకేళీగృహి కన్నులకింపులు, కొలిపె సాంబునకుఁ గొనకొనసొంపులు.

ఉ. ఆమణికేళిసౌధమున యాదవసింహకిశోర ముజ్జ్వల
శ్రీమెఱయంగఁ గ్రొవ్విరులసెజ్జపయి న్నివసించె లోకల
క్ష్మీముదితాంతరంగముగ సింగపుగద్దియమీఁదట న్రతి
స్వామియుఁ బోలె నూడిగపుఁజామలు సేవ లొనర్చుచుండఁగన్. ౩౧౮

క. పాటలయు మాల్యవతియును, బాటవముగ బుజ్జగించి పార్థివతనయన్
హాటకమయకేళీగృహ, వాటమునకు నడిపి రుత్సవము దళుకొత్తన్. ౩౧౯

సీ. తొలుక్రొత్తవినుకలిం దొలకరించినతమి బ్రహ్మమ్ము లొత్తిన భావబంధ
మాదర్శమండలాభ్యంతరంబున వృష్ణి (రహి) గాంచ హెచ్చిన రణరణకము
వర్ధితాయల్లకజ్వలనార్తయై చంద్రకందర్పులను దూఱఁగలవిరాళి
యుద్యానలక్ష్మీమహోత్సవం బొనరించి వరము లర్థించుసర్వజ్ఞగరిమ
కులమువంశంబుసడికోర్చి చెలువునకును, దనకుఁదానయిలోనగుదంటతనము
నాది యగుతొంటిచెయ్వుల నవఘళించి, లక్షణాకన్యమదిఁబర్వె లజ్జబిగువు.

శా. తాదృక్కంపసముద్గమావృతముఁ దత్తాదృజ్ఞవస్వేదముం
దాదృక్సాధ్వసవిహ్వలాశయముఁ దత్తాదృగ్జడత్వస్థల
త్పాదన్యాసము నైనదేహలతతోఁ బద్మాక్షి యేతెంచె న
య్యాదోమధ్యశయానసంభవునిశయ్యాప్రాంగణక్షోణికిన్. ౩౨౦

గీ. కదిసి పుంఖానుపుంఖంబు గాఁగ నేయు, మరునితూపులగరిమంబు సరకుగొనక
వెనుక ద్రొక్కించె లజ్జాప్రవేలభరము, హస్తిపురనాథనందిని నడ్డగించి. ౩౨౨

సీ. బుజ్జగం బొదవించి పోఁజూచుసకియల విక్లబేక్షణముల వేగఁ ద్రిప్పు
సెజ్జపజ్జకుఁ దార్పఁజేచాయఁబతిమోముసుళుగువారఁగనోరచూడ్కిఁజూచుఁ
గపురంపుదివియల కాంతిప్రవాహంబుమాటున జుఱుఁగుచు మమత వెదకుఁ
బులకలుఁ జెమరునై నిలువెల్లఁ గరఁగించు నిజపాదనఖమున నేలవ్రాయు
మన్మథోద్దీపకములైన మందిరాగ్ర, చిత్రములు చూచి తానును జిత్రమయగు
నేటి కెదురీఁదుకైవడి నెట్టకేల, కధపుసన్నిధి నిలిచె శీతాంశువదన. ౩౨౩

చ. గొదకొని పద్మినీలతికఁ గొమ్ములయొద్దికిఁ దార్చి యొప్పున
మ్మదకరిపోలె సాంబుఁడు రమారమణీరమణీయమూర్తి న
మ్మదవతి బాహుపంజరసమాశ్రయశాలినిఁ జేసె మన్మథ
ప్రదరపరంపరాపరమబాంధవదత్తసహాయసారుఁడై. ౩౨౪

సీ. చెమటచిత్తడి వాఱఁ జిమ్ము కైతవమున గగురుపారఁగఁ జూచుకములు నివురుఁ
దాంబూలరససిక్తదంతరత్నావళీదర్శనాకాంక్షఁ దత్తఱమునొందు
శిర సొరసేసిచం జెక్కులు చుంబించు శిరసెత్తఁ గెమ్మోవి చిగురుఁ దొడుకు
నూరుసంవాహనం బొనరించు దృఢనీవిబంధనం బూడ్చునుపాయ మరయు
దర్పకుని మోహనాస్త్రసంధానముద్ర
తనదుకౌశల్యమునకుఁ గైదండ యొసఁగఁ
నంకపాళిసమాసీన నధిపతనయఁ
బొదివి సాంబుఁడు నవరతాభ్యుదయవేళ. ౩౨౫

ఉ. చిత్తజునైన నైదుపదిసేయఁగఁ జేయుచు డాయుస్త్రీళఁ జే
ఱెత్తఁగఁ జేసి సాంబుఁడు (నహీన)తరావటుకుంతలంబుగా
నొత్తిలి క్రోలె నవ్వికసితోత్పలపద్మదళాయతాక్షి లే
లత్తుకమోవిఁ దత్పరిగళత్సుధ గప్పినడప్పి దీర్పఁగన్. ౩౨౬

క. భామినిహ్రీదుర్గముఁ గొను, సామర్థ్యము గలిగెఁ బతికి సతికటిచక్రం
బేమెయి నీఁకఁ జేకుఱు నయ, సామగ్రీచరులకును నసాధ్యము గలదే.

గీ. దర్పకానుజుఁ డొకరీతి నేర్పుమెఱసి
నీవి సడలించుటయు జాఱిపోవనీక
కాంత మొలనూలిమొగు నంశుకంబు నాఁగె
సద్గుణుల కొప్పు మిత్రవ్యసనము నుడువ. ౩౨౭

సీ. శ్రవణరసాయనాస్వాద్యంబులై పర్వు పలుకులకొసరులు చిలికి చిలికి
కెలవులు కొంతసోఁకియుసోఁకములుగాఁగఁగుచకుంభములుగానగోళ్లనొత్తి
శిథిలలజ్జయుఁగాఁగఁజిఱుఁబోఁకముడిఁజార్చియూరుమూలమునొయ్యనుపచరించి
బిగియారుకౌఁగిట బెడిదంపుధమ్మిల్లపుష్పసౌరభము లాఁపోవఁ గ్రోలి
జంకెనలకోర్చి బింకంబుసాధుపఱిచి, కినుకఁగనుమూసి ధైర్యంబు క్రేళ్లుమలఁచి
బాలనుపభోగలీలకు నూలుకొలిపె, శంబరారాతికృపకల్మి సాంబుఁడపుడు.

స్రగ్ధర. సామివ్యామీలితాక్షిం జలదధరదళ న్సాంద్రఘర్మాంబుధారా
సామగ్రీపుత్రపోలన్ స్తనయుగళదళచ్చంద్రకాశ్మీరచర్చన్
ఝామాక్రాంతత్రపన్ లక్షణ క్షణదరతాఝామశీఝావరీఝా
సౌముఖ్యాయత్తచిత్తాబ్జను గడుఁ గరఁచం జాలె సాంబుఁడు లీలన్. ౩౩౦

ఉ. వ్రీళ నదల్చి సాధ్వసము వెన్నునఁ జే యిడి మానముద్రటి
ల్లాళము లూడ్చి వేడుకలు దార్కొనఁ బొంకము లంకురింపఁ గా
తాళము లుబ్బఁగాఁ దుహినధామశిలామయ పాలభంజికం
బోలఁ గరంచెఁ గ్రొమ్మెఱుఁగుఁబోఁడిఁ గళానిధి సాంబుఁ డింబుగన్.

సీ. మణితులాకోటికోమలనిక్వణములకుఁ గూర్పుచుట్టములయి కొనలుసాఁగి
కంకణావిర్భవఝంకారములకు నత్యాసన్నసఖులై యుఁగవించి
వజ్రకాంచీలతావలయారభటులకుఁ బాణింధమ్ములై పల్లవించి
సకినలమంచంబు జములిచప్పుళ్ళకు నుపదేశకర్తలై యుద్దివడసి
కులుకుటెలుఁగుల కలకలంబులకుఁ బ్రణవ,కల్పనాగౌరవంబులై గజిబిజించి
పడఁతిప్రాణేశుసమరతిఁబచులుగొనుచు,నున్న వెడవిల్తువిలుమ్రోఁతలుప్పతిల్లె.

చ. ప్రకటితహావభావసముపాంతముల న్మది జీవవాటి దృ
ఙ్ముకులనిమీలనంబులును ముంచినయూర్పులు వాడుగాత్రవ
ల్లికలును నై ధృతిం దెలిసి లేమయు నవ్విభుఁడుం బునారతి
ప్రకటితవిద్య నేర్చుటకుఁ బాఠముసేయుదు రాదిసూక్తులన్. ౩౩౩

చ. వినుకలి యాదిగా మదిఁ జివుర్చుమనోరథకల్పవల్లరుల్
వనిచి ఫలంబు నొందుటకు నాతియు నాథుఁడుఁ బూజసేసి రా
నవవిలుకాని గద్దియఁ గనన్మణితల్పముఁ గంతహారగు
చ్ఛనిగళదచ్ఛమౌక్తికమిషంబునఁ జూపుల నార తిచ్చుచున్. ౩౩౪

గీ. తనురతినిమీఱఁగినిసి యోదర్పకుండు, దంపతిశరీరపుండ్రేక్షుదండయుగము
గాఢరతియంత్రణంబున గానుగాడి, పిప్పిగావించి యల్లటు ద్రిప్పివైచె.

చ. తుదిపద మించు కూటములఁ దోయరుహాక్షియుఁ బ్రాణనాథుఁడు
న్నదమద మై నిజాధరరసంబులు గ్రోలుచు నిద్రవోయి ర
భ్యుదితము లైన యూరుపులపోఁడిమి చూపఁగఁ దావిగ్రోలుతు
మ్మెదలు శరీరరక్షు లగు మీనపతాకునికూర్పుబంట్లుగన్. ౩౩౬

గీ. అపుడుశరదిందుచంద్రిక లంధతమస, కోరకంబులు బెరయంగఁ గుదిసె రజని
శిరసు తిలతండులాన్వయశ్రీవహించి, ప్రాలె ముదిమిని దీనమై వనజవైరి.

గీ. గగనకాంతారచరతమఃకాసరమును
దినముఖవ్యాఘ్ర మాఁగియుఁ దనివి సనక
మైందవమ్మృగంబుఁ జూచి రోషారుణాస్య
మెత్తెనో యన నెఱసంజ మెసఁగెఁ బ్రాచి. ౩౩౮

క. ఆతఱి వైతాళికు లు,ద్యోతితచాటూక్తినిపుణు లురగధ్వజజా
మాతృమణిసౌధసవిధ,క్ష్మాతలమున నుండి గాఢసంరంభమునన్. ౩౩౯

—॥ వైతాళికులు సాంబుని లేపుట ॥—

సీ. జయజయ యదువంశజలధిచంద్రోదయ జయజయ కంసారిసదృశధైర్య
జయజయ జాంబవత్సుతాప్రియపుత్ర జయజయగిరికుచాక్రాంతిసార
జయజయ చక్రాంకసంతోషవర్ధన జయజయ యాజవంజవసుఖేచ్ఛ
జయజయ కురురాజసైన్యవిమర్దన జయజయ స్మరప్రతిచ్ఛాయకాయ
జయవిరోధివిరోధీశచయదృగంబు,భవభిదేళిమ జయమరుత్పతిసమాన
రత్నభూషణరుచిభరార్ద్రిప్రతీక, సాంబ జైవాతృకప్రభాలంబవదన.

క. మేలుకొను దేవ ప్రాతః,కాలం బరుదెంచెఁ గాల్యకరణీయంబుల్
శీలించు యౌవరాజ్యము, పాలించు మనూపదిష్టపద్ధతిఁ గృతివై.

చ. సవితృతురంగయంత్రణభుజంగమపుంగవభోగరత్నజ
చ్ఛవి యనఁ దూర్పున న్నెఱసె సాంధ్యవిభావిభ
దాస్తనవినూతనకుంకుమపంకసంకర
వ్యవహితకైటభాంతకభుజాంతరవిభ్రమభృత్ప్రకార మై. ౩౪౨

క. సాలముల వృంతబం(ధము, లోలి సడలంగ) రాలుచున్నవి పువ్వుల్
శీలవదవనిసురాంజలి,కీలితసూర్యార్ఘ్యబిందుకేసరసమతన్. ౩౪౩

క. సారసకారాగృహసం,చారంబు దొలంగి సమదఝంకారములన్
బోరుకలఁగెఁ దేఁటులు సం,సారవినిర్ముక్తయోగిజనసదృశము లై. ౩౪౪

శా. ఏతన్నిష్కుటశాఖిశాఖలపయి న్స్వీయౌసుఖాపాదిత
న్లాతాంతవచక్రచక్రములఁ బొల్చు న్మంచులేఁదుంపురుల్
ప్రాతర్లక్ష్ముల నూత్నమౌక్తికకలాపస్యూతమాసూసక
వ్రాతంబుం బలె యాదవాన్వయసుధావారాశిచంద్రోదయా. ౩౪౫

మ. నలినీబాంధవపూర్ణగర్భయగు సంధ్యాదేవి నిట్టార్పులై
కలయం బర్వెను శీతవాయువులు నక్షత్రంబు లేతద్విభూ
షలచందాన విచేయశం బొరసె జ్యోత్స్నానాథబింబంబు వె
ల్వెలనయ్యె న్నవచాంద్రపాండురరుచి న్వేవే తదాస్యాకృతిన్. ౩౮౬

సీ. గగనశమీవినిర్గతకీలికీలంబు లబ్జినీనేత్రదివ్యాంజనములు
కైరవనిద్రాసుఖప్రాప్తిహేతువు లహరాదిభర్గజటాంచలములు
చంద్రనిష్పీడనోత్సవరాహుదంష్ట్రలు త్రిదివసౌధాంతప్రదీపశిఖలు
జ్యోత్స్నాంబునిధికుంభసుతకరక్రీడలు తారకాప్రసవోగ్రమారుతములు
ప్రాఁకెనథమునభినవప్రభఁబ్రభేశ, కిరణడింభంబులొకకొన్ని సరసఘుసృణ
విసృమరచ్ఛాయదాయాదవిలసనములు, దళితమందేహదేహరక్తకణగణన.

చ. శరపరుషాహతిం గుసుమశయ్యలపైఁ దలిరాకుఁబోఁడులం
బురుషులఁ జొక్కఁజేసి మఱి పొంపిరివోవుజయోదయంబుతో
మరలె నిజాలయంబునకు మారుఁడు కుక్కుటకంఠకాహళ
స్వరము లిగుర్పఁ దుమ్మెదలజంట జయాంకము లుగ్గడింపఁగన్. ౩౮౭

సీ. అలకాధిపతిపుత్రు నక్కుపైనెడలించి హరిహయుకొలువున కరిగె రంభ
త్రిదశేంద్రపురబహిర్దేశనిద్రితమైన యైరావణము నిద్రనలువుసానివెఁ
బ్రథమాద్రితటసముద్భవశిలాజతుమఘూచ్ఛిష్టంబు రవిరత్నశిఖఁ గరంగె
సైకతలింగపూజకు నంగవించుచున్నారు సప్తర్షులు నాకతటినిఁ
గమలపారసతీరప్రఘూణకుంజ,పుంజగర్భకుటీకారఁ బొనుఁగువడిన
జక్కవలతాపమంతయుఁజిక్కనయ్యె,నయనములువిప్పె సితపద్మనయనతనయ.

వ. మఱియు నమరతరుణీసరోమరాళం బగుసుధాకరబింబంబు జరఠభావంబు వహించి నిజకళాగుచ్ఛటలు డుల్లి ఫుల్లసిల్లి మసమస నగు నిసువుంజీఁకటి నసలుకొన బిసరుహసఖోస్రంబుల మిశ్రితంబై బ్రహ్మాండగోళంబు కందుకకాళిమం బగుచుఁ గాచఘుటికం బ్రతిఘటించెఁ బరిత్యక్తకైరవపురాణమందిర యగు నిందిర యరవిందబాంధవప్రథమమయూఖరేఖాప్రవాళతోరణాలంకృతంబు లగు తెల్లఁదమ్మిపువ్వుంగ్రొత్తయుప్పరిగలకు బనయనంబుగా వించుచున్నయది, రాజావర్తమందురాంతరావర్తంబు లగునాజానేయహాయచక్రవర్తులు మణిబంధుశిలాకలశజలంబుల ముఖోష్మానిలంబులం గంపించుచు సమలవిముఖితహిమధామాంకచిహ్నంబులు పుట్టించుచున్నయవి, యఘు

మర్షణస్నానపునీతాపఘను లగుమునులు పిడిచివైచినయొల్లియలుమడువుల నిద్రదేఱియుం దేరనిబలాకానికరంబు జోకగైకొనియెం గలకంఠంబులు కులాయకూలంబులు ప్రోక్కి నిలిచి ఱెక్కలువిదిచిపుక్కిళ్లనున్న రేయింటికిసలయకబళంబులు నావులింతలతోడ వాంతంబులు చేయుచున్నయవి, తెందేపల గుమందేహసందోహంబులు తన్నుంబొదివినం గుదిలపడక యుడువిరోధిధరామరకరాంజలిబంధతూణీయంత్రితంబులు నతిశైత్యనిత్యంబులున గుశరంబులేసితద్రక్షోవక్షోరుధిరధారాసారంబులను దసయంగంబునం బల్లవితంబు గావించె వాతాయనవివరాయాతంబు లగుశీతలానిలపోతంబు లసమశరసమరసంక్రీడన వివశహృదయు లగుదంపతుల కింపు పుట్టించుచున్నయవి. ౩౫౦

చ. కరవశచక్రుఁ డై కలయఁ గప్పిన రేపటిమెండ నిగ్గువి
స్ఫురణము పచ్చపట్టుగ నభోమణి కాశ్యపిచిహ్నశాలి యా
నరదముమీఁద నిల్చి విజయం బొనరించుచు నున్నవాఁడు త్వ
ద్గురుఁ డగుకృష్ణుచందమునఁ గొల్వుము మేల్కని దేవ యావిభున్. ౩౫౧

గీ. అని ప్రబోధించువైతాళికాళిగాథ, లురుసుధాధారలయిపీనులారయుటయును
వేగ మేల్కాంచెలక్షణావిభుఁడు నేత్ర, కోణములనిద్ర కెందళ్ళుకుసుమపాదువ.

మహాస్రగ్ధర. బానుజ్ఞ నంచెన్ జలజముఖులచే సంపదద్భాగ్యలక్ష్మీ
చతురప్రక్షాళితాబ్జచ్ఛవికిసలలసచ్ఛత్రనీలచ్ఛదాళీ
వితతంబు ల్భూషణంబు ల్వీడియములు మణుల్ పత్రితానేకశాటు
ల్చతురంపుస్నేలు దయన్ సాంద్రచిత్తం బెలర్పన్. ౩౫౩

గీ. సాంబుఁ డప్పుడు కాలోచితంబులైన, తగుననుష్ఠానవిధు లెల్లఁ దానొనర్చి
జాంబవజ్జాతపాదపద్మంబులకును, నెఱఁగి యాసాధ్వీదీవన నెసఁగె నంత.

మ. అలినిష్పీతరసప్రసూనము చకోరాకృష్టసారేందుమం
*డలి కీరాహతదీర్ణసత్ఫలము శుండాలాత్తగంధాబ్జముం
బలె సంభోగవిభాగనాగరకుఁ (డై ప్రాణేశునా) యాయిచ
ర్యలలోఁగొన్నఁ జలించులక్షణ స్మరవ్యంగ్యోచ్ఛలద్దర్ప యై. ౩౫౪

గీ. పాటలయు మాల్యవతియు నప్పాటఁ బాట, లాంశునుద ... సయ్యాటమెసఁగ
నలికలితప ద్మకింశుకదళపటీత, కందుకంబులు దెచ్చి లక్షణకు నొసఁగి.

*డలికిన్ రాహుత దర్పసత్ఫలము—మూ.

గీ. ఇంతియీతమ్మిరెమ్మొప్పునో యీ ప్రసూన, కందుకద్వయి యొప్పునో నందియంబు
వాయనాన నతియిమ్మన్న దో యజాక్షి, వారినదలించెఁ గనుచూపువాలుఁ గొనల.

క. అత్తఱిఁ బాటల యిట్లను, మత్తద్విపరాజగమన మాకిపు డిట నీ
చిత్తంబుఁ దెలుప వేటికిఁ, జిత్తజు ననుజ గదా. 3౫౭

ఉ. నీవును నీమనోధవుఁడు నేఁ డిపు డేగిన రాత్రివేళలం
బోవువిహారముల్ దెలుపు బొంకిన మన్మథునాన యే నన
న్నీ వన భేదముం గలదె నెచ్చెలియు న్నెలిగాఁగఁ గుప్పెం(?)
బ్రోవుగఁ జేయవచ్చునె నిరోధ మొనర్పకు మైత్రి కియ్యెడన్. 3౫౮

గీ. అనిన బోటి మాటలాడదు మోవిపల్లొత్తు బయలుపడుట కోహటించి
తనువుఁదావి గ్రోలు దంభంబుమైఁ గమ్మఁ, దమ్మి నెమ్మొగంబు దార్చెఁగాని.

వ. తార్చుటయు మాల్యవతి కురుకులశిరోమాణిక్యంబున కిట్లనియె.

సీ. వినిపించితివి గాదె వినుకలిం బొడమిన వలపుముంగలి మొల్ల లలిశిరోజ
యానతిచ్చితి గాదె గనుబుట్టుతమకంబు కలువకంటి
కనుపించితివి గాదె కందర్పచంద్రానిలముల దూఱుచు మనోలాఘవంబు
తెలిచిరా జని యరదమెక్కెడు సాహసాతిశయము
నాదిమధ్యాంతములు భవదంతరంగ, ముత్తరంగంబు లెటిఁగినముద్దుఁజెలుల
కెల్లదు యిగురుఁబోఁడి, నేఁటిరాత్రిటినీరహోనిర్ణయములు.

సీ. మొకరితు మ్మెదతేఁడు మొగివిచ్చు నత్తమ్మి భుగభుగామోదమ్ముఁ బొదివిక్రోలె
సమదకీరము చేరి సారస్యనిధి యైన మోవిపంటిరసమ్ము మూతిఁ జేర్చె
మాధవుం డొనరించె మంజకీయుగమునఁ గిసల గ్రకీలనంబు
గంధాంధనాగంబు కరపుష్కరము సాఁచి బంగారునన(టికింబములు దొడికెఁ
బూర్ణచంద్రుండు విధుకాంతపుత్రిఁ గరఁచె, నింతియీమాత్రమే మగునింతకన్నఁ
గలవి శేషంబు(లున్న) నీకడ నెడాఁచు, మనుడు నీలాబ్జమున వైచె నతివ చెలిని.

వ. ఇవ్విధంబున నవ్వధూరత్నంబు చిరత్నసిద్ధానురాగబద్ధహృదయ లగు లీలా
వయస్యలు చేయునర్మరహాస్యరసానుభవంబునం బరమానందంబు ననుభవిం
చుచుం బెంపు మిగిలి మగని కూరిమిమున్నిటికిం దేటవెన్నెల లగు చిన్ని
నవ్వులును బ్రియనయనాంబుజంబులకుం బ్రాతరాతపారుణ్యంబు ... లును
నధిపతి బాహుపంజరమునకుం గీరాయమానం బగు శరీరలక్ష్మియు నను

క్షణప్రవర్ధమానం బై మెఱయ నతివినయవిశదహృదయ య్యై పొదలు చుండె నయ్యవసరంబున. ౩౬౪

—॥ శ్రీకృష్ణుఁడు ద్వారకకు వచ్చుట ॥—

స్రగ్ధర. భేరీభాంకారముల్ గప్పె దిశల భ్రమరీబృందఝుంకారధారా
పూరాసక్తప్రసూనంబులు బడిఁగురిసెం బూర్ణిమాచంద్రబింబ
స్ఫారంబై యొక్క తేజఃపటలము దివిపైఁ బర్వె దుర్వారలీలన్
నీరేజాక్షుండు సేనాన్వితముగ రథియై నెమ్మి నేతెంచు వేళన్. ౩౬౫

వ. ఇవ్విధంబున నమ్మధుమథనుండు ద్వారకాపౌరనయనచకోరచంద్రమండలుం డగుచు నిజాంతఃపురంబు ప్రవేశించి, దేవకీవసుదేవబలభద్రప్రముఖులగు గురుజనంబులకు నభివందనం బాచరించి, తదాదరమేదుర ప్రమోద ప్రసాదభరితహృదయుం డై యభినవకల్యాణకౌతూహలకమనీయమూర్తులగులక్షణాసాంబుల కానందంబు గలిగించుచు నుచితవిహారంబులం బ్రవర్తించుచుండె నని. ౩౬౬

క. ఈసాంబోపాఖ్యానము, వ్రాసినఁ జదివినను వినిన వసుదేవసుతుం
డాసాధుజనుల కొసఁగును, వాసవనిభభోగభాగ్యవైభవలక్ష్ముల్. ౩౬౭

శా. ... ... ... ...
నక్రగ్రస్తకరీంద్రరక్షణ*టంచత్పింఛతాపింఛశో
భాక్రాంతాంగ విహంగపుంగవతురంగా రంగధామేశ గా
... ... ... ...

క. కరశంఖధ్వనివిదళిత, సురరిపుగర్భాంతరాళ సూత్రవతీనా
థరచితసైన్య సత్వా, † . ౩౬౮

పంచచా. జటీ...ద్రుమాచ్ఛతల్పచారుచంద్రఖేలనా
సటీపటీరహీరవర్ణ శాలిశూలిమీలనా
చరిష్ణుగోకదంబచాలనా
కటీతటీపటీవిలగ్నకాంచికాసుమేలనా. ౩౭౦

గద్యము ఇది శ్రీమత్తిరుమల శ్రీనివాసాచార్య కరుణాపారంపర్య పాత్రాత్రేయగోత్రాపస్తంబసూత్ర పవిత్ర సకలకళాభోజ రామరాజరంగప్పరాజప్రణీతం బైన సాంబోపాఖ్యానంబునందుఁ బంచమాశ్వాసము.

సాంబోపాఖ్యానము సంపూర్ణము.

---

*రక్షణవి కచటంచత్పింఛ-మూ. † ధరనతిత్విశళజభువనా- అని యిక్కడ నిగ్రథకము గానున్నది.